# భారతి

Received 23/8/'59

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్


ఆంధ్ర సాహిత్య పరిషత్తు,
కాకినాడ.
TELUGU ACADEMY, COCANADA

అగస్టు 1959

సంపుటము 36 : : సంచిక 8

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1959



## సెప్టెంబర్ సంచికలో

# విశ్వనాథ మధ్యాక్కఱలు: శ్రీగిరి శతకము

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

త్రొక్కిళ్లు నెక్కిళ్లు మఱి దిగుళ్లు నీధూళి దర్శన మ
దొక్కసారిగ శ్రమయంతయుం జోపు నోయి మహేశ
స్రుక్కిపోవుచు నెండ నడచి పెనుమర్రి సులభశీతలతం
జొక్కెడునట్లు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

అనుభవ పరమార్థహీన భావమ్ము లవియెల్లం గూర్చి
తనర వారును వారు చెప్పినట్టి శబ్దమ్ము లర్థములు
నిను నేను బొగడ నీపెదవిపై నవ్వు నెరసు చూపవును
సునిభృతమహాన శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

నాగుండె పెకలించుకొంచు నా ప్రాణనాళముల్ చీల్చు
వాగర్థములతోడ నిన్నుం బిలువ నీపరమ నిశ్చలత
లో గీఱగా నన్న తరగవలె నీలలోహిత కదలు
సోగ కన్పడునె శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

స్వామి నాలో నేను గుబ్బిపడి భావము లుబ్బవలయు
నీమేలికదలిక లేని క్రొవ్వెల్గు నీరధిలోన
నేమేమొ తరగలు లేవవలయునా యిది నేనుగాగ
సోమించవలయు శ్రీశైల మల్లికార్జునమహాలింగ!

సర్వతర్కంబులు సర్వశాస్త్రముల్ సంసార మిద్ది
శర్వ! యనాదిగాం జెప్ప మఱియును సాంతంబుగాగ
సర్వదు పొసగింపు నాకు దానితోం బనియేమి లే య
జుర్వేద వినుత శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

తొలివెలుంగా నీవు నన్నురక్షింపం దూగుచున్నావు
కెలనం జేరినయట్టి కొన్నిగ్రహములు కిఱ్ఱలుపెట్టు
తలచిన యుపకృతి భావమునుండి తగ్గిపోవకుమె
సులభఘృణాక! శ్రీశైల మల్లికార్జున మహాలింగ.

అంత దట్టమ్ముగాఁ గ్రమ్మియున్న నీయంధకాసురుఁడు
కొంతగా నప్పటప్పటికి నీశూలకోటి ఘాతములఁ
గ్రంతలు తూట్లైన మేనఁగన్పించుఁ గన్పించకుండ
నుంత, మ్రందించు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

మనసులోపలఁ ద్రవ్వి నిన్ను వెలిఁదీయు మాదిరి కాక
తనగుండెలోనుండి నీవుగా మనోదర్పణంబునను
గనిపించు నేరుపు కలుగునట్లుగాఁ గలిపింపవే క
రుణ కాల్వకట్టి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

జ్ఞానాగ్ని దగ్ధకర్మలని కొంత యాశాద్యోతకముగఁ
బూని చెప్పుటెకాని యాశ! ప్రారబ్ధముల్ పీడ వెపుడు
లేనలే దాగామి సంచితంబు కాలినబొగ్గు పరమ
సూనృతతేజ! శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

నిముసంబు లవి వేనియందు నాబుద్ధి నీమీఁద నిలచి
భ్రమియింపకుండునో యవ్వి చాల స్వల్పపు సంఖ్యకలవి
తమము తక్కినయవి యివ్వి వెలుఁగన్న ధైర్యముకాక
సుమనస్స్వరూప! శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

అలసి ధీవరుఁడైనవాఁడు మరిదేనినైన గ్రహించు
తలఁపుతో వలవేయు నీవు వేసిన దయలేని మాయ
వలదేని కనివేసినట్లు జీవులు వణఁకిపోవుటకు
సొలసిపోవుటకు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

కేవల యోగ్యాదినరదనుపలబ్ధి కృతవాదసరణి
లేవని యున్నావటంచుఁ జిఱుధూళిలేపుట యది, య
భావమ్ము చెప్పుటకాదు కృచ్ఛ్రలభ్యత వచించెదు య
శోవేద్యమాన శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

సూరిమనోవేద్య పడగ పగపాము చుట్టమన్నట్లు
తూటి నిజ నీవు లేవనుచుఁ దెగఁజెప్పెదురు నిన్నుఁగొలుచు
వారి ప్రహ్లాదముఖ్యులను బిట్టుసంభావింతు రేమి
చోరలక్షణము శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

విడతలు విడతలు గాఁగ భావనావేశంబు లెత్తు
వడియున్నయప్పుడు గుండెలోఁపలఁబట్టి పాలార్తు
విడిపోయినప్పుడు దీనుఁడై యెంత పిలచిన రావు
సుడియాడినట్లు శ్రీశైలమల్లికార్జున మహాలింగ!

ఒంది మోదము చెప్పినట్టివా ర్చెప్పకుండఁ జెప్పెదరు
చెంది చిదంబరవీథిలోఁ శివు చేసినానంద
కందలాస్యమ్ము సత్పదనవార్థాభిఘటనంబు పరమ
సుందరమూర్తి శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

మాటలక్రొత్త యేమున్నదో స్వామి మరి నా యెడంద
గాటంపు బాధయే యిచ్చటం గ్రొత్తగాని తానింత
పాటిబాధయు క్రొత్తగాదునా, నీకృపాదృష్టి క్రొత్త
చోట నాయందు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఊరకయుండినవానిఁ గొనిపోవు టొక సంతలోనఁ
గూరుచుండఁగఁ బెట్టుటే పదార్థంబు కోరరాదనుట
కోరినచోఁ దలకొఱవికొని తెచ్చికొన్నట్లె యేమి
శూరత్వ మిద్ది శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ఈవె పోయితి సంతచూతమనుచు నా దేమున్న దనెదో
యీవు వచ్చితి వల్లె వచ్చినావు నాయీ పెత్తనంబు
కైవసంబును జేసికొంటి వందుచేఁ గైమోడ్తు నీకుఁ
ద్రోవచూపు మని శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

ప్రతిదినంబును సూర్యుఁ డస్తగిరిపైనఁ బవ్వళించెడిని
బ్రతుకులో నేదియో పెద్దబగువైన పగిది భాసించు
శితికంఠ నాగుండెమీఁద నృత్యమ్ము చేయుదో యేమొ
చ్యుతసంధికముగ శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

స్నానంబు చేయుచుఁ దుడుచుకొంచును జపము సేయుచును
బ్రాణాలు తేలిపో నీవు కనిపించు భాగ్యమున్నదియె
యీ నా కటంచు నేనెంతగాఁ దపియింతు నీవెఱుఁగు
చో నాకుఁజాలు శ్రీశైల మల్లికార్జున మహాలింగ!

# శక్తి: శక్తము

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

నిత్య వ్యవహారంలో మన మందరమూ 'శక్తి' అనే మాటను ఎన్నో అర్థాలలో వాడతాం. కాని ఆ శక్తిని ఎవరయినా చూచారా? చూడకపోయినా వాడుకలో ఉన్న ఆ శక్తి అందరకూ అనుభవంలో ఉన్నది. లేకపోతే—'నాకు ఆ బరువు మోయగల శక్తి ఉన్నది, నాకు ఉపన్యాసం చెప్పగల శక్తి లేదు గాని పుస్తకం వ్రాయగలశక్తి ఉన్నది, ఈ మొదలుగా ఎన్నో శక్తులను ఎందులకు పేర్కొంటాం? సామాన్యంగా సామర్థ్యాన్ని తెలపడానికి శక్తిపదం మనకు ఊత.

కార్యాన్ని పుట్టించగల ధర్మం కారణంలో ఉండి ఉండవలె కాబట్టి 'కారణంలో ఉండే అలాటి ధర్మం శక్తి' అని తార్కికు లంటారు. నిప్పు ముట్టుకుంటే బొబ్బ ఎక్కింది. బొబ్బ లెక్కించగల ధర్మం నిప్పులో ఉండిఉండవలె అని ఊహిస్తాం.

అయితే మణిమంత్రాదులవల్ల బొబ్బ లెక్కవు. అప్పు డేమంటారు?

కార్యప్రతిబంధకం ఏదీ లేని కారణ ధర్మాన్నే శక్తి అని అంటారు. ప్రతికార్యానికీ ఏదో ఒక ప్రతిబంధకం ఉండవచ్చు. ప్రతిబంధకం లేకపోవడమనేది కార్యకారణభావంలో నే అంగీకరించాలి.

ప్రాభాకరులు అనుమాన ప్రమాణంచేత వ్యతిరేక ముఖంగా శక్తిని ఇట్లా సాధిస్తారు: నిప్పూ చేయీ కలిసినపుడు చేతికి బొబ్బలెత్తుతున్నవి. మణి మంత్రాది సన్నిధానంలో ఆ చేయే ఆ నిప్పే కలిసినా బొబ్బలు కనిపించడం లేదు. కాబట్టి—'ఏది లేకపోతే కార్యం కలుగదో అది శక్తి.' అని ఒప్పుకోవాలి. కాగా కారణంలో శక్తి అనేది ఉన్నది.

సరే, ఈ శక్తి అనేది ఏమిటి?

ఇది గుణాలలోనూ సామాన్యాదులలోనూ కనబడుతూంది, కార్యం పుట్టగానే గిట్టిపోతూంది. కాబట్టి ఇది గుణమూ కాదు, కర్మ కాదు, ద్రవ్యమూ కాదు, సామాన్యాదులలో ఏ ఒకటిన్నీ కాదు. ఇక ఇది వేరే ఒక పదార్థం.*

కొన్ని మతాలు శక్తి అనేది దేవత అనీన్నీ అది ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి అని మూడు విధాల శక్తిగా, గౌరీ బ్రాహ్మీ వైష్ణవీ రూపంలో ఆవిర్భవిస్తుందనీన్నీ చెపుతాయి.

యోగులు ఇలా చెబుతారు:- దేనివల్ల క్రియ కలుగునో అది శక్తి, క్రియ అంటే అవస్థాంతరం. అభివ్యక్తమైన అవస్థ క్రియ; అభివ్యక్తం కాని అవస్థ శక్తి. అభివ్యక్తమైనది ద్రవ్యం కూడా. ద్రవ్యం అభివ్యక్తమవడానికి కారణం క్రియ. ఆ క్రియకు కారణం శక్తి. కాగా మూలకారణం శక్తి.

క్రియ కనబడగానే, 'ఇది దేని క్రియ?' అని ఆకాంక్ష కలుగుతుంది.

ఇక విలోమంగా కార్యకారణభావదృష్టి పెట్టుకొని చూచి—"కార్య ద్రవ్యం అభివ్యక్త మవడానికి శక్తి కారణం" అని అనుమానిస్తాం.

అట్టి ఈ శక్తి రెండు విధాలు. ఒకటి చేతనశక్తి, రెండు అచేతన శక్తి.

ప్రాణుల క్రియలన్నీ చేతన శక్తి. ఉదా: మనః కార్యములగు చింతాదులు, జ్ఞానేంద్రియ కార్యములు కర్మేంద్రియ కార్యములు ప్రాణకార్యములు. వీని అన్నిటికీ మూలంలో క్రియ ఉన్నది. అది చేతనశక్తిది.

అగ్ని, వాయువు, మొదలయినవాని క్రియలు అచేతనశక్తి. తగులబెట్టడం మొదలయినవీ వీవడం మొదలయినవీ వీని క్రియలు. ఈ క్రియలనే దాహకశక్తి, చలనశక్తి అని అంటారు.

ఇక శక్తు డెవడు? లేక ఆశక్తికల ద్రవ్యమేది?

ఎవనికి శక్తి ఉన్నదో వాడే శక్తుడు లేక దేనికి శక్తి ఉన్నదో అదే శక్తం. కాబట్టి ఈ ప్రశ్నలో ఏమి చెప్పవలసినదున్నది? అని అనవచ్చు. అంటే—'అన్ని విధములైన చేతన శక్తులకూ అన్ని విధాలయిన జడ శక్తులకూ మూలమేది?' అని యీ ప్రశ్న.

---

* న ద్రవ్యం గుణవృత్తిత్వా ద్గుణకర్మ బహిష్కృతా,
సామాన్యాదిషు సత్త్వేన సిద్ధా భావాంతరం హి సా.

చేతనశక్తికి మూలం, 'నేను'
'ఎటులు'?

'నే నిశ్చయిస్తున్నాను' అనినీ, 'నేను చూస్తున్నాను' అనినీ, 'నేను వెళుతున్నాను' అనినీ, 'నేను ప్రాణధారణాదులు చేస్తున్నాను' అనినీ ఎవరికిబడితే వారికి అనుభవమే. ఇవన్నీ 'నేను' యొక్కయే క్రియలు. కాబట్టి 'నేను' అనేది చేతనశక్తికి మూలపదార్థం.

అచేతన ద్రవ్యానికి మూలం ప్రకాశ క్రియా స్థితులు. ప్రకాశం అనగా అన్నివిధములయిన జ్ఞానజ్ఞేయాలు. క్రియ అనగా అన్నివిధములయిన క్రియలూ కార్యములూ. స్థితి అనగా అన్నివిధములయిన సంస్కారాలూ ధార్యభావాలూ.

బాహ్యప్రపంచం అంతా గ్రహణ గ్రాహ్య రూపంగా ద్వివిధం. గ్రహణం=ఇంద్రియాలన్నీ. గ్రాహ్యం=విషయాలన్నీ. గ్రహణం విషయజ్ఞాన, చాలన, ధారణాలు చేస్తుంది. శబ్దాదులు జ్ఞేయవిషయాలు, వాక్యాదులు కార్యవిషయాలు, శరీర వ్యూహాదులు ధార్యవిషయాలు. శబ్దం అనే విషయాన్ని విశదీస్తే శబ్దజ్ఞానరూపమైన ప్రకాశమూ, కంపనరూపమైన క్రియా, ఆ కంపనానికి శక్తిరూపమైన స్థితీ ఈ మూడూ కనబడుతవి.

కర్మేంద్రియాలు చూదాం. వాక్కు పలుకుతుంది. అది వర్ణాదులుగా పరిణమిస్తుంది. ఇదే వాక్యరూపమైన కార్యవిషయం. దీనిలోనూ ప్రకాశాది త్రయం ఉన్నది. తమః ప్రధానమైన విషయంలో కూడా ఇట్లాగే ప్రకాశాదిత్రితయం కనబడుతుంది.

కరణముల నన్నిటినీ విడగొట్టితే ఈ మూడూ ఉంటవి. చెవిని పట్టుకుందాం. దీనిలో శబ్దరూప జ్ఞానము ప్రకాశభావం. బయటి వీణాదుల కంపనం వలన చెవికి ఉద్రేకం కలుగుతుంది, ఇతరాలూ కొన్ని-దోరబెట్టుకోవడంలాటివి; ఇదంతా క్రియ. ఏవి మేలుకొంటే జ్ఞానంగా పరిణామం కలుగుతుందో అట్టి స్నాయువులందూ పేశ్యాదులందూ ఉండే శక్తి స్థితిభావం.

ఇవి బాహ్యకరణాలు. అంతఃకరణంలో కూడా ప్రకాశ క్రియాస్థితులు ప్రఖ్యాప్రవృత్తి స్థితిరూపంగా ఉన్నవి. ప్రఖ్య అంటే ప్రకాశశీలత, ప్రవృత్తి అంటే క్రియాశీలత, స్థితి అంటే క్రియా ప్రకాశ నిరోధశీలత లేక సంస్కారం. ఇవే సత్వరజస్తమస్సులు. ప్రఖ్యారూప చిత్తసత్వానికి రజస్తమస్సులు కొలదిగా అంటితే ఐశ్వర్యాది విషయాలలో అది మగ్నం అవుతుంది. రజోమాత్రం అంటితే ధర్మజ్ఞానాదులలోనూ తమస్సు అంటితే అధర్మ-అజ్ఞానాదులలోనూ పడిఉంటుంది.

అచేతన శక్తికి మూలం ఏది అని విచారించుకుంటూపోతే పరమాణువులకడకు పోయి అంతటితో ఆగిపోవలసివస్తుంది. ఆ పరమాణువులకు చలనశక్తి కలదనినీ అవి చలనగుణకాలనీ అనుమానప్రమాణంచే తెలుసుకుంటాం.

శక్తి లేకుండా క్రియ అనేది జరగదు. క్రియ అనేది జరగకుండా ద్రవ్యమనేది పొడమదు.

క్రియ ఉంటే దానికి వెనకా ముందూ జడత్వం ఉండకమానదు. ఆ జడత్వం శబ్దస్పర్శరూప రసగంధాలుగా ప్రకాశం పొందకా తప్పదు. కాబట్టే ప్రకాశ-క్రియా-స్థితులు గ్రాహ్య లేక బాహ్య మూలాలు. ఇవే బాహ్యమూల శక్తాలుగూడా.

శక్తి యీరీతిగా చేతనశక్తి లేక చితిశక్తి అనినీ అచేతన శక్తి దృశ్యశక్తి అనినీ రెండువిధాలు. చితిశక్తి లేక దృక్శక్తి జ్ఞస్వరూపం; ఇది ప్రపంచానికి అపరిణామి కారణం. దృశ్యశక్తి లేక జరాశక్తి ప్రపంచానికి పరిణామకారణం. బాహ్యాభ్యంతర క్రియకు శక్యరూపావస్థయే జరాశక్తి లేక అచేతనశక్తి. అనగా ఇది క్రియకు వెనక గాని ముందు గాని ఉంటుంది కాబట్టి మనకు కనబడని అవస్థ. గ్రాహ్యమైన ప్రతి ద్రవ్యమూ శక్తివల్ల అభివ్యక్తమవుతుంది. క్రియకు పర్యవసానంగా శక్తిలోనే లయిస్తుంది.

అంతరశక్తి మానసికమైన శక్యావస్థ (psychical latency). ఇది సంస్కార రూపం. అనుమాన ప్రమాణంచే సిద్ధం చేయదగిన క్రియాశక్యావస్థ బాహ్యశక్తి.

క్రియ అంటే జరాశక్తియొక్క లేక అచేతన శక్తియొక్క ప్రత్యక్షావస్థ. ఈ క్రియ కూడా అంతరక్రియ అనినీ బాహ్యక్రియ అనినీ రెండువిధాలు. అంతరక్రియ కాలికం. బాహ్యక్రియ దైశికమూ మరి కాలికమూనూ.

ఇదంతా కలిపి చూస్తే కార్యద్రవ్యమూలమూ కారణమూలమూ శక్తిమూలమూ ప్రకాశ క్రియా

# స్వరజతి

శ్రీ "మంజీర"

రైలుబండి జీవితంలో సుఖమయిన రోజులు పరుగెట్టినట్లు పరుగెత్తుతోంది. రావుగారికి మాత్రం రాయపూరు స్టేషనులోకి బండి ఎప్పుడు వచ్చిందో తెలీదు. సామానులన్నీ ఇదివరకే సర్దుకుని సిద్ధంగా కూర్చున్నారు, ఆగగానే దిగడానికి. ఇలా ఆగగానే దిగి, అలా ప్రక్క ప్లాట్‌ఫారంలో ఉన్న మరో బండి ఎక్కకపోతే కూర్చోడానికికూడా స్థలం దొరకనం సున్న.

ముందుగా పోయి ఖాళీగా ఉన్న స్థలంలో పక్క పరిస్తే, తరువాత నిమ్మళం చూసుకోవచ్చునని, ప్రతీ వాడిదీ ధీమా.

తను కాళ్లు సాచుకు పడుకుంటే చాలు, ప్రక్కనే పడిమంది నిలువుని చస్తున్నా కనపడదు. నిద్ర రాకపోయినా కళ్ళు మూసుకుని పడుకుంటాడు తనకేమీ తెలీనట్లు. లేకపోతే అలా కాళ్ళు సాచుకుని పడుకునే, ఏ చుట్టో కాల్చుకుంటూ, పుస్తకం తిరగ వేస్తూంటాడు అసలు ఈ ప్రపంచంతో సంబంధం లేనట్లు.

ఆ మాటకొస్తే, ఈ నవనాగరికతా ప్రతినిధుల కన్న, నాటుపల్లెటూరి మనుషులే నయం. వారి మోటు మనస్సుల్లోనే, కాస్త మానవత్వం, సోదర స్వభావం స్ఫురిస్తాయి. స్వార్థదృష్టి, పరోపేక్షను, ఈ చదువుల్లోనూ, సంస్కారంలోనూ, నాగరకతలోనూ, కరుడు కట్టుకుపోయినట్లు ప్రవర్తిస్తున్నారు.

మన రావుగారుమాత్రం ఈ విషయాలకు ఏమంత అతీతులు గారు. పచ్చటి అరటిపండుచాయ శరీరము, కండపుష్టిగల సుంద్రని మోము, మొత్తమయిన కండ్ల అద్దాలనుండి తొంగిచూసే విశాలమయిన కళ్లూ, ఆజానుబాహువయిన ఆ విగ్రహం చూస్తే, ఎంతవాడికయినా అమాంతంగా గౌరవం పుట్టుకొస్తుంది.

ఆయన ప్రయాణం చేసేది మూడోక్లాసులో నయినాసరే, దాన్ని ఆయన ఒకటవ తరగతి అనుకుంటాడు. ఆ మూడవ తరగతి పెట్టికి ఆ ఒకటవ తరగతి కళవచ్చిపడి ఊరుకుంటుంది నిజంగానే రావుగారి దర్శనమాత్రంచేత.

పరుగు పందెంలో సిద్ధంగా ఉన్నవాళ్లలాగా, ఆ ప్లాట్‌ఫారంమీద చురుగ్గా నిలబడిఉన్న లైసెన్సు కూలీలు; రైలుమీదకన్న ఎక్కువ సందడికలుగజేసే కాఫీ, టీ, అమ్మేవాళ్ళు; హడావుడిగా అటూ, ఇటూ తిరిగే రైల్వే అధికారులూ; మిఠాయిమీద ఈగల్లా ఉన్న ప్రయాణీకుల్నీ చూసేసరికి రావుగారు ఈలోకానికి తిరిగి వచ్చారు.

భార్యామణివైపు ఓ ఓరగన్ను వేశారు.

ఆమె మాత్రం రావుగారి ఠీవి కేమాత్రం తీసిపోదు. అందం, నాజూకుతనం, ఒయ్యారం, చదువూ, సంస్కారం అన్నీ ప్రతిబింబిస్తూన్నాయి ఆమె ముఖంలో. అచ్చంగా రావుగారికి తగిన భార్య అనిపించుకుంటుంది. "రావుగారి భార్య యెవర్రా?" అంటే వెతుక్కుంటూ ఆమె ముందు వాలవలసిందే అడక్కుండానే.

పువ్వులా తయారయి ముద్దొస్తూ కూర్చుంది.

ఆమెను చూచుకుని రావుగారు లోలోపల కాస్త గర్వపడ్డారు.

బండి ఆగీ ఆగడంతోనే "ఇలా రా" అని ఆయన అన్నాడో లేదో, పుట్టమునిగిపోయినట్లు పుట్టలోనుండి చీమలు పైకివచ్చినట్లు, వచ్చి పడ్డారా పెట్టిలోకి లైసెన్సు కూలీలు.

అలా పోటీపడ్డట్టు ఎంతమంది ముందుకు పాకుచుకొచ్చినా, కావలసినది మాత్రం ఒక్కడే అనీ, ముగ్గురు మొయ్యాల్సిన సామానున్నా, అది తప్పకుండా ఒక్కడినెత్తికే ఎక్కుతుందనీ; జీవితమంతా ఈ రైలుబండ్లలోనించి దిగే ప్రయాణీకుల సామానులకు అంకితంచేసిన ఆ కూలీలకూ తెలుసు: ఒక్కడు మొయ్యతగిన సామాను ఉన్నా నల్గురు కూలీలకు సరిపడిన మొత్తం అడుగుతాడనీ, అడిగినంతా ఇచ్చినా సంతృప్తిపడడనీ, రైలు కదిలేవరకూ బేరం ఆడుతూ వాడి పీడ వదలించుకోవచ్చునని ఆ ప్రయాణీకులకూ తెలుసు. ఇద్దరికీ ఈ సంబంధాలు, రైలు మనగడ్డమీద పడ్డప్పటే సంభవించాయి. మొత్తానికి ఎవరి జాగ్రత్తలో వాళ్ళున్నారు.

జీవితంలో రోజు రోజుకూ క్రుంగిపోతూ, క్లిష్టతర సమస్యలు నిముష నిముషానికి ఆపన్నమవుతున్నా, నిర్లక్ష్యంగా, బాధ్యత పట్టించుకోకుండా, మామూలు ధోరణిలోనే కాలం గడపడంతప్ప, కాస్త ఆలోచించుకోడానికి కూడా ఏమాత్రం ప్రయత్నించదని

వాళ్లని చూస్తే జాలేస్తుంది. కొంచెమో, గొప్పో, ఈ అనుభూతి ప్రతీవ్యక్తి హృదయంలో మెదులుతుంది.

కాని సామానులు మోయించుకుని డబ్బులు ఇచ్చే టప్పుడు మాత్రం కనపడదు. ఓ వేళ అలాంటి సానుభూతిపరులు న్యాయదృష్టితో కొత్త ఎక్కువ డబ్బు ఇచ్చినా వీళ్లుమాత్రం అదేం గమనించకుండా ఇంకా ఎక్కువ లాగడానికి అనంత ప్రయత్నాలు చెయ్యక మానరు. చివరకు మిగిలేది: అతనిలో ఉన్న ఆ కొత్త సానుభూతీ ఖూనీ కావడం. అతని హృదయం గడ్డ కట్టడం మాత్రమే.

"ఇదిగో ఇంతే సామాను" అన్నారు రావు గారు కూర్చునే బల్లమీద పేర్చిన సామాను చూపుతూ.

"నేను తీసుకువెడతాను. నేను తీసుకువెడతాను" అని ఎగబడుతున్న ఆ కూలివాళ్లను చూసేసరికి, రావు గారికి అలా మౌనంగా ఊరుకోడం చిన్నతనం అనిపించిందో ఏమోగాని, అకస్మాత్తుగా, అప్రయత్నంగా వాళ్లమీద విరుచుకుపడ్డారు. తిట్టవలసినవి నాలుగూ, గౌరవప్రదంగానే, తమకు వచ్చీరాని ఆ హిందీలోనే ఎలాగో తిట్టి వేటకుక్కలా తరిమారు తమకు కావలసిన ఒక్కణ్ణీ తప్ప మిగతా వాళ్ళని.

వాడి నెత్తీ, భుజం, చేతులూ పట్టినంత సామాను అతికించి ఠీవిగా బయలుదేరారు ప్రక్క ప్లాట్ ఫారంలో ఉన్న బండికి. వెనకాలే శ్రీమతి గారూ ముసి ముసి నవ్వులతో పెళ్ళినడకలు నడుస్తున్నారు.

సామానంతా భద్రంగా రైలుపెట్టెలో పెట్టించి ఆ కూలివాడిచేతనే పైన సామానులు పెట్టుకునే బల్ల మీద తన పరుపు వేయించుకొని, క్రిందబల్లమీద పెళ్లాన్ని పక్క పరచుకోమని చెప్పి, కూలివానితో బేరానికి ఉటంకించారు. చాలదని వాడూ, చాలుతుం దని వీరూ హోరాహోరీని పదినిముషాలు యుద్ధం చేశారు. ప్రక్కన తటస్థంగావున్న పెద్దమనుషులు ఇక పూరుకుంటే లాభం లేదనుకున్నారో యేమో ఇద్దరినీ కొత్త సముదాయించి తునితగవులా సర్దేసి పారేశారు.

వెనక్కి తిరిగి చూసుకుంటూ, గొణుక్కుంటూ వాడు వెళ్ళాడు. తనలాంటి వ్యక్తి ఏదో వెనక రెండణాలకి, ఇంత రాద్ధాంత సిద్ధాంతం ఎలా పెంచా డురా అని ప్రక్కవాళ్ళు అనుకుంటారేమో అనుకుని, రావుగారు తమ మనస్సుని చిటుక్కుమనిపించుకుని, మొఖమంతా నల్లబరచుకుని, ఆ ముఖాన్ని ఇతరులకు చూపించడానికి ఇష్టపడలేక, తన సామానులో సర్ది దానికి ఏమీ లేకపోయినా, సర్దుకుంటూన్నట్లు నటన మొదలుపెట్టారు. కొంతకాలం గడిచేసరికి, వారి ఉద్రేకవాయువులు ఘనీభవించి వారి చుట్టూ చల్లటి వాతావరణం నిర్మించింది. రావుగారి మనస్సు తిరిగి నిశ్చలత పొందింది. వారి ఆకృతి గంభీరత దాల్చింది. చిరునవ్వుతో భార్యామణిప్రక్క కూర్చున్నారు.

ఆ పెట్టెలో మనుషులు ఎక్కుతూనే ఉన్నారు. ఈలాంటి సంఘర్షణలు జరుగుతూనే ఉన్నాయి. హాయిగా కూర్చుని రావుగారు గంభీరముద్రతో ఆ మనుషుల మూర్ఖతకి చిరునవ్వు నవ్వుకుంటూనే ఉన్నారు.

అంతలోనే వంగదేశీయులు అల్లకల్లోలంగా అల్లరి చేసుకుంటూ ఆ పెట్టెలోనే ఎక్కారు. "వాళ్ళంతా కూడా దీన్లోనే తిష్ఠవేస్తారు కాబోలు" అనుకున్నారు రావుగారు మనస్సులో. రావుగారు కూర్చున్న బెంచీమీదనే దంపతులూ, ఓ పిల్లాడూ ఆసీనులయారు. మిగతావాళ్ళు కాకురుబీకురు అంటూ వాళ్ల చుట్టూ చేరి నుంచున్నారు; వాళ్ళని దిగబెట్ట డానికి వచ్చినట్లున్నారు.

ఈ కల్లోలాన్నంతా కలవరపరుస్తూ, రైలుబండి వెడతానంటూన్న గార్ధభస్వరం వినపడింది.

అంతా వాళ్ళదగ్గర శెలవు తీసుకుని దిగిపోయారు. ఆ భార్యా, భర్తలు, వారి పిల్లాడు, వారి కెవరిదో ఒక ప్రయాణీకుడూ మాత్రం మిగిలారు ఆ బెంచీమీద. ఆ బంధుమిత్రబృందాన్నీ ఆ దంపతుల్నీ చూస్తే, వాళ్ళెవరో కొత్త కలవారి పిల్లలలాగే కనపడు తున్నారు.

వాళ్ళకు దూరంగా, ఎడంగా కూర్చున్న వ్యక్తి మాత్రం అంత నాగరకుడుగా ఉన్నట్లు లేదు. ముఖం శాగా చిక్కి నీరోడుతూన్నట్టుంది. వేసుకున్న బట్టలు తెగమాసి నల్లగా ఉన్నాయి. చేతిలోఉన్న మూట విప్పి దానిలోని మలినాంబరాలు ఒకటి ఒకటి తీసి, చిన్నపక్కలా పరచి కొన్నాళ్ళ చేతులూ కడుపు లోకి ముడుచుకుని పడుకున్నాడు.

రావుగారి దృష్టిమాత్రం వాడిమీద పడకుండా ఉండలేదు.

"వెధవ టికెట్టు లేకపోయినా ఠీవిగా పడు కున్నాడు" అని మనసులో మథనపడ్డారు. రైలుబండి అంతా కలయజూశారు. అందరూ పడుకోడం ఎలాగా అన్న సమస్యలో కొట్టుకుంటూండడమే కనిపించింది. ఆ బెంగాలీమిథునంమాత్రం మాటల్లో నిమగ్నం అయింది.

రావుగారికి వాడిమీద ఎక్కడలేనికోపం, వీళ్ళ మీద ఎక్కడాలేని సానుభూతి కలిగాయి.

"ఇదిగో ఇలా చూడూ" అన్నారు భార్యామణిని పిలుస్తూ.

ఆమె మాట్లాడకుండా, యాంత్రికంగా, తన మొహాన్ని రావుగారివైపు త్రిప్పి తెలివితక్కువగా ఆయన నయనాలలోకి చూసింది.

"మన రైలుబండి ఈ రాత్రంతా ఈ వడ్డీదేశంలోనే ప్రయాణం చేస్తుంది."

"అయితే యేం చెయ్యమంటారు?" అన్నట్లుగా మొహం పెట్టిం దావిడ.

"ఇక్కడ దొంగలు చాలా హెచ్చు. కన్నుమూస్తే, చేతికి దొరికిందే దక్కించుకుని మాయమవుతారు. చాలా జాగ్రత్తగా ఉండాలి. తెలిసిందా?" అన్నారు రావుగారు, మరెక్కడా దొంగలు లేనట్లు, మిగతా దేశం అంతటా ధర్మం నాలుగుపాదాలా తాండవిస్తోన్నట్లు.

మౌనంగా తలూపింది ఆ లలితాంగి.

"నీవు నిద్రొస్తే, పడుకోవాలనుకుంటే నన్ను లేపెయ్యి. అంతేకాని కన్నుమూస్తే యీ సామానులు మనవికావు. పాడుదేశం!" అన్నారాయన కళ్ళు పెద్దవిచేసి తిప్పుతూ.

"అలాగే లెండి" అందామె ఒయ్యారంగా మొగం త్రిప్పుతూ.

ప్రక్కన కూర్చున్న బెంగాలీయువకుడు, అప్రయత్నంగా యీ మాట వినపడిన ప్రక్కకు ఓ కన్ను త్రిప్పాడు. భార్యతో మాట్లాడుతూన్న మాటలు సాగుతూనే ఉన్నాయి.

రైలు అప్పటికప్పుడే రెండుమూడు స్టేషనులు దాటింది. రైలింజను గోల లయ తప్పకుండా శ్రావ్యంగా అవుతూనే ఉంది.

కిటికీలోనుంచి, ఆకాశంవైపు చూస్తే, చుక్కలన్నీ ఒకదాన్నొకటి పట్టుకుందామా అన్నట్లు పరుగెడుతున్నాయి. చంద్రుడు తన వెన్నెలతో తరుముతున్నాడు రైలుబండిని. తప్పించుకుందామని తెగపరుగెడుతోంది రైలుబండి పట్టుదలతో. రావుగారు పై బల్లమీదకి ఎక్కేసి మేను వాల్చేశారు. వారి భార్యామణిమాత్రం కిటికీలోనుండి బయటకు చూస్తూకూర్చుంది.

రైలుబండి తన త్వరితగమనాన్ని యథాతథంగా కొనసాగిస్తూంది. స్టేషనులు వస్తున్నాయి; పోతున్నాయి. మనుషులు ఎక్కుతున్నారు; దిగుతున్నారు.

శ్రీమతిగారు వచ్చే నిద్రని బలవంతంగా ఆపుకుంటూ, ఆ పెట్టెలో జరిగే మిగతా విషయాలప్రసక్తి లేకుండా నిశ్చింతగా, నిర్వికారంగా కూర్చుంది.

ప్రక్కనే కూర్చున్న వంగదేశపు మిథునం ఎప్పుడు దిగారోకూడా ఆమె గమనించలేదు. ఆమె హృదయం ఏ మధురమయిన ఆలోచనల్లో మునిగి ఉందో!

బండి కుదుపువల్లో ఎందుకో రావుగారికి నిద్రాభంగం అయింది. మెల్లగా కన్నువిప్పి చూచారు. సతీమణి మెలకువగానే ఉన్నందుకు హర్షపులకితాంతరంగులయారు. ఆలోచనల్లో మునిగిఉన్న అందమయిన ఆ అమాయికపు వదనాన్ని తిలకిస్తే ఆయనకి కాస్త జాలి పుట్టింది. "పాపం" అనుకున్నారు మనస్సులో. ఆ నిర్వేదం, జాలిలో తన్నుతానే మరచిపోయేటంత ప్రేమ పొంగి ప్రవహించింది. ఆమెకీ తనకీ మధ్యనున్న దూరం సైతం విస్మరించారు. అమాంతంగా ఆమెను తన రెండు చేతులమధ్య ఇరికించి గాఢంగా ఆమె చుబుకాన్ని చుంబిద్దామా అనుకున్నారు. హఠాత్తుగా పెట్టెలోఉన్న మిగతా మనుషుల్ని చూసి అదరిపడ్డాడు. భ్రమపోయింది. వాస్తవిక ప్రపంచంలోకి వచ్చాడు.

ఆయన దృష్టి పెట్టె నలుమూలలా పరుగెట్టింది. తన సామాను క్షేమంగా ఉందో లేదో కూడా చూచుకోడం మరచిపోలేదు. ఆ తరువాత ఆ బెంగాలీ దంపతులు ఖాళీచేసిన స్థలంమీదకు, ఆప్రక్కనే పడుకున్న అనామకవ్యక్తిమీదకు ప్రసరించింది వారిదృష్టి.

ఆ ఖాళీస్థలంలో, తన భార్యామణికి ప్రక్కగా పడివున్న ఐదుసెల్లుల బ్యాటరీలైటు ఎవరిదనే ప్రశ్న మీద తర్జన భర్జన జరుగుతున్నట్లు ఆయనకు స్పష్టమయింది. "ఎవరిదయితే మనకెందుకులే? వెధవగోడవ!" అని గొణుక్కుంటూ ఆయన మళ్ళీ కళ్ళుమూశారు; తనకు తెలీకుండానే నిద్రాదేవికి లొంగిపోయారు.

మళ్ళీ కొంతకాలం గడిచినాక ఆయన మేలుకొన్నారు. ఎదురుగా ఆ బ్యాటరీలైటు అక్కడనే వుంది. కాని ఇదివరలో దానికి దూరంగా పడుకొని ఉన్న వ్యక్తిమాత్రం దగ్గరగా జరిగినట్లు గోచరించింది.

వాడిని రావుగారు మొదటినుండీ అనుమానిస్తున్నారు. అదేమిటో గాని మొదటినుండీ రావుగారి మనస్సులో వాడు దొంగ అనే అభిప్రాయం కదలి మెసలసాగింది.

వెంటనే లేచి వాడిదగ్గర టిక్కెట్టు ఉందో లేదో అడిగేద్దాం అనుకున్నారు. తీరా టిక్కెట్టుందా అని తను ఆరాతీసేసరికి "నువ్వెవడవు అడగడానికి" అని ఎదురు తిరిగి కొట్టవస్తే తన గతేంకాను. అలాంటి నీచ మానవుడితోనా తను నోరూ వాలూ కలపడం! తన కెంత అప్రతిష్ఠ! అగౌరవం! చిన్నతనం! నిలువునా ప్రాణంపోదూ?

"ఎందుకులే మనకీ అక్కరలేని అధికప్రసంగాలు?" అనుకుని తన సామానంతా ఏగాదిగా పరీక్షగా చూసుకుని, మనసు కుదుటపరచుకున్నారు. అదే గాకుండా వారిభార్యామణి అలాగే కూర్చుని ఉండాలని కోరుకుంటూ.

"మన సామానుకొచ్చిన భయమేమీ లేదు. మిగతాగొడవలు మనకెందుకు?" అని ధైర్యం తెచ్చుకుని మళ్లీ కళ్ళుమూశారు. కంటికునిద్ర పట్టింది.

రావుగారిది కోడికునుకు. ఆయన మనస్సుకు మాత్రం ప్రశాంతి ఏదీ? ఆయనకో గంటతర్వాత మళ్లా మెలకువ వచ్చింది.

క్రిందికి చూశారుగదా ఇంకేముంది ఆ బ్యాటరీ లైటు అక్కడలేదు. మాయ మయ్యింది. తన సామానంతా కనపడకపోయినా సరే రానంత విచారం వచ్చింది. మనస్సు వేధించుకుపోయింది. ఆ పక్కనున్న వ్యక్తి తన ప్రక్కబట్టలని శుభ్రంగా మడతపెట్టుకు చక్కగా మూటకట్టుకుని, నిశ్చింతగా చుట్టపొగ వదుల్తూ కూర్చున్నాడు. రావుగారు దొంగచూపులతో ఆ వ్యక్తివైపూ, ఆ మూటవైపూ, తనప్రశ్నను ప్రదక్షిణం చేయిస్తున్నారు.

అతను, హఠాత్తుగా తనచూపు రావుగారి చూపుతో సమావేశం అయేసరికి, శరీరాన్నంతా కుంచించుకుని, అనుమానంగా అటూ ఇటూ చూసి, తనమొగాన్ని కిటికీవైపుకు త్రిప్పేసుకుని, కదలకుండా విగ్రహంలాగ కూర్చున్నాడు.

రావుగారి దృష్టి మళ్ళీ అతడిమూటవైపుకు మరలింది.

"ఆ మూట సరీగా ఆ బ్యాటరీలైటంత పొడుగుగానే ఉంది" అని అనుకున్నారు మనస్సులో రావుగారు.

ఆ బ్యాటరీలైటు తెల్లగా, మిల మిల మెరుస్తూ, ఆ మూటలోనుండి, ఆ గుడ్డల దళసరి మడతల మధ్య నుండి, రావుగారివైపు చూస్తూ నవ్వుతూన్నట్లు, వారి మనోనేత్రాలకు అగపడింది.

"దాన్లో పెట్టి కట్టేసుకుని ఉంటాడు...అయినా మనవస్తువు కానప్పుడు మనకెందుకు యీ బాధ?... ఎవడి వస్తువయితే వాడే నిలదీసి అడుగుతాడు" అని సముద్రంపొంగు పొంగుతోంది రావుగారి హృదయంలో.

ఆ వ్యక్తి ఆ మూటవేపు చూడకుండానే, అప్రయత్నంగా ఆ మూటమీద తనచేయి వేసుకుని, ఆమూట దగ్గరగా లాక్కున్నాడు. ఆప్యాయంగా తల్లి తనపిల్లను దగ్గరకుతీసుకున్నట్లు.

"అమ్మ దొంగవెధవోయ్. ఆ పదిహేను రూపాయల బ్యాటరీలైటు కాజేస్తున్నావటరోయ్!" అని అరచింది రావుగారి మనస్సు హఠాత్తుగా వారిచెవులు బ్రద్దలయ్యేలాగ.

"అయితే అది పోవడమేం? పదిమందినీ పిలిచి చెప్పేద్దామా" అంటూ ఊగులాడారు రావుగారు లోలోపలనే. ఆ మాట నాలిక చివరవరకు వచ్చేసింది కూడా.

అయినా రావుగారంత గంభీరవ్యక్తి, గౌరవనీయుడు, పెద్దమనిషి ఇంతలోనే మనస్సంక్షోభానికి లొంగిపోతారా?

"మనది కానప్పుడు మనకెందుకులే యీ వెధవ గొడవ? ఎవడిదయితే వాడే చూసుకుంటాడు. మనకెందుకులే? ఊరుకో...ఊరుకో. నీ సామానయితే నువ్వేం చేస్తావు? ఎదురుగుండా దొంగాడు పట్టుకుపోతూంటే చూస్తూ ఊరుకుంటావా? నీ సామానైతే ఏంచేస్తావో, అదే చెయ్యి..." అంటూ రావుగారి మనస్సు, ఆయన వ్యక్తిత్వం, వాగ్వాదంలోపడ్డాయి ఆయన తలపులమలుపుల్లో.

"వాడిని పట్టించేద్దాము. తెగులు తీరుతుంది" అనే దృఢనిశ్చయానికి వచ్చేశారు.

కాని ఆయన సంస్కారం, సంప్రదాయం, పరువూ, ప్రతిష్ఠా అన్నీ ఒక్కుమ్మడిగా పరుగెత్తుకుని వచ్చి ఆయన్ని నులకతాళ్ళలా చుట్టేసుకున్నాయి.

తెగించలేకపోయారు.

"మనది కానప్పుడు మనకెందుకులే తాపత్రయం?? ఇంతాచేస్తే అది ఎవడిదో వాడికే వెళుతుంది. ఎవడిదో తేలకపోతే ఎవడికో దక్కుతుంది. కోర్టులవెంట, పోలీసుల వెంట తిరగడానికి మనఖర్మం ఏంటి?" అంటూ రావుగారి వ్యక్తిత్వం ఘోషించింది.

మొత్తానికి రావుగారి వ్యక్తిత్వం జయించింది. వారిమనస్సు ఇనప్పెట్టెలాంటి వారి కపాలంలోనే అణగిపోయింది.

ఓసారి శ్రీమతిగారివైపు క్రీగంట చూశారు. ఆమె అలాగే కిటికీలోనుండి పైకి చూస్తూ కూర్చుంది. రావుగారు సంతృప్తిపొందారు. కాని అంతలోనే ఆమె కళ్ళునులుముకుంటూ వారిని వీక్షించింది. రావుగారు మందహాసం చేశారు. దేవిగారి కళ్ళలో ఎలెక్ట్రిక్ దీపాలు దేదీప్యమానంగా వెలిగిపోతున్నాయి. ఆ కాంతి రావుగారి కళ్ళలోకికూడా చొరుచుకు వచ్చింది.

"నిద్ర లేచారా?" అన్నట్లు మధురాతి మధురమయిన ఓ చిరునవ్వు వారిమీదకు విసరిం దావిడ.

దాంతో వారు సర్వం విస్మరించి, ఓ ఉరుకుతో వచ్చి అమాంతంగా ప్రియపత్నిప్రక్క చేరగిలబడ్డారు. ఆయనకు బాగా తనశరీరం ఒత్తుకునేలాగ ఆమె

దగ్గరగా జరిగి కూర్చుంది. రావుగారికి రైలుబండిలో ఉన్న స్పృహే లేదు.

"మీరు మళ్ళీ మళ్ళీ లేస్తూనే పడుకున్నారు" అంది మాటల్లో తేనెలూరిస్తూ.

రావుగారు ఉలిక్కిపడ్డారు.

"వెధవది మనస్సంతా సామానుమీదే ఉంటే నిద్ర ఎలాపడుతుంది?"

"నేను మేలుకునే ఉన్నాగా" అందామె శ్రీకంటమాస్తూ.

"అయితే నువ్వో కునుకు తియ్యి. నేను మెలకువగా ఉంటా."

"నాకుమాత్రం నిద్ర రావటం లేదు. మీరు పడుకోండి" అంటూ ప్రాధేయపడిందామె.

రావుగారు భార్యమాట కాదనలేక వెంటనే పైకెక్కి తమ యథాస్థానంలో కాళ్ళుచాచుకుని కళ్ళు మూసుకుని సంతుష్టాంతరంగులయి నిద్రపోయారు.

మళ్ళీ ఈసారి రావుగారికి మెలకువ వచ్చేసరికి బండి సరాసరి వారు దిగవలసిన ఊరు సమీపిస్తోంది.

శ్రుతిగారు మాత్రం గాఢనిద్రాపరవశులయి ఉన్నారు.

రావుగారు క్రిందకుదిగి ప్రక్కవాళ్ళని వాకబు చేసుకొని, తన ప్రక్కచుట్ట పెట్టె సామానులన్నీ ఉన్నాయో లేదో మళ్ళీ మళ్ళీ తణిఖీ చేసి, ఆ సామానంతా దిగవలసిన ద్వారంవద్ద సర్దేసి భార్యామణికి మేలుకొలుపు పాడారు. శ్రీమతికి లేవడం, బండి ఆగడం ఒకేసారి జరిగాయి.

సామాను లన్నీ దింపించి, అవతలకు తీసుకుపోయి, బండివాళ్లాడి అందులో పడేయించారు. భార్య, ఆయనా దాన్లోకి ఎక్కారు. బండి ఇంటి ముఖం పట్టింది.

ఇంటికి పోతున్నాం అన్న సంతోషం రావుగారి మోములో ప్రస్ఫుటిస్తూంది. హృదయం ఆనందముతో గంతులేస్తోంది. బండి కుదుపులో శ్రుతిగారి మృదువయిన, అందమయిన, సన్నటి సుకుమారశరీరం తమకు తగులుతూంటే అవ్యక్త మధురానుభూతులు పొందుతున్నారు. గతుకులరోడ్డు, బండికుదుపు అన్న స్పృహే తెలీడంలేదు.

ఉన్నట్టుండి రావుగారు మెరుస్తూన్న నేత్రాలతో భార్యామణివైపు చూస్తూ "చూశావా" అన్నారు.

"ఆమె తెలివి తక్కువగా నాలుగువైపులా చూసింది. ఏమీ కనపడలేదు. ఆఖరికి "ఏం" అన్నట్లు ప్రశ్నార్థకంగా వారి మొఖంలోకి చూసింది.

"నీ ప్రక్కను కూర్చున్నాడు చూశావా, వాడి దృష్టంతా మన సామానుపైనే ఉంది సుమా"

"అవా" అన్నట్లు ఆశ్చర్యం ప్రకటించిందామె.

"నాకు మెలకువ వచ్చినప్పుడల్లా, వాణ్ణి కని పెడుతూనే ఉన్నాను. వాడు అస్తమానం మన సామానులపైనే, నీపైనే చూస్తూ కూర్చున్నాడు; దొంగ వెధవ."

"నేను మెలకువగానే ఉన్నాలెండి" అందామె కొంత గర్వంగా సామానంతా ఉందన్న ధైర్యంతో.

"వాడెక్కడ దిగిపోయాడు? నాకు మెలకువ వచ్చేసరికి నువ్వు గుర్రుపెడుతూ నిద్రపోతూన్నావు. వాడు మన పెట్టె చేడా కొస్తా సర్దేసి మరీ చక్కాపోయి ఉంటా ననుకున్నాను. కాని" అని ఆయన ముగించకుండానే అందుకుందామె.

"వాడు దిగిపోయాకే నేను పడుకున్నాను లెండి. అప్పటికి బాగా తెల్లారిపోయింది. చాలామంది లేచి మెలకువగానే ఉన్నారు. అందుకే నేను నిద్ర పోయాను" అంది సంతృప్తిగా.

"కాని దొంగవెధవ నిష్కారణంగా ఆ అయిదు సెల్లుల బ్యాటరీలైటు కొట్టేశాడు సుమా" అన్నారు రావుగారు తమ స్వంత వస్తువును పోగొట్టుకొన్నంత విచారాన్ని ఒలకబోస్తూ.

"మనకి కొరక లేదనా మీ విచారం" అందామె సన్నని నవ్వు నవులుతూ.

"వాడి బట్టలమాట చూడగానే అనుకున్నాను. దాన్లో చుట్టేసుకుని మాట్లాడకుండా కూర్చున్నాడని. వెధవకి టిక్కెట్టు ఉందో లేదో అడిగేద్దాం అనుకున్నా సుమీ నిజం చెప్పాలంటే"

"వాడికి టిక్కెట్టు ఎందుకులేదూ. టిక్కెట్టు కలెక్టరు అడిగినప్పుడు చూపిస్తోంటగా నే చూశాను కూడా." అని కోకిలకంఠం మ్రోగించింది.

"వెధవని పట్టుకుని, నలుగురిలోనూ ఆ బ్యాటరీ లైటు తీయించి, పోలీసుకి అప్పగిద్దాం అనుకున్నాను. కాని యీ వెర్రివెర్రి గొడవలన్నీ మన కెందుకులే అని ఊరుకున్నా."

"యింకా నయమే! అలా చేశారుకాదు. లేని పోని గొడవలు వచ్చిపడును." అందామె వచ్చే నవ్వును నోట్లో కుక్కుకుంటూ.

"అందుకే నేనూ ఊరుకున్నాను."

"మంచిపని చేశారు" అందామె ఒయ్యారంగా.

రావుగారు సంతృప్తిపడ్డారు భార్యామణి యిచ్చిన ఆ ప్రశంసావాక్యానికి. శ్రీమతిగారు పెట్టె మీదవున్న సంచీ తన దగ్గరగా లాగుకుని దాన్లోనుంచి మెరుస్తూవున్న బ్యాటరీలైటు పైకి తీసింది. రావుగారి కళ్ళు తిరిగాయి. ఒళ్ళు చెమట్లు క్రమ్మింది. ఒక్కసారిగా ఏడవాలో నవ్వాలో తెలీని పరిస్థితిలో పడ్డారు. కాస్తసేపు ఉక్కిరిబిక్కిరి అయిపోయారు.

"అయితే నువ్వు దొంగతనం చేశావా?" అన్నారు నెమ్మదిగా బండివాడు వినిపోతాడేమో నన్న భయంతో. రావుగారి ఆత్మగౌరవం దెబ్బతింది. అయినా బ్యాటరీలైటు తెల్లగా మిలమిల మెఱిసి పోతూనేవుంది శ్రీమతిగారి చేతిలో.

శ్రీమతిగారి ముఖారవిందం అరుణరేఖలు దాల్చింది. ఆ కోపంలో ఆమె ముఖం మరీ అందంగా కన్పిస్తోంది.

"దొంగతనం ఖర్మం యేమిటి? అందరిలో నే తీసుకున్నాను" అంది ఆ కలకంఠి. అందరి ముఖం ఎదురుగా నే తెలిసీ తెలియకుండా దోపిడినీ, దొంగతనాన్నీ అవిచ్ఛిన్నంగా సాగనిచ్చే సాంఘిక వ్యవస్థ బలం, ఆ మాటలో, ఆమెను తెలీకుండానే ఉట్టిపడింది.

"అయితే అంతా ఊరుకున్నారా?" అన్నాడాయన తెల్ల మొహం వేసి.

"ఊరుకోక ఉరిపెట్టుకుంటారా ఏం?" అందామె ఆయన ముఖం చూడకుండానే.

ఆయన గంభీర ప్రసన్నవదనం విషాద మేఘావృతమయింది. మాట్లాడలేకపోయారు. దయ్యంపట్టిన వ్యక్తిలా, దిగాలుపడి ఆమె ముఖంలోకి వెర్రిగా చూస్తూ కూర్చున్నారు.

ఆమె ఆయనవైపు చూడలేదు. దించిన తల ఎత్తలేదు. మెల్లగా మాట్లాడసాగింది తనలోతను మాట్లాడుకున్నట్లు; చుట్టూ ఎవ్వరూ లేనట్లు.

"అందరూ మాదికాదు: అంటే మాదికాదు అన్నారు. ఎవరితన్న వారే దాన్ని ఏదో భూతం, నిప్పు, పామూ అన్నంత భయంతో చూసి, దూర దూరంగా పోయారు. నేను మాట్లాడలేదు సరికదా వారి మాటలు వినపడనట్లుగా వాళ్ళవైపు చూడకుండా కూర్చున్నాను. నాకు సంబంధం లేదని ఊరుకున్నాను."

"నిజం కూడా అంతేగా!" అన్నాడాయన కాస్త ఊరటపడి.

"సరిగా అప్పుడే నిద్రనుండి కళ్ళు నులుపుకుంటూ లేచాడు ఆ పక్కగానే పడుకున్న వ్యక్తి. ఆ సంభాషణంతా సరిగా విన్నాడో లేదో తెలీదు. తను పడుకున్న ప్రక్కబట్టలన్నీ సరిగా మడతపెట్టుకుని, శుభ్రంగా కట్టుకున్నాడు. "అమ్మా—అమ్మా" అంటూ నన్ను రెండుమూడుసార్లు కాబోలు పిలిచాడు. నేను వాడివైపు చూశాను. అందరూ మావైపు చూశారు. అంతవరకూ నేనుమాత్రం ఆ బ్యాటరీలైటువైపు కన్నెత్తి చూడనే లేదు. వాడు నావైపు చాలా గౌరవమర్యాదలు ఉట్టిపడుతూన్నట్లు చూసి "బ్యాటరీలైటు మరచిపోయినట్లున్నారు. తీసి జాగ్రత్తచెయ్యండి" అన్నాడు. అందరూ అది నాదే అయినట్లు మాట్లాడలేదు. నేను వాడివైపు కృతజ్ఞతా సూచకంగా ఓ చిరునవ్వు విసరి, ఆ బ్యాటరీలైటు తీసి మన సంచీలో సర్దేశాను. అంతే. అంతా ఆనందపడ్డట్టు నిశ్శబ్దంగా, సంతృప్తిగా కూర్చున్నారు. అరుణోదయం అవుతోందనగా, అదేదో స్టేషనులో బండి ఆగింది. వాడు దిగిపోయాడు. మళ్ళీ బండి కదిలింది. నేను నిద్రపోయాను నిశ్చింతగా. ఇదీ కథ" అందామె.

"హమ్మయ్య" అంటూ ఓ చిన్న నిట్టూర్పు విడిచారు రావుగారు. పోయిన ఆత్మగౌరవం తిరిగివచ్చింది. ఆయన వదనంలో గాంభీర్యం, ప్రసన్నత తిరిగి వచ్చి పడ్డాయి.

ఆమె సంకోచంతో, మెల్లమెల్లగా తనముఖం పైకెత్తి చూచింది. ఆయన అనురాగపూరితమయిన దృక్కులు ఆమెమీదకు విసురుతూ కువ్వహాసం చేశారు. శ్రీమతిగారుకూడా ఓ మందహాసాన్ని వెదజల్లారు.

"హోరి దొంగా" అంటూ ఓ చిన్న చిటిక ఆమె బుగ్గమీద వేశారు రావుగారు ఆమెను అభినందిస్తున్నట్లు.

ఈ చిన్న ప్రక్రియలో బ్రిటిషువారు నాలుగు వందల సంవత్సరాలు ఏలి భారతజాతికి ప్రసాదించిన, నాగరికతా, సంస్కారం, సంస్కృతీ ఉట్టిపడ్డాయి.

తనపనికి తగినశిక్ష పడిందనీ, ప్రతిఫలం దక్కిందనీ సంతృప్తిపడిం దామె ఆ బండికుదుపులో.

# రాయల గయశాసనము జయశాసనమా?

శ్రీ కె. హెచ్. వి. శర్మ

డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు నే నాంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ప్రకటించిన 'ముక్కుతిమ్మన గయశాసనమును' మరల ఫిబ్రవరి నెల భారతిలో 'కృష్ణరాయల గయశాసనము' అను శీర్షికతో చక్కగ పరిష్కరించి ఆంధ్రుల కృతజ్ఞతకు మిక్కిలి పాత్రులైరి.

ఇక నేను నా శాసనమునకు ముక్కుతిమ్మన గయ శాసనమని నామకరణము చేయుటకు, శాసనమునందే 'కృష్ణదేవమహారాయలు చేయించిన విజయ శాసన'మని యుండినను అది యాత్రావిజయమే గాని విజయ యాత్ర కానేరదని వ్రాయుటకును గల కారణములు మనవి చేసికొందును.

గతసంవత్సరము డాక్టరు దినేశచంద్ర సర్కారుగారు గయనుండి సుమారిరువది శాసన ప్రతిబింబములను దీయించి తెచ్చిరి. అందు కొన్ని తెలుగు, కన్నడ లిపులలో నుండుటచే పరిశీలింప వలసినదిగా నా కిచ్చిరి. గయయందలి ప్రసిద్ధమయిన విష్ణుపాదాలయావరణములోనే పది, పదిహేను శాసనములు గలవు. వానిలో నాలుగుశాసనములు మాత్రము మిక్కిలి ముఖ్యమైనవి. (i) సంస్కృతభాషలో నాగరిలిపిలో కాకతి మొదటి ప్రతాపరుద్రుని పేర్కొనుచున్నది. (ii) కన్నడభాషలో హొయసళ వీరనరసింహుని దెల్పుచున్నది. (iii) తెలుగులో విజయనగర శ్రీ కృష్ణదేవరాయల శాసనము. (iv) తెలుగులో విజయనగర అచ్యుతదేవరాయలశాసనము. శాసనములలో గల కాలములుగూడ సరిగా ఆయా రాజుల కాలములకు సరిపోవుచున్నవి. కాలమునకు తగినట్లే లిపి, భాషగూడ నున్నవి. ఈ నాలుగు శాసనములును విష్ణుపాదాలయావరణలోనే గలవు. నా చేతనైనంత వఱకు వాని మూలములను వ్రాసికొని శ్రీ సర్కారు గారికి చదివి వినిపించితిని. వెంటనే వారు చిరునగవుతో "ఈ నాలుగుశాసనములలో పేర్కొనబడిన రాజులు దక్షిణ హిందూదేశమును పాలించినవారేగదా! వీరికిని గయకును ఎట్టిసంబంధమును లేదే?" యనిరి. "అందులకే నా కాశ్చర్యముగనున్నది. ఈ శాసనములను సమన్వయించుట యెట్లు? పోనీ అబద్ధపు శాసనము లని త్రోసివేయుదమన్న గయలో నీ అబద్ధపు శాసనమును వేయవలసిన యగత్యమేమి? మరియు వాని లిపి కాలము, భాష అందు పేర్కొనబడిన అంశములు గూడ సత్యముగ గాన్పించుచున్నవే?" యంటిని. దానికి వారు "శాసనము లెప్పుడును సత్యమైనవియే కాని వానిని మనము సమన్వయించుకొనుటలోనే భేదాభిప్రాయము లుండును" అనుచు నిట్లు దెల్పిరి. "వెనుక ఆచార్య శ్రీ టి. వి. మహాలింగముగారు కాంచీపురపు అరుళాళ పెరుమాళ్ళ ఆలయములో చోళరాజుల కాలమునగల, తూర్పు గాంగవంశజుండగు నరసింగభీముని శాసనములను రెండింటిని జూచి అతడు చోళులపై దండెత్తి వారలను జయించెనని అపోహపడి ఎపిగ్రాఫియా యిండికాలో[1] నొక వ్యాసమును ప్రకటించిరి. అది అసంభవమనియు సుప్రసిద్ధ పుణ్యక్షేత్రములగల శాసనములపై మాత్రమే ఆధారపడి మన మెట్టి నిర్ధారణ చేయరాదనియు దెల్పుచు కొన్ని యుదాహరణములనుం జూపితిని.[2] (అట్టి శాసనములను ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో నేనును పేర్కొంటిని గాని డాక్టరు వెంకటరమణయ్య గారు వాటిని తలపెట్టలేదు.) ఆనా వాదమును స్థిరపఱుచుట కీ నాలుగుశాసనములును చాల ముఖ్యమైనవి గాన వీటిని సమిష్టిగా 'గయ శాసనములు' (Inscriptions from Gaya) అను శీర్షికతో ప్రకటింపగల మ"నిరి. అట్లే మా యిరువురచే నివి ఎపిగ్రాఫియా యిండికాలో సవ్యాఖ్యాన, సప్రతిబింబకము ప్రకటింపబడుచున్నవి.[3] తరువాత నేను శ్రీ కృష్ణదేవ రాయలశాసనమును తెలుగున ప్రకటించుట కనుజ్ఞ

---

1. ఎపిగ్రాఫియా యిండికా; 31 సంపుటము, పుటలు 94-98.

2. డిటో ,, పుటలు 99-102.

3. ఎపిగ్రాఫియా యిండికా; 33 సంపుటము, పుటలు 108-116.



## గయాశాసన ప్రతికృతి

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శా
లివాహన శక వర్షంబులు
౧౪౪౪ అగునేంటి వృష సం
వత్సర ఆషాఢ బహుళ ౧౩ మ
శ్రీమన్మహా రాజాధిరాజ రాజ
పరమెశ్వర వీరప్రతాప వీర
కృష్ణదెవ మహారాయలు
వెఇంచిన విజయశాసన
ము॥ తిరుమల దెవివల్లభక (క)[1]
రుణామయ హృదయ రాజకం
ఠిరవ ఈశ్వర నరసభూపురందర

| | | |
|---|---|---|
| వరనందన | | యీశా |
| బాసద | | నము |
| ప్వవర | 3 | ముక్క |
| గండ్డాం | | తిమ్మయ |
| కా॥[2] | | వ్రాసెను. |

1. 'క' అనవసరము.
2. పారిజాతాపహరణమునుండి ద్వి. ఆ. 108.
3. మహిషాసుర మర్దనివలె కాన్పించు చున్నది.

కోరగా వారు "దీనిని నీవు ప్రత్యేకముగ 'కృష్ణదేవ రాయుల గయాశాసనము'ను శీర్షికతో ప్రకటించిన నీాఆంధ్రులు కొంతెను కొందరపాటు వారు, వెంట నే యొకరైనా ఏదో ప్రబంధములలోనివిగాని చాటుపద్య ములనుగాని యెత్తిచూపుచు శ్రీ క్రృష్ణదేవరాయలు గయను జయించి విజయస్తంభమును ప్రతిష్ఠించె నని తీర్మానము చేయుదురు. కాన వానవ్యాసము బయటపడుటకును నీవు దీనిని ప్రకటింపవల"దనిరి. దానికి నేను "అయ్యా శ్రీ కృష్ణదేవరాయల గయా విజయముకంటె ముచ్చటైనది మా ముక్కు తిమ్మనకవి శాసనములో నుండుట. అతని నైనను బయట పడనీయు" డనికోరగా వారు సరే నీయిష్టమనిరి. ఈ కారణములచే శ్రీ కృష్ణదేవరాయల గయ శాసనముయొక్క విలువను డాక్టరు వెంకటరమణయ్యగారు చెప్పినట్లు 'ముక్కు తిమ్మన గయశాసన'మని నేను తేల్చివేసినమాట వాస్త వమే.

ఇక శ్రీ కృష్ణదేవరాయల గయ శాసనమునాట చెవిని సోకగనే ప్రతి మనుచరిత్ర పాఠకునకి అందును డాక్టరు రమణయ్యగారివంటివారికి పెద్దనగారి "ఉదయాచలేంద్రంబు మొదలనెవ్వని" సీసపద్య పాదములు

వ్యరణకు వచ్చుట సహజమే. అందు ప్రస్తావింపబడిన నిగూఢ చరిత్రాంశములను కీర్తిశేషులయిన శ్రీ కొమర్రాజు వేంకటలక్ష్మణరావు పంతులుగారు అర్ధశతాబ్దమునకు ముందే గుర్తించి వివరించుటయు గొప్ప విశేషము. కాని దాదాపు దశాబ్దము క్రిందటనే సుప్రసిద్ధ పరిశోధకులగు శ్రీ చాగంటి శేషయ్యగారు పై యంశములనుగూర్చి యిట్లు తెల్పియున్నారు.

"పెద్దనార్యుని యీ పద్యములో గొంత యత్యుక్తి యున్నదని నా యభిప్రాయము. అపంచగౌడపద మిట్టిదే. (శ్రీ లక్ష్మణరావు గారు చెప్పినట్టిది.) నర్మద కుత్తరమునకూడ రాయలవిహారప్రదేశ మున్నదని యంగీకరించితిమేని యది యప్పటి ఢిల్లీ చక్రవర్తుల యధికారప్రదేశములను వ్యాపించియుండె నని తలంపవలసియున్నది. ఇం దత్యుక్తి యుండిన నుండుగాక! ఆ కాలమున నా ప్రదేశము 'లోడీ' వంశీయుల యధికారముక్రింద నున్నది. లోడీ వంశీయులలో 'సికందర్ లోడి' యను నతడొకడున్నాడు. అతడు క్రీ. శ. 1489 లో సింహాసన మధిరోహించి, యాగ్రాను నివాసముగా నేర్పఱచుకొని 1517 వఱకు పరిపాలనము సాగించినాడు. ఇతనినే పెద్దనార్యుడు పై పద్యములో నుదాహరించినాడని నా యభిప్రాయము. ఈ సికందర్ లోడీ రాయల కరికాపు గాకపోయిన పోవచ్చును. కాని రాయల శౌర్యప్రతాపములను వర్ణించుటలో పెద్దనార్యుఁ డత్యుక్తిని గనపఱచియుండెనని తలంపవచ్చును. మూఁడునెలలు మాత్రమే రాజ్యముచేసిన గుజరాతు సికిందరు నరిగాఁపునుగా జేసినాఁడనుట కంటె నొకచక్రవర్తి నరిగాఁపుఁగా జేసెననుట సమంజసము.

నావాడపతి యెవ్వరో తెలిసిన నీచిక్కు కొంత విడిపోవచ్చును. కాని తెలియదు.

* * *

గోలకొండ, విజాపురము, అహమ్మదు నగరములు రాజధానులుగాఁ బరిపాలనము చేయుచున్న కుతుబ్ షాహో, అదిల్ (ఏదుల) షాహో, నిజామ్ షాహోలకు దోడుగ నాగ్రా పరిపాలకులు కూడ రాయలకు భయపడుచున్నట్లు కృష్ణరాయ విజయమునందలి యీ క్రింది పద్యము చెప్పుచున్నది.

ఉ. ఆ గజవాజి బృందముల
కా భటకోటుల కానృపాలు బా
హోసురశౌర్య ధైర్యముల
కాత్మఁ గలంగుచు విన్నమాత్ర నా
హా! గణుతింప శక్యమె య
హార్నిశమున్ భయమందియుండి ర
యాగ్యగర (ఆగ్రా) నాయుదానగరి
యందు (అహమ్మద్ నగరము) విజాపురి
గోలకొండలోన్.

కృష్ణదేవరాయలు ఆగ్రాపై దండెత్తి యా ప్రభువు నోడింపకపోయినను అతడు సహాయ మొనర్చిన నిజామ్ షాహో, ఏదుల షాహో, కుతుబ్ షాహోలను జయించి మూరురాయర గండడను బిరుదమును గైకొని యున్నవాడగుటచే నాగ్రాధిపతియగు సికిందర్ లోడీని గూడ జయించినట్లు పెద్దనార్యుడు వ్రాసియుండెనని తలంపవచ్చును."4

కృష్ణదేవరాయలు జయించెనని యపోహపడు 'సికిందర్ లోడీ'ని గురించి రెండు మాటలు తెల్పుట యసంగతము కానేరదు.

"After Buhlul's death, his second son, Nizam khan, was proclaimed king at Jalali, under the title of Sultan sikander shah, on the 17th July, 1489...Endowed with considerable energy and vigour, Sikander amply justified the choice of the minority among the nobles. He made earnest efforts to increase the strength of the kingdom by removing tne disorders and confusion into which it had been thrown during the preceding reigns, due largely to the refractoriness of the provincial governors, chieftains, and zamindars. He took care also to check the accounts of the leading Afghan Jagirdars, much against their will. Marching to Tirhut and Bihar, he asserted his authority as far as the confines of Bengal; appointed Dariya Khan to the government of Bihar; compelled the Raja of Tirhut to pay him tribute; and concluded a treaty with 'Ala-ud-din Husain shah of Bengal, by which both agreed not to encroach on each other's dominion. The chiefs of Dholpur, Chanderi, and some

4. ఆంధ్రకవి తరంగిణి; సప్తమ సంపుటము, పుటలు 154-155.

other places, also tendered submission to him. With the object of controlling the chiefs of Etawah, Biyana, Koil, Gwalior and Dholpur in an effective manner, he founded a new town in 1504 on the site where the modern city of Agra stands. Striving till his last days to enforce obedience from the hostile chiefs, the Sultan breathed his last at Agra on the 21 st November, A. D. 1517.

Sikandar was undoubtedly the ablest of the three rulers of his dynasty."[5]

కృష్ణదేవరాయ లంతటి గొప్పవాడు కాకపోయినను సికిందర్ లోడి సామాన్యుడు మాత్రము కాదు. ఇంచుమించుగా ఉత్తరదేశమున కంతకును సార్వభౌముడు. నిజమునకు కృష్ణదేవరాయలు ఆగ్రాపై దండెత్తి సికిందర్ లోడీ నెదిరించిన పక్షమున సుమారు హిందూదేశమునకంతకు నేకఛత్రాధిపతియే యగును గదా! అట్టి సికిందర్ దిగ్విజయమును, అతగింజంత యున్న దానిని గుమ్మడికాయంత చేసి వర్ణించు మన ప్రబంధకవులు చిన్న సీసపద్య పాదార్థములో తేల్చివేయుటలో గల సారస్యమేమి?

ఇక "ఆపంచగౌడధాత్రీతలంబు"లోని 'ఆక్రా' ప్రత్యయమునకు శ్రీ లక్ష్మణరావుగారు చెప్పిన 'మర్యాద'యను నర్థమే యుచితము. దానినే శ్రీ చాగంటి శేషయ్యగారును అంగీకరించిరి. రాయల రాయచూర్ దండయాత్రలనే పెద్దన యీరీతిగ వర్ణించెనేమో!

ఇది యంతయు పెద్దన పేర్కొనిన 'శకంధరుడు' ఆగ్రా పరిపాలకుడగు సికిందర్ లోడియైన పక్షమున గదా! పై చర్చాంశమునుగూర్చి శ్రీ డాక్టరు రమణయ్యగారే యొకప్పు డిట్లు వ్రాసిరి.

"It is interesting to note that a Sikandar is mentioned as one of the adversaries of the Gajapati pratapa rudra in a Sanskrit drama called the Jagannatha Vallabha natakam (M. G.O.M. Library R. 4198). The Velicerla grant of Prataparudra Gajapati refers to him as 'Pancagaud - adhi-nayaka (J. A. H. R. S. ix, P. 56). The 'apanca - gauda - dhatripada' of Peddana perhaps refers to the dominions of the Gajapati which Krisnaraya invaded."[6]

ఈ వాద మంగీకరించినను మనుచరిత్ర రచనా కాలమునకు ముందే కృష్ణదేవరాయలకు 'ఆపంచగౌడ ధాత్రీతలము'నగా కటకమునకుగల భూభాగ మంతయు వసివాలుగా చేసునట్టి బయలే యయినది. వీరు దీనిని మార్చుకొనవలసిన యవసర మిప్పుడు కన్పట్టదు. సికిందర్ నామధేయము లింకను కొంతమందిగలరు.[7] వారిలో రాయల సమకాలికు డెవడైనను పెద్దన పేర్కొనిన 'శకంధరుడు' కావచ్చును.

మరియు ప్రబంధములలోని విట్టి పద్యములను బట్టి చరిత్రాంశములను సిద్ధాంతీకరించుట గూడ ప్రమాదము. మనుచరిత్రలోనిదే యీ క్రింది పద్యము చూడుడు.

"కుకుర కాశ కురు కరూశ కోశలాంధ్ర సింధు బా
హ్లీక శకాంగ వంగ సింహళేశ కన్యకామణీ
ప్రకర పాణిఘటిత రత్న పాదుకా కలాచికా
ముకుర పీటికాకరంక ముఖ్య రాజలాంఛనా."

దీనినిబట్టి కుకుర, కాశ, కురు, కరూశ, కోసల, ఆంధ్ర, సింధు, బాహ్లీక, అంగ, వంగ, సింహళ దేశాధీసుల రాజకుమార్తెలు కృష్ణరాయల కూడిగము చేయుట యెంత యథార్థమో, పై సీసపద్యములోని నావాడపతి, శకంధర, సింధురాశ్వేశులు లరిగాపులనుట కూడ నట్టిదే కావచ్చును.

ఢిల్లీని గూర్చిన ప్రసక్తియు రాయవాచకము నందును, రెండు మూడు చాటుపద్యములలోను గలదు.

(1) కూలె బెజవాడ కంపించె గొండపల్లి
పగిలెఁ గటకంబు గగ్గోలుపడియె ఢిల్లి
ఏకధాటిగ నీవు దండెత్తునపుడు
కీర్తిలోపాయ ధారేయ కృష్ణరాయ.

2. గవకుల్ బల్లిదమయ్యె ఢిల్లికిని మ
క్కాకోట మేలయ్యె మం
డువకున్ గ్రొత్తగ గ్రొత్త డంబు లమరెన్
బోలేరు చందేరులన్
దవసం బెక్కె బెడందకోట పురకాం
తా గర్భనిర్భేదన

5. An Advanced History of India; Page 341.

6. Further Sources of Vijayanagara History, Vol I. Page 216.

7. An Advanced History of India.

ప్రవణంబైన భవత్ప్రయాణ జయవా
ర్తన్ గృష్ణ రాయాధిపా!

ఇట్లే మహాబలపరాక్రమవంతుడగు గజపతి కపిలేశ్వరుని విజయములను వర్ణించు సందర్భమున కూడ గలవు.

1. "కలుబరిగా విముక్తపుర గా ఢిల్లీచ ఖిల్లీ కృతా"
(వెలిగలని, చిలుక్రోలి తామ్రశాసనములు)

2. "గౌడమర్దీ భ్రమర వరనృపో
దృప్త ఢిల్లీంద్ర గర్వః"
(గోపీనాథపుర శాసనము)

3. "గజయూథముల గట్టుకంబాలు కంబాలు
పట్టణంబు గురాలపల్లె ఢిల్లి"

ఆయా రాజుల శౌర్యప్రతాపములను విని ఢిల్లీ సుల్తానులు కూడ భయపడుచుండిరని వర్ణించుట యా కాలమున నొక విశేషమేమో!

గయ శాసనకాలమునకు ఢిల్లీ సింహాసనమునందు సికిందర్ నామధేయుడెవ్వడును లేడు. ఇక ఇబ్రహీం లోడి తండ్రియగు సికిందరు మరణమునకు ముందొక పర్యాయము అనగా క్రీ॥ శ॥ 1517 నకు పూర్వము, తరువాత క్రీ॥ శ॥ 1521 వ సంవత్సరమున సికిందర్ కృష్ణరాయలకు గప్పముకట్ట నొప్పుకొని చేసికొనిన యొడంబడిక ప్రకారము ఆతని కుమారుడు ప్రవర్తింపక పోవుటవలననో మఱి యే కారణము వలననో మరల కృష్ణరాయలు ఉత్తరహిందూస్థానముపై దండువెడలినట్లున్నదను డాక్టరు వెంకటరమణయ్యగారి యూహాల కేమియు నాధారము కాన్పించదు. ఈ వేయించిన విజయశాసనమైనను ఢిల్లీ వద్దనో, ఆగ్రా వద్దనో యుంచినట్లయిన గొంతవఱకు ఊహింపవచ్చును. మరియు నీ శాసనములో నెక్కడ విజయము, యెవరిపై విజయమను ప్రశ్నలకు సమాధానమే లేదు. కృష్ణదేవరాయల సింహాద్రి, పొట్నూరు, సుల్బర్గ విజయస్తంభములను గూర్చి యనేక గ్రంథములు, శాసనములు చాటుచున్నవిగదా, దీనిని గూర్చి తెల్పకుండుటకు గల కారణమేమి?

ఈ శాసనకాలమగు క్రీ. శ. 1521 సంవత్సరము తర్వాత కృష్ణదేవరాయలింకను 9 సంవత్సరములు జీవించియుండెను. ఈ కాలమున ఆతని శాసనములు దక్షిణదేశమున కొన్నివందలు గలవు. అందు గజపతులను, గోలకొండ, బిజాపుర, అహమ్మదునగర సుల్తానుల నోడించినట్లే తెలియుచున్నది గాని గయా విజయమును గూర్చి, లేదా ఢిల్లిని గురించిన ప్రసక్తియే కానరాదు. ఆముక్తమాల్యదా కావ్య పాంత.పద్యములలో దన విజయములన్నింటిని వర్ణించుకొను తరి గయావిజయమునుగాని, సికిందర్ నామమునుగాని పేర్కొనకుండుటకు గల కారణ మేమై యుండును.

శ్రీ కృష్ణదేవరాయలు తిమ్మరుసుని గయకు పంపెనను విషయమును గూర్చి చూతము. గయా మాహాత్మ్యము, గయాశ్రాద్ధములను గురించి విపులముగ ననేక గ్రంథములు గలవు. గయయందెల్ల కాలములను, యెవరిచేతనైనను, నామగోత్రములు చెప్పి యెవ్వరికైనను శ్రాద్ధము చేయవచ్చునను యీ క్రింది శ్లోకములు చూడుడు.[8]

1. గయాయాం సర్వకాలేషు
పిండం దద్యా ద్విచక్షణః,

2. ఏష్టవ్యా బహవః పుత్రా
యద్యేకోఽపి గయాం వ్రజేత్.
యజేత వాశ్వమేధేన
నీలం వా వృష ముత్సృజేత్.

3. గయాశిరసు యత్కించి
న్నామ్నా పిండంతు నిర్వపేత్.
నరకస్థా దివం యాన్తి
స్వర్గస్థా మోక్ష మాప్నుయుః.

4. ఆత్మజో వ్యన్యజో వాపి
గయాభూమౌ యదాతదా,
యన్నామ్నా పాతయే త్పిండం
తం నయే ద్బ్రహ్మ శాశ్వతం,

5. నామగోత్రే సముచ్చార్య
పిండపాతన మిష్యతే.
యేనకేనాఽపి కస్మైచి
త్సయాతి పరమాం గతిం."

విష్ణుపాదావరణలో దొరకిన శాసనములన్నియు గయాశ్రాద్ధమును, దానములను గూర్చియే తెల్పుచున్నవి.

1 కాకతి మొదటిప్రతాపరుద్రుని కాలమునాటి శాసనములో నాతని గురువులగు మల్లికార్జున సూరి భార్య గారియమసాని తన బంధువులకు భర్తకుగూడ గయాశ్రాద్ధము నిర్విఘ్నముగా జరిపించెనని గలదు.

---

8. History of Dharmasastra by P. V. Kane Vol IV Chapter XIV pages 643-679.

"శ్రీమ న్నిఖిల భూపాలమౌళి రత్న లసత్పదః,
అస్తి ప్రతాప రుద్రాఖ్యో రాజా రాజశిరోమణిః
* * *
తస్య త్రిభువనవిద్యాచక్రవర్తీతి విశ్రుతాః,
గురవః సన్తి లోకేఽస్మి న్మల్లికార్జున సూరయః.
* * *
గౌరీ గుణవతీ తస్య విద్వజ్జన వినోదినః,
ధర్మపత్నీ గయాశ్రాద్ధం పితృభ్యు మకారయత్."

ii హొయసళ వీరనరసింహుని పూజారి యగు పద్మనాభ భట్టోపాధ్యాయుని కొడుకు అప్పణ్ణ గయాయందొక మఠమును కట్టించి దేవ, పితృ, మనుష్య ఋణములను తీర్చికొనెను.

"శ్రీహొయసణ శ్రీ వీరనారసింగదేవర దేహార
ద ఆచార్య పద్మనాభ భటోపాధ్యాయర
మగ మప్పంణను గయా ప్రజన మఠవ
మాడి దేవరిణ పితృరిణ మనుష్యరిణ వను
కళెదను"—

iii శ్రీ కృష్ణదేవరాయల శాసనము.

iv విజయనగర శ్రీ అచ్యుతదేవరాయల శాసనము. ఇందు తిరుమలంవ విజయనగర సింహాసన కర్తలను గయాముక్తి చేసినది గలదు. శాసనములో తిమ్మయ, ఈశ్వర, నారసింహ అని పేర్లున్నవి. వీరు అచ్యుతరాయల పితృపితామహులు.

"........................
శ్రీ మన్మహారాజాధిరాజ రా
జపరమేశ్వర శ్రీ వీరప్రతాప హిం
దూరాజ్యస్థాపనా చార్య య
దుకుల తిలక తింమ్మయ ఈ
శ్వరనారసింహ మండలే
శ్వర శ్రీ వీర అచ్యుతరాయ మ
హారాయల ధర్మశాసనం| తిం
మణంవ విజయనగర సింహా
సనకర్తల గయాముక్తం చేసెను."

ఇట్లు తమకు మారుగ కాశీరామేశ్వరాది క్షేత్రముల కితరులను పంపు నాచారమునకు నిదర్శనములుగా మరికొన్ని శాసనములు గూడ గలవు.

1. "శ్రీమతు బాచయ బొప్పనికి వితయమూనై
నారాయణుని అశ్వమేధమాడిని వారణాసికిం బుచ్చి
... సాధసముద్రం.వినకం జెట్టివ.త్రితి.ము.ఎ"[9] ....

2. "సోమయ పెద్దింగారికి సేతువర్శనమున్ను
సముద్ర స్నానమున్ను సేయించిన దక్షిణ
మరుతులు| శ్రీవత్సగోత్రులైన ఆలేటి పోతయ
ఘటశాసులకు తమకై శ్రీ పర్వత ప్రదక్షిణము
సేయించిన దక్షిణ ముప్పాతిక|...తమకై
కర్నాటక మాసానను తుంగభద్ర అందు స్నా
నాలు సేయించిన దక్షిణ మరుతులు..." [10].

మొదటి శాసనమున కాలములేదు. రెండవ శాసనము మల్యాలగుండెయది. కాలము క్రీ. శ. 1272. కృష్ణదేవరాయలకు పూర్వము, 2, 3 శతాబ్దములనుండి యిట్టి ఆచార ముండినట్లు శాసనములే చెప్పుచున్నవి. అచ్యుతరాయల గయాశాసన మీ విషయము మరింత స్పష్టము చేయుచున్నదిగదా! శ్రీ కృష్ణదేవరాయలు గొప్ప వైష్ణవభక్తుడు, అన్ని సంప్రదాయములయందు విశ్వాసము గలవాడు. స్వయముగ నీతడు కంచి, కాళహస్తి, కుంభకోణము, తంజావూరు, రామేశ్వరము, మధుర, గోకర్ణము, శ్రీరంగము, శ్రీశైలము, అమరావతి, శ్రీకాకుళము, బెజవాడ, రాజమహేంద్రవరము, సింహాచలము, శ్రీకూర్మము మున్నగు దక్షిణదేశమునందలి ప్రధానపుణ్యక్షేత్రముల నన్నింటిని దర్శించి, యా దేవస్థానముల కనేకవసతుల నొసంగియుండెను. తిరుమల శ్రీ వెంకటేశ్వరు డీతని యిష్టదైవము. తన దిగ్విజయము లన్నియు ఆ దేవుని యనుగ్రహమువలననే లభించుచున్నవని యీతని నమ్మకము. అధమ మేడు మారులైనను ఆస్వామిని దర్శించినట్లచ్చటి శాసనములే చెప్పుచున్నవి. ఆతని తీర్థయాత్రాభిలాష, ఆగమోక్తమైన కర్మలయం దాదరము నాతని శాసనములలో గల యీ క్రింది శ్లోకమే చాటుచున్నది.

"కాంచీ శ్రీశైల శోణాచల కనక సభా
వేంకటాద్రిప్రముఖ్య
ష్వావర్త్యావర్త్య సర్వ ష్వతనుత విధివత్
భూయసీ శ్రేయసే యః,
దేవస్థానేషు తీర్థే ష్వపి కనక తులా
పూరుషాదీని నానా
. . . . . . .

9. హైదరాబాదు శాసనసంపుటములు (A corpus of Inscriptions in the Telingana Districts) No- 13 part II page 141.

10. డిటో ,, ,, పేజి 147—148.

దానాస్యైవోపదానై రపి సమ మఖిలై
రాగమోక్తాని తాని."

రాయలు తల్లిదండ్రులగు నాగమాంబా నరసా నాయకుల పేర ననేక ధర్మములు చేసిన వితరణశాలి. హైందవసంప్రదాయానుసారము మాతాపితల సుకృతార్థము తిమ్మకవిని గయకు పంపుటలోగల ఆశ్చర్యమేమి? వెళ్లిన తిమ్మన నియోగిబిడ్డ. అందులో కవి. కనుకనే శ్రీకృష్ణదేవరాయల విజయశాసనమని కీయించినాడు. నిజమునకు కృష్ణరాయలే యుత్తరహిందూస్థానముపై దండెత్తి యపూర్వ దిగ్విజయమును సాధించి ప్రక్కనున్న తిమ్మకవిని జూచి "జయం యేరీతి?"—అని విజయశాసనము వ్రాయమనియుండిన

"నరసింహ కృష్ణరాయా
దురమున నీ పేరిఁ జేరు తురకల ద్రుంచెన్"
"రాయగ్రామణి కృష్ణరాయ! భవదు
గ్రక్రూర ఖడ్గాహిచేఁ
గాయంబూడ్చి కళింగ దేశ నృపతుల్
కా నిర్ఘరీ పోషణీ..."

అనుచు వెనుక తాను చెప్పినట్లు వీరరస ముట్టిపడుచుండవలెగాని నీరసముగా "తిరుమల దేవి వల్లభ" అని పాచిపడ్డ పారిజాతాపహరణములోని పద్యమా అక్కడ చెప్పెడును? ఇక డాక్టరు వెంకటరమణయ్యగారు చెప్పినట్టి విశేషాంశ మేదో యీ కంద పద్యపు ఆఖరిపాదము "భాష దప్పువరగండాంకా"లో నున్న దనుకొనుటకంటె మొదటి పాదమున "తిరుమలదేవి వల్లభ" అను సంబోధనలోనే యున్నదని నా యభిప్రాయము. 'భాషగె తప్పువ రాయరగండ' అనునది కృష్ణరాయల శాసనములలో నసమను నూరింట్లోనైన గలదు. ముక్కు తిమ్మన కవిని తిరుమలదేవి కామె పుట్టినింటివా రరణముగా నిచ్చినారనిగదా లోకములో ప్రతీతి. ఇందు సత్యాసత్యము లెట్లున్నను తిరుమలదేవి యందు తిమ్మకవికి ప్రీతి యుండుననుట కీ శాసన మొక్కటియే సాక్షి. అట్టి తిరుమలదేవి కృష్ణరాయల కృపవలననే తనకీ యపూర్వ తీర్థయాత్ర లభించినది. కనుకనే ఆ పవిత్రస్థలములో నెల్లైనను తిరుమలదేవి పేరువచ్చుటకే యిట్టి సంబోధనార్థమైన పద్యమును గూర్చుట. మరియు "ఈశ్వర నరసభూపురందర" యనుటలో కృష్ణదేవరాయల తండ్రి తాతలు పేర్లు రెండును గవు.

విజయనగర రాజ్యములో తిమ్మన నామధేయులు చాలమంది గలరు. డాక్టరు చిలుకూరి నారాయణ రావుగారొకప్పుడు పారిజాతాపహరణమును గూర్చి వ్రాయుచు "తిమ్మన్న మంచి లౌక్యుడు; ఆర్వేల నియోగి బిడ్డడు. కృష్ణరాయని రాజ్యములో మంచి పలుకుబడి సంపాదించుకొన్నాడు. మాన్యాలు కూడా సంపాదించుకొన్నాడు. సంపాదించినదానిలో యితరులకు ఇచ్చిన వదాన్యుడు కూడాను. కృష్ణరాయానంతరము అచ్యుతరాయల కాలములో శ్రీ మన్మండలేశ్వర శ్రీ రాజా చినతిరుమలరాజు మహారాజుల కార్యకర్తగా ఉండి నెల్లూరిజిల్లా, నెల్లూరితాలూకా, కొమ్మరపూడి గ్రామమును శక ౧౪౪౮ (క్రీ. శ. 1526) సంవత్సరము ఉత్థానద్వాదశినాడు శ్రీ వేదాద్రి నరసింహస్వామికి దానముచేసినాడు...ఒకవేళ అతడు నెల్లూరుజిల్లావాడేమో! తిమ్మన్న కడపజిల్లా, బద్వేలు తాలూకా, కత్తెరగండ్ల గ్రామముమీద పన్నును శ్రీ సదాశివరాయల అనుమతిమీద శక ౧౪౬౯ (క్రీ. శ. 1547) సంవత్సరమున తొలగించినాడు."[11] అనుచు విజయనగర రాజుల శాసనములలో కనబడు తిమ్మన్నలందరు ముక్కు తిమ్మన్నలే యని, అతడే నూరు నూటయేభైయేండ్లు జీవించియుండినట్లుగా అభిప్రాయపడ్డారు. ఇలాంటి పొరపాటులు రాకుండుటకే గాబోలు మన తిమ్మకవి శాసనములో పారిజాతాపహరణములోని పద్యమే కాకుండ 'ముక్కు' శబ్దమును గూడ ముద్దుగా తన పేరునకు ముందుంచుకొనినాడు.

నా యీ వ్యాసము నెంతమాత్రము డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారి వ్యాసముపై విమర్శగా తలంచరాదని ప్రార్థించుచున్నాను. వారి అమూల్యమైన గ్రంథములు, వ్యాసములే నాకు చరిత్ర నభ్యసించుటకు సాధనములు. నాకే కాదు వారి గ్రంథములు, వ్యాసములు చదివిన యే ఆంధ్రునకైనను వారి యందు విశేషగౌరవము కలుగుననియే నా విశ్వాసము. ఈ శాసనమునుబట్టి వారూహించిన కృష్ణదేవరాయల విజయము కూడ భావి పరిశోధన ఫలితమున సత్యమగునేమో!

"ఋషీణాం పున రాద్యానాం వాచ మర్థోనుధావతి."

---

11. భారతి అష్టాదశసంపుటము; ద్వితీయ భాగము పుట 2.

# గోరువంకల లోకసభ

శ్రీ నాయని సుబ్బారావు

గోరువంకల లోక సభా
వరణము నిర్వేల శాంతి పరిణతశోభా
భరిత మయి పవళ్లిల్లను
పరమ మునీశ్వరు సమాధిభావము దాల్చున్.

సాయంకాలములన్ వికర్తనతనూసౌవర్ణరశ్మిచ్ఛటా
శ్రీ యుక్తిన్ కొనసాగు రథ్యలబడిన్ హృద్యాంగ సౌందర్య రే
ఖా యోగాంచితరమ్యరూపములు పక్షప్రస్ఫురత్కాళికా
భూయిష్ఠమ్ములు వచ్చునచ్చటికి గుంపుల్ గుంపులై శారికల్.

ఒకకొన్ని పైకి క్రిందికి లేచి పడు చబ్ధి యలల చందమున నుయ్యాల లూగి
పఱచి లక్ష్యము చించి తిరిగి తూణముదూఱు నమ్ములక్రియ కొన్ని వారువు సూపి
మఱికొన్ని ప్రోడజాలరి హస్తముకొలంది విసరిన వలమాడ్కి విరియబాఱి
రయ సుదర్శన సుదర్శన లీల కొన్ని చిత్తాకర్షముగ వలయములు తిరిగి
సాధిత విచిత్రగతి విశేషములు దిగిభకర్ణ తర్పిత కలకూజకములు పక్షు
లన్నియును పిండుగట్టి సభాంగణమ్ము వెలుగు కలికలుగా నిండుకొలువుదీఱు.

వెలి కర్మాగారపు రే
కుల కప్పే వాని కొలువుకూటము బిగుసై
దళమైన కేశముల నొ
క్కల తలవలె నొప్పునది మొగుళ్లు దిగుళ్లై.

అచట నవి కొలుఁదీరి యున్నంత సేపు
సామగానమ్ము మునరిన చాయ విశ్వ
భృన్మహామంత్రము పునశ్చరించి నట్లు
లచటు కలనాద ముఖరితమ్మై తనర్చు.

ఎదురింటి పంచలో నే
నిదియంతయు గనుచు తన్మయీభావ సమా

న్వదచిత్తవృత్తినై స
మ్మదాతిరేకమున నేను మఱచుచు నుంటిన్.

ఒక సాయంకాలము శా
రిక యొకదు సహోనమాధుర ద్యక్కుల నను త
ప్పక నిక్షించి మహోజ్వ
ర్యాకరమనుభాష్యక్తి నిట్టులనినట్లయ్యెన్.

దినబత్తెమ్ములు లేవు లేవు ఘనబత్తెమ్ముల్ ప్రయాణార్థమై
ధనధాన్యాదులు లేవు లేవు నెలజీతాలట్టులయ్యున్ నిరం
చన దౌర్భాగ్య పరీతచిత్తమున నేనాడైన నాగలు పె
ట్టిన పాపమ్మున పోయినారిచట తండ్రీ! యెవ్వరో చెప్పనే!

పగలెల్లన్ తిమి మీఱ పొట్టకొఱకే పాట్లొంది పడంగా వలెన్
మగవాల్ పూరుషు లర్భకుల్ ముదుక లన్నజ్జాతి సర్వమ్ము దు
గ్భగలై సోమరిపోతులై పురుటికిన్ భాగమ్ముగా నిజ్జనీ
లుగులుండో యెటి యద్భవిష్య లిక మాలో నెవ్వరో చెప్పవే!

ఈ నాదాంచిత జాతివేశనము నీ వన్నాళ్లుగా చూతువున్
వేనుల్ నిండుకొనంగ నాసనములన్ మీసాల్ మెలింకెట్టులో
గానీ యెన్నడుగాని నోరుమెదపంగా చేతగానట్టిరా
మానస్వామివరేణ్యు లెవ్వ రిచటన్ మా వారిలో చెప్పవే!

సమదాటోపగ జేర్చి వ్యర్థమగు చర్చల్ సేయ మెన్నండు స
త్రమ భావోద్ధతి సత్సభాజనతిరస్కారమ్ముగా రోవ సి
వ్యక్తిగుణంబుల్ బొనరింప మేమెఱుం స్వార్థప్రక్రియల్ లే వక్ర
త్రివాసై గుండెల గూడుగట్టుకొని జాతిక్షేమమే నిల్చుటన్.

ఒండొంటన్ సహకారభావమున శ్రేయోమార్గ విశేషముల్
సండీనాది బహుప్రచారగతి విస్తారాధ్యముల్ పక్షముల్
రెండే మా కపమార్గసంచరణకేళిన్ జాతిసౌభాగ్యమున్
తుండెల్ తుండెలు సేయు పక్షముల చేతోయమ్మునన్ పెంచమున్.

మాకును పెద్దలు గల ర
య్యా! కంతేకాల కల్పులైన మహాత్ముల్

చేకొని మము దుర్గుణ విప
పాకార్తిని గ్రుంగకుండ ప్రతిపాలింపన్.

పరపీడనమే పాపము
పరోపకారమ్మె పుణ్య వర్తనమని చే
సిన నా గురుదేశము త
న్నిరంతరస్మరణ మము పునీతుల జేయన్.

అన్యమహామంత్ర మిట్లు సాయంతనముల్
ననుదినమ్మును నైకకంఠ్యమున మేము
విశ్వహితమును గోరి జపింతు మిదియె
గెలిచు మా లోకసభ ప్రవర్తిల్లు గాక.

మీకున్ దారకమంత్ర మొక్కట దది సామాజీన్య మార్గమ్మునన్
శ్రీకళ్యాణగుణాకరమ్ముగ నమర్పించెన్ గదా మీగురుం
డా కీర్త్యుజ్జ్వలు దివ్యబోధ పరిణామ ప్రజ్ఞులై జాతినే
నాకార్యత్వరమానచిత్తముల మీ వారెల్ల వర్తింతురా?

పిడికిలి నడంగు మతిలేని పిట్టలము గ
దయ్య! మనుష్యసురావాద్య లక్షణధర్మ
మార్గ సంస్థాపకుండది మనువు కొలము
వారు మీకేను చెప్పెడి వారమయ్య!

అదె కాలప్రతిపిద్ధుడౌచు నరుణుం డస్తంగతుండయ్యెన్
పదముల్ తొట్రిల పిల్లచీకటులు వెంపర్లాడు సంధ్యానతీ
మృదు ఫాలాంకిత రమ్యకుంకుమరుచుల్ క్రుంగెన్ కులాయమ్ములం
దొదుగంగా తఱియయ్యె మాకు సెలవిమ్మా మానవశ్రీనిధీ!

అని యిటుల్ పక్షి మాటాడినంత సేపు
మైకమున బడినట్లున్న మానసమ్ము
తేఱి యరమోడ్పు కన్నులు తెఱచి చూడ
నచట గోరువంక యొక్కటియైన లేదు.

గోరువంకల లోకసభా
వరణము తెలిమంచు ముసుగు వలిపమున మనో
హర రూపత రేలెల్లను
పరమశివాంగమ్ములీల ప్రతిభాసించున్.

# మనకుగల విధులు

శ్రీ కామరాజుగడ్డ రామచంద్రరావు

సర్వవిధుల్లో తను బ్రతకటం మొదటి విధి. తనవాళ్లను బ్రతికేటట్టు చేయటం యింకో విధి. తనకోసం పాటుపడటం, తనవారికోసం శ్రమించటం ముఖ్యతమం. ఈ ఆశయంకోసం కొందర్ని స్నేహితులుగాను, కొందర్ని అధికార్లుగానూ, కొందర్ని ఆప్తులుగాను మనం పరిగణిస్తాము. ఇలా మానవుడు పరిగణించటం తన మనుగడకొఱకు, తనవారి మనుగడకొఱకు అవసరం. ఎందుచేతనంటే ఇతర్లు తనను స్నేహితునిగా అధికారిగా ఆప్తుడుగా పరిగణించటం తను బ్రతుకుటకు అవసరం. ఒక క్రూరమృగం బ్రతికినట్టు మనుష్యుడు బ్రతకలేడు. అతడు సంఘజీవి. ఇచ్చి పుచ్చుకుంటాడు. తను మర్యాదగ ప్రవర్తించినపుడే తను యితరులచేత మర్యాదగ చూడబడగలడు. ఇది సంఘజీవి లక్షణం. సంఘజీవితం మనిషికి లక్షణం.

## కట్టుబాట్లు

బ్రతుకులో ఫలాపేక్ష లనేకం. ప్రతిమానవుడికి యీ ఫలాపేక్షలు సామాన్యమే. వీటిని సంరక్షించుకోవటం ప్రతిమనుష్యునికి అవసరమే అంతే గాదు. తన ఫలాపేక్షలే కాక యితరుని ఫలాపేక్షలను సంరక్షించటం కూడ అతడు కోరుతాడు. ఎందుచేత? తన ఫలాపేక్షలను సంరక్షించుటకు ఇతరుని సాయం తనకు కావాలి కనక. ఈ విధంగా ఒకనికి, మరొకనికి గల సంబంధం కట్టుబాటయి నిలుస్తుంది. ఈకట్టుబాటువల్లనే సమాజం లేక సంఘం అనేవి యేర్పడ్డాయి ఈ సంఘం ఆశయం ప్రతిమనుష్యుని ఫలాపేక్షలను సంరక్షించటమే. ఈ సమాజం మనుష్యుని నెత్తిపై కొన్ని విధులున్నట్లు భావిస్తుంది. ఎలాగంటే,—తన యింటి కసువూడ్చి ప్రక్కయింటివాడి గుమ్మంలో పొయ్యరాదు. ఎందుచేతనంటే అలా పోయటంవల్ల ప్రక్కింటి వానికి, బ్రతకటానికొక విఘ్నమైన ఆటంకం కదా! అలా పోయకుండా ఉండటం మొదటివాని విధి. ఈవిధి అంటే యేమిటో విచారించాలి ముందర.

విధి అంటే ఒకడు మరియొకడికొరకు చెయ్యవలసిన పని కావచ్చు. ఒకడు మరొకడి విషయంలో ఒక పనిని చేయకుండవలసిన అవసరం కావచ్చు. ఉదాహరణకు ఒకరు రెండవవారిని కొట్టరాదు. కొట్టకుండ వుండటం. ఆ రెండవ వాని బ్రతుకుకు అత్యవసరమైనది గదా! ఇలా ఒకడిచేత కొన్ని పనులు చేయించటం, కొన్ని పనులు చేయకుండా చూడటం సంఘం చేస్తుంది. ఆ పనులు చెయ్యవలసిన బాధ్యత వ్యక్తి విధి అయివుంది.

## విధి నిర్వచనం

'గ్రే' అనే ఆయన విధిని ఇలా నిర్వచించాడు: "సంఘంచేత ఆదేశింపబడి ఒక మనుష్యుడు యేదైనా పని చెయ్యవలసివుంటే, లేదా ఒక పనిచేయకుండా వుండవలసివుంటే, ఆ చెయ్యవలసిన పని, లేదా ఆ చేయకుండా వుండవలసిన అవసరం అతడి విధి అవుతుంది" అని. సంఘంచేత "ఆదేశింపబడి" అనే మాటలో కొంత విశిష్టత వుంది. విధిని వ్యక్తిచేత నిర్వర్తింపజేయటం సంఘం పని గనుక సంఘం ఆదేశించటంలో ఆ పనిని అతడు చేసి తీరవలెను-లేదా ఆ పనిని అతడు చేయకుండనే వుండి తీరవలెను అనే ఒత్తిడి గమనించ తగింది. భోజనానంతరం మంచి నీరు త్రాగవలెను. ఇది సంఘం ఆదేశించినదని అనము. ఎందుచేత? ఎవడైనా మంచి నీరు త్రాగకపోతే సంఘం పట్టి బలవంతాన త్రాగించదు గనుక. అందువలన మంచినీరు త్రాగటం అనేది వ్యావహారిక విధి (Legal duty) కాదు. కల్లు త్రాగరాదు అని సంఘం నిర్ణయించిందనుకోండి. ఎవడైనా కల్లుత్రాగితే, సంఘం వూరుకోదు. అందుచేత కల్లుత్రాగకుండ వుండటం వ్యావహారిక విధి అవుతుంది. ఈ నిర్బంధం ఎలా అమలు జరుగుతుంది అనే విషయం వేరు. పోలీసులద్వారానో ఎలానో సంఘం అమలు జరిపిస్తుంది. పై నిర్వచనంలో ఈ భాగాన్ని నొక్కుతూ "హిబ్బర్టు" అనే ఆయన విధికి మరొక నిర్వచన మిచ్చాడు. అందులో సంఘం అనే మాటకు బదులు శాసనం (లేకపోతే 'లా') అనే మాట వాడేశాడు. దీనికి కారణం,—పూర్వకాలంలో సంఘం ఒక్కటే విధులను వ్యక్తులచేత నిర్వర్తింపజేస్తుండేది. మరి యిప్పుడు సుమారు ప్రతి విధికూడ ఒక శాసనపూర్వకంగా లేక కోర్టు నిర్ణయించిన 'లా' పూర్వకంగా నిర్వర్తింపబడుతోంది గదా! ఆయన నిర్వచనం ఇది: "ఒకడు, 'లా' తనను ఆదేశించిన పని జరుపకుండా వున్నట్లయితే లా చేతనే నిర్బంధపెట్టబడి వ్యావహారికమైన శిక్షకు బాధ్యుడౌతాడు.

ఆ శాస్యతయే విధి" అని. శిక్ష అన్నంతమాత్రంచేత జైలు ప్రాప్తి, ఉరితీయటం, జుల్మానాలు మాత్రమే కావు. పాఠం చదవకపోతే, ఉపాధ్యాయు డేం చేస్తాడు? నిలబెట్టి చదివిస్తాడు. అలాగే తను చేయ మన్న పని చేయకపోతే, సంఘం అనేక విధాల ఆ పని అతనిచేత చేయింపజేస్తుంది. ఈ చేయింపజేయటంలో కలిగిన ఒత్తిడే - నిర్బంధమే - శిక్ష. వ్యావహారిక మైన శిక్షకు ఆ మాత్రం నిర్బంధం - ఒత్తిడి - చాలు. జుల్మానాయే వేయవలయునని లేదు. ఉరితీయ టమే జరగాలని లేదు. జైలుప్రాప్తియే కావలె నని లేదు.

పై నిర్వచనం మూలకంగా సంఘం (ఇకనిప్పుడు 'లా' అని వుపయోగించవచ్చు ననుకొంటాను) ఎక్క డెక్కడైతే నిర్దిష్టమైనపనులు చేయించటానికి మను ష్యునిపై ఒత్తిడి తెస్తుందో అక్కడల్లా విధివుండి నిర్వర్తింప బడలేదని అర్థం. అదికాక, ఎక్కడ బాట తప్పటం జరిగిందో ఎక్కడ తప్పిదం కలిగిందో ఎక్కడ నేరం జరిగిందో అక్కడల్లా యీ వ్యవహారపు ఒత్తిడి (Legal sanction) నిలా ఏర్పాటుచేస్తుంది కనుక అక్కడ విధి నిర్వర్తింపబడలేదని చెప్పవచ్చు. ఒక విధంగా, ఆలోచిస్తే మనం తోకపట్టుకొని పైకి ప్రాకు తున్నట్లనిపిస్తుంది. 'శాసనంచేసే కారణమేమంటే విధి నిర్వర్తింపజేయటానికి.' ఆశాసనంచేయటానికి ముందు విధిని నిర్దిష్టంగా తెలుసుకొని, దానికి శిక్ష లేక అది చేయటానికి తగిన ఒత్తిడిని ఏర్పాటుచేస్తారు. కాని మనం ముందు శాసనంలో శిక్ష యెక్కడ వుందో చూస్తాము. అక్కడనే విధి అనేది ఒకటి వున్నదని గమనిస్తాము. ఎలా తెలుసుకున్నా రెండూ విడి విడిగా తెలుసుకోవాలి. విధి తెలిస్తే ఒత్తిడి యెలా చెయ్యాలి అన్నదానికీ ఒత్తిడి చేయటమేమిటో తెలిస్తే విధి యేమిటీ అనేదానికీ కూడ శాసనంగాని, కోర్టులు నిర్ణయించిపెట్టిన యితర 'లా' గాని చూడవలసి వుంటుంది.

## విధుల వైవిధ్యం

విధులు రకరకాలు. ఆ రకాలన్నీ తెలుసుకొని తర్జనభర్జనచేస్తేనే కాని వాటి విలువ తెలియదు. ప్రతి చిన్నవిషయం శీర్ణవిశీర్ణంచేసి పరీక్షించినప్పుడు గాని ఒక శాస్త్రవిషయం మనసుల్లో నిలవదు. గులాబీ పువ్వు ఎఱ్ఱగా మెత్తగా మంచి సువాసన నిస్తూ వున్నదనే విషయం స్థూలదృష్టికి తేలిగ్గా తెలుస్తుంది. శాస్త్రదృష్టికి తెలిసేది ఇంకా కొంచెం విశిష్టమైనదై వుంటుంది. గులాబీపువ్వు యక్షిణీయంత్రం (మైక్రో స్కోపు) క్రింద పెట్టిచూస్తే కొన్ని వేల రంధ్రాలు ప్రతి రేకులోనూ కన్పడతాయి. జీవకణాలు దాని శరీరంలో తిరుగుతూ వుంటాయి. ఇవన్నీ ఆ గులాబీ పువ్వు ననుభవించేందుకు అవసరమైన విషయా లేనాఅంటే, నిజంకాకపోవచ్చు. ఐతే, ఆ విషయాలు, గులాబీ మొక్కల్ని పెంచటానికీ, గులాబీ రెక్కల్లో రంగుల్ని కలిగించి అనుభవాల్ని అత్యధికం చెయ్య టానికీ అవసరమైనవే ననిపిస్తుంది. అలాగే విధులు అనేక ప్రాకారాలంటే, ఏమేమిటో తెలిసికొంటే అది వచ్చినచోటల్లా యిది ఫలానా రకమని చెప్పి దాని గుణగణాలన్నా, అందులో పుట్టిన హక్కు గుణగణా లన్నా తెలుసుకోవచ్చు. కొన్ని రకాలు చూదాం.

## (1) క్రియాపూర్వకవిధులు-తద్వ్యతిరేకాలు

తండ్రి బిడ్డకు భోజనం సంపాదించిపెట్టాలనేది ఆ తండ్రి చేయవలసిన విధి. అలా పెట్టకపోతే అతను తన విధిని నిర్వర్తించినవాడు కాడు. భార్య భర్తతో సంసారము చేయాలి. అలా సంసారముచేయక దూరముకెళ్ళిపోతే, భార్య తన విధి నిర్వర్తించక పోయిన దవుతుంది. ఆ బిడ్డ తండ్రిచేత, సంఘము ద్వారా అనగా 'లా' ప్రకారం తన భోజనమునకు ఏర్పాటు చేయింపజేయవచ్చును. ఆ తండ్రి కిష్టము లేకపోయినా తిట్టుకొంటూనైననూ అలాంటి యేర్పాటు చేయక తీరదు. ఆ భర్త కోర్టుద్వారా తన భార్యను రప్పించి తన ఆధీనం చేయించుకొన వచ్చును. ఆమె యిష్టాయిష్టముల నెవరూ మార్చలేక పోవచ్చునుగాని ఆమె శారీరకంగా తీసికొనిరాబడి భర్తచేత కప్పగించబడవచ్చును. ఈ విధులలో, చేయ వలసిన క్రియ ఒకటి యేదో వుండితీరుతుంది. అందు చేతనే యివి క్రియచే చేయవలసిన విధులు. లేక క్రియా పూర్వకవిధులు (Positive duties) అని అంటాము.

చేయవలసిన క్రియ యేదీ లేని విధులు కొన్ని ఉం టాయి. అవి పై చెప్పిన విధులకు వ్యతిరేకమైనవి. ఏదో కొన్నిపనులు చేయకుండ వుండటమే విధి. అంచేత అవి వ్యతిరేక విధులు (Negative duties). అవెలాంటి వంటే, ఈ యిల్లు నాదయితే మీ రెవరూ తద్వ్యతిరేకంగా నడువరాదు. అంటే ఆ యింటిని మీదేననుకోవటం, అలా ప్రవర్తించటం చెయ్యరాదు. అనగా ఇతరులకు చెందిన ఆస్తిపై తమ భోక్త్యం కలుగ జేసుకోకుండా వుండాలి. ఇక్కడ హక్కుకు వ్యతి రేకమయిన క్రియ యేదీన్నీ చేయకుండావుండవలసిన అవసరం వుంది. అలాంటివే వ్యతిరేక విధులు. అలాం

టిని చేస్తే యేమవుతుంది? చేసినపనినిబట్టి వుంటుంది దాని పర్యవసానం. నా యింట్లో అక్రమంగా ఒక దొంగయ్య ప్రవేశిస్తే, అతడిని కోర్టువారు లేవగొట్టుతారు. నా స్థలంలో మరొక పొరుగయ్య గోడకట్టితే కోర్టువారు దాన్ని పడగొట్టించి, అందుకయిన ఖర్చు గూడ అతడిదగ్గరనుంచి వసూలుచేస్తారు. ఒక పొగరుబోతు ఒక అసమర్థుణ్ణి కొట్టితే, కోర్టువారు ఆ కొట్టిన వాణ్ణి శిక్షిస్తారు. దెబ్బను నయంచేసుకోటానికైన ఖర్చు లేదైనావుంటే అదిగూడ వానిదగ్గరనుంచి యిప్పిస్తారు. ఈ కోర్టుల్లో రోజూ జరిగే వ్యవహారం యిదే!!

## (2) ప్రధాన విధులు-అనుసరణ విధులు

ప్రధానమైన విధులు స్వతస్సిద్ధంగా తమంతట అవి నిలచి వుంటాయి; ఇతరవిధులమీద ఆధారపడవు. అలా ఆధారపడే విధులు రెండోరకపు విధులు; ఇవి ఇతరవిధుల్ని అనుసరించివుంటయి. ఒకడు మరొకని నెత్తిన మొట్టరాదు. ఇది ప్రధానమైన విధి. ఒకడు తను వ్రాసిన ప్రోనోటు క్రిందగల అప్పు చెల్లించవలెను. మరియొకని సొత్తు నెత్తుకొని పోరాదు. ఇవన్నీకూడ ప్రధానమైన విధు లనవచ్చు (Primary duties). ఇవి మరొక విధిపై ఆధారపడిలేవు.

ఇక అనుసరణ విధులంటే (Secondary duties) ఒక ప్రధానవిధి ననుసరించివుండే విధులు. ఒకడు ఇంకొకడి నెత్తిన మొట్టినా డనుకోండి. అతడు తన ప్రధానవిధి నిర్వర్తించలేదు. అందుచేత ఒక అనుసరణ విధి ఆ మొట్టినవానిపై పడుతుంది. అది యేమిటంటే ఆ మొట్టబడినవానికి నష్టపరిహారముక్రింద కొంత పైకం యివ్వవలసివుంటుంది. అది తన విధి అవుతుంది. కోర్టువారు యీ విధిని నిర్వర్తింపజేస్తారు. ఒకడు మరొకని సొత్తు ఎత్తుకొనిపోయినా డనుకోండి. అప్పుడు తనపై మరియొక అనుసరణ విధి వచ్చిపడింది. ఏమిటంటే, ఆ ఆస్తి తను కొన్నాళ్ళనుభవించినందుకు నష్టపరిహారం యిచ్చుకోవాలి. తనదగ్గరున్న ఆ ఆస్తి త్రిప్పి యీయవలెను. కనుక అనుసరణ విధులు సాధారణంగా తగాదా పరిష్కారంకోసం వుపయోగిస్తూ వుంటాయి (Remedial duty). నష్టపరిహారం యిప్పించవలసిరావటం (damages), ఆస్తి పునఃస్వాధీనం చేయవలసిరావటం (Restitution), శిక్షానుభవయోగం పొందటం (sanctioning duty) లాంటివి పరిష్కారమార్గాలు.

## (3) సర్వత్ర విధులు-సాంబంధిక విధులు

కొన్ని విధులు చాల ఘాటుగ వుంటాయి. అవి చెయ్యకపోతే కొంప మునుగుతుం దన్నమాట. అవి నిర్వర్తించకపోతే, ఒక నేరం చేసినట్టు భావించి శిక్షించుతా రనవచ్చు. ఉదాహరణకు: ప్రభుత్వానికి పన్ను కట్టవలెను. ఆత్మహత్యాప్రయత్నము చెయ్యరాదు. రోడ్డుమీద చెడత్రాగి సంచరించరాదు. మరొకర్ని చంపరాదు. ఈవిధమైన విన్నో వున్నాయి. వీటిని చేసినందువలాన మరియొక బ్రతికియున్న వ్యక్తి తన హక్కు యథాతథంగా దెబ్బతిన్నదని చెప్పలేడు. కాని సంఘంమాత్రం వీటి నసలు సహించదు. సంఘం అనేబదులు యిప్పుడు ప్రభుత్వం అనవచ్చు. ఆత్మహత్య చేసుకొంటే యెవరికి నష్టం? తనకే. ఐనా, సంఘానికికూడ నష్టమే. ప్రభుత్వం అలాటి ప్రయత్నాల్ని వారిస్తుంది. అలాటి ప్రయత్నం చేసినవారిని శిక్షిస్తుంది. అలాగే గోహింస ఒక మోతాదును మించి చెయరాదు అని "లా" వుంటే, యీ గోవులకు చంపకుండా వుంచబడవలసిన హక్కు వున్నదని అనగలమా? లేదు. ఎందుకనంటే వ్యవహారికపు హక్కులు (Legal rights) మనుష్యులకు మాత్రమే వుంటయి. [మనుష్యులు అంటే అర్థం, 'లా' దృష్టిలో మనుష్యులు అని అర్థం. సన్యాసి మనుష్యుడు కాడు. ఎందుచేతనంటే అతడు సర్వసంగపరిత్యాగి. హక్కుల ప్రసక్తి అతని కక్కర్లేదు. ఐతే ఒక కంపెనీ హక్కుల్ని కలిగివుండవచ్చు. ఒక సంస్థ హక్కులను కలిగివుండవచ్చు. అందుచేత యీ కంపెనీలు, సంస్థలు అన్నీ మనుష్యులే. లా దృష్టిలో మనుష్యులన్నమాట (Juristic persons.)] అయినా ప్రభుత్వం కొన్ని సందర్భాల్లో పైవాటిని నేరాలుగా పరిగణించి నేరస్థుణ్ణి దండిస్తూవుంటుంది. కనక ఇలాటి విధులు ప్రత్యేకమైన హక్కులు పుట్టటానికి ఆధారం కాకపోయిన సమయంలో కూడ అవి విధులుగానే గుర్తించబడి విధులుగానే నెరవేర్చబడుతవి. అందుకనే అవి 'Absolute duties' అని అన్నారు. సర్వత్రి, అవి విధులుగా పరిగణింపబడతాయి కనక మనం వాటిని సర్వత్రి విధు లవచ్చునేమో!

మిగతా విధులు ప్రత్యేకమైన హక్కుల పుట్టింపజేసేవి. అవి హక్కులకు సంబంధించిన విధులు. సాంబంధిక విధులనవచ్చు. అనగా relative

duties అన్నమాట. ఏదో ఒక హక్కునకు సంబంధించి వుంటాయవి.

## విధి, హక్కు కవలపిల్లలు

ఈ విధిని నిర్వర్తింపచేయటం అనేదాన్ని సంఘం ఎందుకు కల్పించపెట్టుకుంది? వ్యక్తుల ఫలాపేక్షలు రక్షించేటందుకు. ఆ ఫలాపేక్షలు, యీ విధి నిర్వర్తించేవాడిని వదలి మిగతావాని ఎవరివైనా కావచ్చు. ఒక శరభయ్య తన విధిని నిర్వర్తించకపోతే, మరొక శంకరయ్య సంఘంతో ఫిర్యాదుచేసి లేదా 'లా' చెలాయించే కోర్టులలో ఫిర్యాదుచేసి ఆ విధిని సంఘంద్వారా, లేదా ఆ కోర్టులద్వారా నిర్వర్తింపచేస్తాడు. అలా నిర్వర్తింపచేసేటందుకు ఆ శంకరయ్యకు హక్కు వున్నదంటాం. ఈ శంకరయ్య హక్కు ఆ శరభయ్యకున్న విధి ఒక్కసారే పుట్టినయి. అంచేత అవి ఒకటి విడిచి ఒకటి వుండవు. (చూడుడు. భారతి 1959 ఏప్రిల్ నెల సంచిక "మనకున్న హక్కులు" అనే శీర్షిక క్రింద.)

## పర్యవసానం

ఇంతకూ చెప్పవచ్చేదేమిటంటే ఒకడు తనపైనున్న విధి నెప్పుడు నిర్వర్తించలేదో ఆ విధిలో పుట్టిన హక్కు దెబ్బతింటుంది. ఆ హక్కు మరొకడిది అయివుంటుందిగదా! అతడు 'లబో' 'లబో' మని గోలపెట్టుతాడు. ఎక్కడ? కోర్టులో. కోర్టువారికి, యీ నిర్వర్తింపబడని విధిని లేదా దాని అనుసరణ విధిని నిర్వర్తింపచేయగలిగిన అధికారం వుంది. వారు సాక్ష్యం విని యీ ఫిర్యాది చెప్పేదంతా నిజమయితే, వెంటనే అమీనాలు పోలీసులద్వారా ఒత్తిడితెచ్చి మొదటివానిచేత విధిని నిర్వర్తింపచేస్తారు. ఆ నిర్వర్తింపచేసేది పైన చెప్పినట్టు వెనక అతడు చేయవలసిన విధియే అయియుండకపోవచ్చు. మరియొక అనుసరణ విధియై యుండవచ్చు. అనగా ఏ నష్టపరిహారమైనా యిప్పించవచ్చు. కట్టిన గోడ పగలగొట్టించటం—యిలాటి పనులు చేయిస్తారు. కోర్టువారు ఆ సమయంలో చెప్పినపనులన్నీ చేయటం అతడి బాధ్యత అవుతుంది. ఆ బాధ్యతను భరించక తప్పదు. దాని నతడు వద్దన్నా కోర్టువారు వదిలిపెట్టరు. ఏతావతా—ఒకడు తన విధి చెయ్యకపోతే, ఇంకొకడి హక్కు దెబ్బతింటుంది. కోర్టులచే అధికారం చెలాయింపబడుతుంది. కోర్టులు చెప్పినపనులు అన్నీ చెయ్యవలసిన బాధ్యత ఆ మొదటివాడు స్వీకరించవలసి వుంటుంది.

## హక్కులు కాపాడుకోకపోతే....

హక్కులు కాపాడుకోకపోతే ఏమవుతుంది? దెబ్బతిన్న హక్కులు కాపాడబడటానికి అధికారం చెలాయించబడదన్నమాట. అప్పుడు బాధ్యతను స్వీకరించవలసిన పని యెవరికీ వుండదు. ఎవని హక్కయితే దెబ్బతిన్నదో అతడు వెఱ్ఱివాడనబడతాడు. బజారులో ఒక అసామీని పట్టుకొని యింకొకడు పిలక లాగుతాడనుకోండి. హాస్యంకొఱకు కొంతసేపు వూరుకొంటాడు. హాస్యం వదిలింతర్వాతకూడ వూరుకొని నవ్వుతూ బాధ అనుభవిస్తూ వుండేవాణ్ణి మనమంతా వెర్రివాడంటల్లేమా? ఎంచేత? తన హక్కును తను కాపాడుకోలేనివాడయిపోతున్నా డతను. అంచేత వెఱ్ఱివాడు. కాకపోతే సన్యాసి అయివుంటాడేమో. (అనగా Civil death - ఐహికమైన మరణాన్ని పొందినవాడన్నమాట.) లేదా వట్టి అసమర్థుడున్నా 'సినికు' న్నా అయియుండవచ్చు. అలా వెఱ్ఱివాడనిపించుకోకుండా, సినిక్ కాకుండా వుండాలంటే తన విధులు నిర్వర్తించి, తన హక్కులు అనుభవించి అవసరమైతే అధికారాన్ని చెలాయింపచేయ్యాలి. దానికోసం వ్యవహారశాస్త్రం తెలుసుకోవాలి సాధ్యమైనంతవరకు.

ఐతే రాజ్యపాలకులకు (అనగా ప్రభుత్వము, కోర్టులు. శాసనసభలు కలిపినది) కూడ యీ హక్కులు, యీ విధులు, యీ బాధ్యతలూ వున్నాయా? ఇది ప్రస్తుతం వ్యవహారశాస్త్రంలో ఖరాఖండీగా తేలని సమస్య. దీని విషయం విచారించి చూడండి ఏమని మీ మనస్సుకు తోస్తుందో !!

# అపరోక్ష ధర్మము

శ్రీ హారీత శివశర్మ

ఇది ఇది కాదు కాదు, గదియించిన డెందము చిక్కెనెందు నా
యది యని లేదు లేదు, నెవ డే నిటులైతిని, సంగభావ వి
ద్యుదళని పాత తాడిత మహో! మరి యీ కిరవంపు బుద్ధికే
యదియని లేదు, లేదు నని యాడగరాదు, విచిత్రమై చనన్.

నే నెవ్వండను, నాకు నెవ్వగు, స్పృహా నిర్భర్త్సన క్రీడుడన్
నే నెవ్వండను, నాకు నెవ్వగు, వ్యథానిష్టా వినష్టాత్ముడన్
నాకున్ నేనె, మరెవ్వగుందురును, నానాభార సంక్లిష్టమై
పోకన్ నా తనువుం బొలంబుల నహో బో దుఃఖసంకల్పముల్.

ఇవి చేతులా? కావు; ఎవరికే నొకరికి బానిసత్వము చేయు బ్రతుకుదార్లు,
ఇదియు మస్తిష్కమా? ఇదియును బుద్ధియా? ఆగురాళ్ళకు నమ్ముడైన ముద్ద;
ఇది శరీరమ్మె కానే కాదు; గొడ్డుసంసారమ్మె సిదు పంజరము తేప;
ఇదియును జీవితంబెంతయుగాదు, నింతయగు కూటికొరకై త్రవ్వు నుదధి;
ఇంకలో నే నటన్న గుర్తిందుగలదు? కలదు ఒక్కటి పరమ దుఃఖమ్మె మాత్ర
మదియు సుఖమానో, దుఃఖమే యౌనో నాకు తేల్చి చెప్పగలాని ప్రార్థింతు సతము.

నాదని చెప్పకో నను నానని యట్టిది; నిత్యకష్ట ఝం
ఝూదళితంబునై, విధుర మార్గణ దత్తశరీర యాత్రమై
ఆదరి యీదరిన్ తెలియనట్టిదిమై, అతిభారమై, అహో
ఈ దురితంపు దుఃఖమున నీదను తేలను లేని జన్మమై.

నే గుడికట్టుకొంటి నిట నేనను చీకటి మెల్లలోపలన్
వేగయి 'నేను'కున్ పయిన వేరుగ నేమియు లేనియట్లుగా
లోగితి కామ్యక్రోధ మదలోభములన్, గడియించినట్లుగా
త్రాగితి సర్వతంత్రము స్వతంత్రము దివ్యసుధామధూక్తినాన్.

గడివోని హృదయ సంఘారామ సీమలో కలలు రేపితి తథాగతుడననుచు
నిత్య నూతన నవోన్మిషిత భావములోన రమణించితిని ఉత్క్రముడ ననుచు
సన్న్యసించితి సమస్తమును కర్మముగూడ నద్వైతసుధ త్రాగినట్లుగాగ
తలను చుట్టితిని వల్కలకల్పితము పాగ రిక్తజాతుల నుద్ధరించు బుద్ధి

కడకు సాధించినదియు, నా కన్ను నేనె పొడిచికొనినట్టులైనది; పొదలు దుఃఖ వారి నిగచిపను నలలపై విషాద గీతికలపాడు నావనై కేకుపడితి.

ఈ దుఃఖమ్ములు మేఘముల్ వలెను నా యీ మేనునందెల్ల నా
నా దార్గత్యపు భావముల్ చినుకు నంతన్ నేను నేనైతినా?
ఈ దుఃఖమ్ములు నేన? నే నెవడనం చెంతేని చింతించగా
ప్రాదుర్భావము చెందె నగ్నిశిఖలై రాజన్మహా భావముల్.

నే నెవ్వండను, నాకు నెవ్వరు, స్పృహానిర్వ్యథ చేతస్కుడన్;
నే నెవ్వండను, నాకు నెవ్వరు, కృథానిష్ఠాపటిష్ఠాత్ముడన్;
నాకున్ నే ననుబంధ మూడిపడిపో; నైతిన్ మహాకర్మ దీ
క్షా కల్యాణ ధురంధరుండను, జగత్కంజాత చండార్కుడన్.

శర్మమ్ము సర్వజగత్తు సాధిష్ఠ పథగామిగాగ,
వర్మమ్ము రీతి రక్షించి వర్తిల్లుచుండునదైన,
ధర్మమ్ము కర్మమ్ము, మరియుతర కర్మశక్తియునగును
కర్మమ్ము నేను, జగమున కర్మశక్తియుగూడ నేను.

కర్మమ్ము, కర్మశక్తియును కళ్యాణపథములయందు
ధర్మమ్ము త్రోవల త్రొక్క, ధరలోన నిల్వవయేని;
మర్మమ్ము విడిచి చెప్పెదను మరి మూఁడులోకముల్ లేవు
కూర్మిదైవములును లేరు కొల్లవో ప్రార్థించుటకును.

కర్మమ్ము కర్మశక్తియునుగాక ధర్మముల్ లేవు లోకముల
శర్మముల్; కర్మను నేను; కర్మమ్ము, కర్మశక్తియును
కర్మమ్ముచేయు కార్మికుడ; ధర్మమ్ము నిద్దియ; మరియు
మర్మమ్ము పెట్టి నెమకిననైన మరి వేరు ధర్మమ్ము చోరదు.

కర్మమ్ము, కర్మశక్తి మరి కర్మదగు ఫలంబు నెప్డు
కార్మికాహూథత జెంది ఘనఫలదాయక మగును,
శర్మమ్ము ధర్మమ్ము నదియు ధరలోన శాంతియు నదియు
దుర్మార్గుడగు కలి చెందు దుర్మరణముగూడ నదియు.

ఎల్ల పరోక్షధర్మముల నెక్కటి నెత్తిన దాల్చి లోన వ
ర్తిల్లెడి లోభమోహ మద తీవ్రతలన్ బడి, చెల్లరేగి, ధూ
ర్తిల్లిన మార్గముల్ వదలి తేరువబట్టుడు, సర్వలోక ర
క్షోల్లసితంబు కార్మికము నుత్తమమౌ అపరోక్ష ధర్మమున్.

# భారతీయ వాస్తు విజ్ఞానము

శ్రీ గడియారం రామకృష్ణశర్మ

## 1

భారతీయుల వాస్తుశిల్పము కళగా పరిగణింపబడినది. 'కళ' అనగా అంశము. 'క' కారము బ్రహ్మవాచక మగుటవలన సృష్టిని, 'ల' కారము లయమును సూచించుచున్నందున కళ కూడ సృష్టి, స్థితి, సంహార రూపమైనది. అక్షరమాలయందలి వ్యంజనాక్షరములకు మొదలు 'క' కారము; అంత్యము 'ల' కార మగుట వలనను, స్వరములు ప్రాణస్వరూపము లగుటవలనను క—ల అను అక్షరములలో లలితా త్రిపురసుందరీ స్వరూపము నిర్దిష్టమైయున్నది.1 శ్రీవిద్యోపాసనా బహిర్యాగక్రమమందు చంద్రమండల షోడశకళల నుపాసించునపుడు ముఖ్యమైన 'సాదా'ఖ్య కలయే త్రిపురసుందరీ స్వరూపము. ఈ పదునారు కళలనుండియే చతుష్షష్టికళలు, అక్షరములు పుట్టినవి. కావున శ్రీవిద్యాస్వరూపమైన దేవియే సర్వకళలకును మూలము.

భారతీయసంప్రదాయముప్రకారము కళ లరువదినాల్గు. బౌద్ధ, జైన, పురాణ, కామసూత్రాది వాఙ్మయమునం దీ కళలనుగూర్చి విస్తరముగ తెలుపబడినది. పురాణములలో శ్రీమద్భాగవత, హరివంశ, విష్ణుపురాణములందును, లలిత విస్తర (బౌద్ధగ్రంథము), ఉత్తరధ్యానసూత్ర (జైనగ్రంథము), వాత్స్యాయన కామసూత్ర, శుక్రనీతిసారములందును ఈ విషయములు చెప్పబడినవి. భాగవతాదులు కళలసంఖ్య అరువదినాలుగు అనినవి. కాని, వాని వివరములు తెలుపలేదు. భాగవత వ్యాఖ్యాతలలో విశ్వనాథ చక్రవర్తి, శ్రీధరస్వామి, వల్లభాచార్యులు మాత్రము అరువదినాలుగు కళల పేర్లను పేర్కొనకపోయినను ఇవి 'శివతంత్రము'న వివరింపబడినట్లు వ్రాసినారు. శుకదేవుడను మరొక వ్యాఖ్యాత కళలను దెల్పు 'విద్యాసంగ్రహ నిబంధము'ను పేర్కొన్నాడు. ఇంతకంటె మనకు పురాణములనుండి విశేషముగ తెలియుటలేదు.

బౌద్ధవాఙ్మయమునందలి 'లలిత విస్తర'మున 86—విశేషమైన కళలు, వాని పేర్లు పేర్కొనబడినవి.2 కాని అందు వాస్తువిద్య చేర్చబడలేదు. జైనగ్రంథము 'ప్రబంధకోశము'నందు 72 కళల నామము లొసగబడినవి. అందు 35 వ కళ "ప్రాసాద లక్షణం."

'శుక్రనీతిసారము'నందు 64 కళలు, వాని పద్ధతులు చెప్పబడినవి. వానిలో 27 వది 'తటాకవాపీప్రాసాద సమభూమిక్రియా'. వాత్స్యాయన కామసూత్రము'లో ప్రథమాధికరణమునందు స్త్రీ పురుషు లభ్యసింపదగిన చతుష్షష్టి కళలు, మరికొన్ని ఉపకళలు సవిస్తరముగ తెలుపబడినవి. వానిలో 38 వ కళ "వాస్తువిద్యా". 'కామసూత్ర' వ్యాఖ్యాత 'యశోధరుడు' తన వ్యాఖ్యలో 64 మూలకళలనియు, వాని సూక్ష్మవిభాగములు చేసినచో 518 కళలగుననియు చెప్పినాడు.

ప్రాచీన భారతమున 64 కళలతోబాటు 32 విద్యలును వ్యవహారమునందుండి ప్రతివాడు విధిగా అభ్యసింపవలసియుండెను. పై 32 విద్యలలో 'శిల్పశాస్త్రము' కూడ కలదు.

32 విద్యలు:— వేదములు నాలుగు: ఋగ్యజుస్సామాథర్వములు.

ఉపవేదములు నాలుగు: ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వవేద, తంత్రములు.

వేదాంగము లారు: శిక్షాకల్ప వ్యాకరణ నిరుక్త జ్యోతిష చ్ఛందస్సులు.

ముఖ్యశాస్త్రము లైదు: మీమాంసా, తర్క, సాంఖ్య యోగ వేదాంతములు.

ఇతరశాస్త్రములు పదుమూడు: ఇతిహాస, పురాణ, స్మృతి, నాస్తికమత, అర్థశాస్త్ర, శిల్పశాస్త్ర, అలంకార, కావ్య, దేశభాషా, స్వరోక్తి, యవనమత, దేశాది—ధర్మశాస్త్రములు.

ఈ శాస్త్రములలో ఆయా విషయములకు సంబంధించిన లక్షణములు నిర్వచింపబడినవి. ఇవన్నియు భారతీయుల ప్రతిభ అన్నిరంగములలో ఎట్టిస్థితిలో నుండెనో చాటుచున్నవి.

## 2

భారతీయ వాస్తు విజ్ఞానమును నేటి ఆధునిక ప్రపంచమునకు పరిచయము చేయుటకు తగిన కృషి

---

1. అకచటతపయాద్యైః సప్తభిర్వర్ణవర్గైః విరచితముఖబాహాపాద మధ్యాస్యహృత్కా | సకలజగదధీశా శాశ్వతా విశ్వయోనిః వితరతు పరిశుద్ధిం చేతసః శారదా వః॥ "ప్రపంచ సార".

2. ప్రాచీన భారత్ కే కలాత్మక్ వినోద్ (హిందీ)

జరుగుటలేదు. పాశ్చాత్య వాస్తుశాస్త్రము నధ్యయనము చేసిన దేశీయ, విదేశీయ పండితులు భారతీయ నిర్మాణములను చూచి విరగబడుచుండిరేగాని వానిని గూర్చి క్షుణ్ణముగ తెలిసికొనుటకు ప్రయత్నించుటలేదు.

మన వాస్తువిశేషములను గ్రహించుటకు కృషి చేసిన పాశ్చాత్యులలో కొందరు పక్షపాతులు లేక పోలేదు. "బి. ఆర్. హారింగ్టన్" అను సివిల్ ఇంజనీయరు తన వాస్తుగ్రంథమునకు తొలిపలుకు వ్రాయుచు "భారతవర్షమునకు వచ్చిపోవుచున్న వేలకొలది ఆంగ్లేయులలో నే నొకరిద్దరైన భారతీయ వాస్తుశిల్పకలా విశిష్టతను, భారతీయుల సౌందర్యోపాసనను గ్రహించినవారు కలరో లేరో చెప్పజాలను."3 అని సత్యమును చాటినాడు. ప్రొఫెసర్ ఫ్లెచర్ "ప్రాచ్యకళ మా దృక్పథమును విశాల మొనర్చుచున్నది. కాని అందలి సూక్ష్మతర, నవీనశైలులు మాకు అంతు చిక్కుటలేదు. భారతేతరములైన ఏ కళలలోను ఇంతటి కళాకౌశల్యము మేము కాంచలేదు" అని వ్రాసినాడు.4

అగాధమైన భారతీయ వాస్తుశాస్త్ర మహాసాగరమున ప్రవేశించి అనర్ఘ మణుల వెలికితీయుటకు విశేష కృషి జరుగవలసియున్నది. అనంతాంధకార కాల గర్భమున దాగియున్న ప్రాచీన వాస్తు విజ్ఞానమును దర్శించుటకు జ్ఞానజ్యోతులవలె అపారమైన వైదిక సాహిత్యము, పురాణాగమ శిల్పశాస్త్రములు ఇంకను మిగిలియున్నవి. నేటికిని నష్టావశిష్టములైయున్న ప్రాచీననిర్మాణములు మన కళావిశిష్టత వెలుగెత్తి చాటుచున్నవి.

పాశ్చాత్యులును, వారి అడుగుజాడలలోని దేశీయ పండితులును నేటికిని సృష్టి ప్రారంభకాలము 6000 ఏండ్లకంటె చాల ప్రాచీనమని అంగీకరించు స్థితిలో లేరు. వారు సూచించు ఈ కాలము సత్యముగ మన కలియుగారంభముతప్ప అన్యముకాదు. అజ్ఞానచ్ఛన్నులైన వారి కన్నుల తెరపించుటకై మన శాస్త్ర పరిశోధనకు బూనుట అవశ్యకర్తవ్యము.

భారతీయ వాస్తువిజ్ఞానము ఉత్కృష్టమైనది; ఉదాత్తమైనది. మన ఆధ్యాత్మిక వికాసమున కనుగుణముగా ఆయా ప్రయోజనములతో కూడిన ఆరాధనలు, ఉపాసనలు, వానికి తగిన దేవతలు, దేవాగారములు వెలసినవి. ప్రపంచ వాఙ్మయమున ప్రాచీనతమమగు వేదోపనిషత్తులలో దేవమూర్తులు, దేవాగారములు, పూజలు ప్రస్తావించబడినవి.

వేదకాలమునాడు జనులు గుహలలో గాక సుందరహర్మ్యములలో వసించుచుండిరని అథర్వవేదము చెప్పుచున్నది. వేదములలో రాజులకు ప్రాసాదములను, రాజోద్యోగులకు "శాలా, హర్మ్యము"లను ఉండినట్లు కానవచ్చుచున్నది. తైత్తిరీయ బ్రాహ్మణమున నొక బ్రాహ్మణ గృహవర్ణన కలదు. అప్పటి బ్రాహ్మణగృహమునకు నడుమ అగ్నిశాల, దాని కిరు ప్రక్కల "హవిర్ధాన—పత్నీసదనము"లను, లోన ననేకములైన గదులును, ముందుభాగమున వరండా ఉండెనట.5 శతపథ బ్రాహ్మణమున శ్మశానవాటికలు, వానిలోని శవదహనముచేయు వేదికలు, అచటి శిలాఫలకములపై గీయబడిన చిత్తరువులు, చెక్కబడిన విగ్రహములు వర్ణింపబడినవి.6

ఋగ్వేదమున వేయి స్తంభములు వేయిద్వారములుగల ఒక రాజు ప్రస్తావించబడినాడు7 మిత్రావరుణులు 100 స్తంభములు, 100 ద్వారములుగల భవనముల నాక్రమించుకొనియుండిరి.8 ఒక అయఃపురము కూడ ఋగ్వేదమున కానవచ్చుచున్నది. తైత్తిరీయ సంహితలో వివిధాకృతులలోనుండు చితులు వర్ణింపబడినవి. బోధాయనాపస్తంబులు చితుల ఆకృతులను వివరముగ తెలిపినారు. 5 ఇటుకల వరుసలతో మోకాలి ఎత్తు వేదికలను, 15 వరుసల ఎత్తు వేదికలనుగూర్చి తెలుపబడినది. ఈ చితుల 10 విధములు కలవు. 'చతురశ్రశ్యేనచిత్, కంకచిత్, అలజచిత్, ప్రౌగచిత్, ఉభయతఃప్రౌగచిత్, రథచక్రచిత్, ద్రోణచిత్, పరిచాయ్యచిత్, సమూహ్యచిత్, కూర్మచిత్' అనునవి. ప్రతివరుసలో 200 ఇటుక లుండును. ఒక్కొక్క ఇటుకకు ప్రత్యేకనామము కలదు.

వేదవాఙ్మయము తరువాతిది నేడు సింధులోయ నాగరిక అని వ్యవహరింపబడుచున్న "మొహంజోదారో—హరప్పా" త్రవ్వకాలలో బయల్పడిన ప్రాచీన నగరశిథిలములు, దేవప్రతిమలు. ఇవి భారతీయ వాస్తుశాస్త్రోత్కృష్టతకు ప్రబల నిదర్శనములై ఉన్నవి. భారతీయౌన్నత్యమును సహింపలేని మాత్సర్యపూర్ణులగు పాశ్చాత్య చరిత్రకారులు ఈ శిథిల నగరములను ప్రాగ్వైదిక, అనార్యసభ్యతలో చేర్చి వితండవాదము చేయుచున్నారు. శ్రీ వినోద విహారి రాయ్ వేదరత్న అను వంగదేశీయ విద్వాంసుడు "హరప్పా" ఋగ్వేదమున ప్రస్తావించబడిన "హరియూపీయ" అను ఆర్యనగరమని అచటి అవశేషములను వేద మంత్రములతో సమన్వయించి నిరూపించినారు.9

---

3. Ancient Indian Architecture

4. The History of Comparative Architecture.

5. తై. బ్రా I 2-3-1. 6. శ. బ్రా XIII 8-1, 2. 7. ఋ. వే II 313. 8. ఋ. వే 8-2-2.

9. ఇండియన్ అంటిక్వెరి 1925 జనవరి సంచిక.

ప్రాచీన కావ్యేతిహాసములలో భారతదేశ మహానగరములు, విజయతోరణములు, మహాప్రాసాదములు, ఉద్యానములు, ప్రాకారములు, పరిఘలు వైభవోపేతముగా వర్ణింపబడినవి. రామాయణమునందలి బాలకాండమున అయోధ్యానగర వర్ణనము, సుందరకాండమున లంకానగర వర్ణనము మనోహరముగనుండి గమనింపదగియున్నవి.

మహాభారతమునందలి ద్వారక, ఇంద్రప్రస్థ వర్ణనలును, మయసభా విశేషములును ఆశ్చర్యమును గొలుపుచున్నవి.

తరువాతి కౌటిలీయార్థశాస్త్ర, రాజతరంగిణీ, హర్షచరిత్రాది గ్రంథములలో గూడ వాస్తువిషయ వర్ణనలు కానవచ్చుచున్నవి. కావ్యములకంటె పురాణ వాఙ్మయమున వాస్తువిశేషములు చాల వివరింపబడినవి.

అష్టాదశ పురాణములలో తొమ్మిది పురాణములు వాస్తులక్షణములను శాస్త్రీయముగ దెలిపి తరువాత వచ్చిన శిల్పశాస్త్రములకు తగిన సామగ్రి నందించినవి. మత్స్యపురాణమున 252, 255, 257, 258, 262, 263, 269, 270 అధ్యాయములలోను, గరుడ పురాణమునందలి 45, 46, 47, 48 అధ్యాయములలోను, స్కాందపురాణమునందలి మాహేశ్వరఖండలో 24 వ అధ్యాయము, వైష్ణవఖండలో 25 వ అధ్యాయములోను, నారద పురాణమున 13 వ అధ్యాయమునను, బ్రహ్మాండపురాణమున 7 వ అధ్యాయమునను, భవిష్యపురాణమున 12, 130, 131, 132 అధ్యాయములలోను, లింగపురాణమున 48వ అధ్యాయములో, వాయుపురాణమున 39 వ అధ్యాయములో, అగ్నిపురాణమున 42–43–44–45–46–49–50–51–52–53–54–55–60–62–104–105 అధ్యాయములలోను వాస్తువిషయములు వివరింపబడినవి.

సుప్రసిద్ధ ఖగోళశాస్త్రాచార్యుడు వరాహమిహిరుడు విశ్వకోశమనదగిన "బృహత్సంహిత"లో 53 (వాస్తు విద్య), 56 (ప్రాసాదలక్షణం), 57 (వజ్రలేప లక్షణం), 58 (ప్రతిమా లక్షణము) అధ్యాయములను వివరించినాడు.

వేదకావ్యేతిహాసములలో వర్ణింపబడిన 'నగర గృహదేవాయతనము'ల నిర్మాణ పద్ధతులు స్పష్టముగ తెలియక పోయినను ఆగమ, వాస్తుశాస్త్రములవలన మనకీ వాస్తువిజ్ఞానము సలక్షణముగ, సమగ్రముగ తెలియుచున్నది.

## 3

పురాణములు ప్రాస్తావికముగ మాత్రమే శిల్పశాస్త్రమును తెలిపినవి. శిల్పశాస్త్రమునకు ఆగమములు ఆధారములు. ఇందు శాస్త్రీయ చర్చకలదు. ఆగమములలో ప్రధానలక్షణములైన భూపరీక్షా, స్థలపరీక్షా, మాన, దిక్సాధన, స్థలపథక, హర్మ్య, ప్రాసాద నిర్మాణపద్ధతు లన్నియు సప్రమాణముగ నిరూపింపబడినవి.

ఆగమములు వేదతుల్యములు. ఇవి యోగసంబంధముగ శివోపాసన నుద్దేశింపబడినవి. శక్తి, శివపూజా సంబంధవాఙ్మయమును దాక్షిణాత్యులు ఆగమములనెదరు. పురాణములకంటె ఇవి విస్తృతరూపమున నున్నవి. ఇట్టి ఆగమములు 28 అంగీకరింపబడెనవి.10 ఇవి వేదములంత ప్రాచీనములు గాకపోయినను తక్కిన వానికంటె ప్రాచీనములనియే చెప్పవచ్చును. వీనిలో ప్రత్యేకముగ గ్రామ, నగర, దేవాయతనాది నిర్మాణములకు అవసరములైన వాస్తులక్షణము లన్నియు విశేషముగ వివరింపబడినవి. వీనిలో కామికాగమమున 58 పటలములు, కారణాగమమున 41 పటలములును, వైఖానసాగమమున 2 పటలములును, సుప్రభేదాగమమున 17 పటలములును, వాస్తుశిల్ప విధులను తెలుపుచున్నవి.

ఇవిగాక ప్రత్యేక వాస్తుశిల్పశాస్త్రములు కలవు. వీనిలో చాల భాగము వ్రాతప్రతులలోనున్నవి. ఈ శాస్త్రముల నెరిగిన పండితు లత్యల్పసంఖ్యలో నున్నారు. అనేక గ్రంథములు విదేశీయ గ్రంథాలయములలో భద్రపరచబడియున్నవి. భారతీయ వాస్తుశాస్త్ర మహోదధిని మథించిన దేశీయ విద్వాంసులును లేకపోలేదు. వారిలో ప్రథముడు రామరాజు. ఇతడు వందసంవత్సరముల క్రిందట 'రాయల్ ఏషియాటిక్ సొసైటీ' సభ్యుడు. 'రిచర్డు క్లర్కు' అను ఆంగ్లేయుని ప్రోత్సాహముచే భారతీయ వాస్తుశాస్త్ర విషయములు పాశ్చాత్యులు తెలిసికొనుటకు వీలుగా ఇంగ్లీషులో నొక వ్యాసమును వ్రాసి ప్రకటించెను11. దానియందు రామరాజు మానసార, మయమత, కాశ్యప వైఖానస, సకలాధికార, విశ్వకర్మీయ, సనత్కుమార, సారస్వతీయ, పాంచరాత్రములను వాస్తుశాస్త్రగ్రంథములను పేర్కొని వానిలోని విషయములను సంగ్రహముగ తెలిపెను. శ్రీ అనంతాళ్వార్ తన గ్రంథమున పై శాస్త్రములనేగాక శైవసంహిత, విశ్వామిత్ర సంహిత, ఆయాదిలక్షణ, మనుష్యాలయ విధి, వాస్తువిధాన, మత్స్యంగాశిక, సనత్కుమార సంహితలను స్మరించి

---

10. ఆగమములు : కామికాగమ, సుప్రభేదాగమ, యోగజాగమ, చింత్యాగమ, కారణాగమ, అజితాగమ, దీప్తాగమ, సూక్ష్మాగమ, సహస్రాగమ, అంశుమానాగమ, విజయాగమ, నిశ్వాసాగమ, స్వాయంభువాగమ, అనిలాగమ, వీరాగమ, రౌరవాగమ, ముకుటాగమ, విమలాగమ, చంద్రజ్ఞానాగమ, బింబాగమ, ప్రోద్గీతాగమ, లలితాగమ, సిద్ధాగమ (వైఖానసాగమ), సంతానాగమ, సర్వోక్తాగమ, పరమేశ్వరాగమ, వాతులాగమములు.

11. Hindu Architecture.

వాడు.[12] శ్రీ యస్. శ్రీకంఠశాస్త్రిగారు 'వాస్తువిద్యా, శిల్పరత్న, అభిలషితార్థ చింతామణి, సమరాంగణ సూత్రధార, వాస్తురత్నావళీ, ప్రతిమాలక్షణ, ప్రతిమా మాన లక్షణ, రూపమండన, వాస్తుమండన గ్రంథములను పేర్కొన్నారు[13]. శ్రీ పి. కె. ఆచార్య విశేషశ్రమచేసి ప్రపంచదేశములలోని గ్రంథాలయముల గ్రంథపట్టికల నాధారము చేసికొని తమ విశ్వకోశములో 150 వాస్తుశాస్త్రగ్రంథముల పేర్లను, వానిలో కొన్నిటి విషయసూచికలతో ప్రకటించినారు[14]. ఆంధ్రదేశమున తెలుగు పద్యములలో వ్రాయబడిన 'కృష్ణవాస్తువు' వాడుకలోనున్నది.

ఈ ప్రసిద్ధాప్రసిద్ధ వాస్తుగ్రంథము లన్నిటిలో "మానసారము" సమగ్ర లక్షణములను తెలుపుచు దేవాలయ గ్రామ నిర్మాణాదికమును వివరించు ఉత్తమశిల్ప శాస్త్రము. ఇందు 70 అధ్యాయము లున్నవి. దీనిని దాక్షిణాత్యులు పరమప్రమాణగ్రంథముగ పరిగణింతురు. ఇది నిగమాగమములకంటె ప్రాచీనము కాకపోవచ్చును. పాశ్చాత్యులు మానసారమును రచించిన మానసారఋషి క్రీ.పూ. 3 శతాబ్దమునకుముందు ఉండినవాడని అంగీకరించినారు. ఈ శిల్పశాస్త్రము నాధారము చేసికొని వాస్తువిశేషములను సంగ్రహముగ తెలిపెదను.

'చిత్రసారము'నందలి "శిల్పతంత్ర ప్రకరణము"లో నీ శిల్పశాస్త్రము ద్వాదశలక్ష గ్రంథాత్మకమని తెలుపబడినది[15]. ఈ 12 లక్షల గ్రంథములను పలువురు మహర్షులు విరచించిరి.

## 4

భారతీయశిల్పి సకలశాస్త్రవేత్త; విద్యాపరిపచ్ఛిక్షితుడు. మతతత్త్వశాస్త్రము లతనికి కరతలామలకములు. యోగవిద్యారహస్యముల నతడనుష్ఠానముచే సాధించిన మహానుభావుడు. ఎందరో శిల్పులు దేవాయతన నిర్మాణమునకై తమ జీవితముల నంకితము చేసినారు. వారు సంప్రదాయాభిజ్ఞు లగుటవలన దేవాలయములలో నాయా మూర్తులను విధివిహితముగ ప్రతిష్ఠించినారు. వారిని ప్రోత్సహించు రాజులు, శ్రీమంతులు కూడ మతధర్మ విశ్వాసముల కలవారై అయియుండిరి.

ఇంతమహిమంతుగ అన్ని దేవాలయముల నే మహాశిల్పులు కట్టిరో తెలియుటలేదు. హొయసల దేవాలయములలో మాత్రము శిల్పులపేర్లు కానవచ్చుచున్నవి. ఉండవల్లి, బాదామి, అలంపురము మొదలైన శిల్పకళాక్షేత్రములలోని ఆలయములను కట్టిన శిల్పులు మారుపేర్లతో వ్యవహరింపబడినారు. తక్కిన బౌద్ధ, జైన, బ్రాహ్మణ మతములకు సంబంధించిన ఆలయములు శిల్పకళాదృష్టిలో నుత్కృష్టములయ్యును తన్నిర్మాత లెవరో నేటికిని అజ్ఞాతముగ నుండుటకు శిల్పుల నిర్లిప్తతయే కారణము కావచ్చును. శ్రీ ప్రసన్నకుమార ఆచార్య తమ "వాస్తుపరిభాషాకోశము" నందు ఇంతవరకు ప్రకటితములైన శిలాశాసనములను శోధించి యేబదిమంది శిల్పుల పేర్లను, వారి వివరములను తెలిపినారు[16]. భారతీయ శిల్పుల ధ్యేయము భగవంతునకు, ప్రభువునకు, ప్రజలకు సేవచేయుటయే గాని స్వార్థము కాదు.

భారతీయ శిల్పులలో నాలుగు తెగలు కలవు. ఈ నాలుగు తెగలవారును బ్రహ్మసంతతియని శాస్త్రములు చెప్పుచున్నవి. మహాభారతమున పేర్కొనబడిన దేవశిల్పి విశ్వకర్మ ఈ తెగలకు మూలపురుషుడని చెప్పెదరు. అతడు విశ్వనిర్మాత. "మానసారము" శిల్పుల తెగలను, వారి యోగ్యతలనుగూర్చి ఈ విధముగ తెలుపుచున్నది: పరబ్రహ్మకు పద్మసంభవుడు పుట్టెను. ఆ సృష్టికర్తకు నాలుగుముఖములనుండి విశ్వకర్మ, మయుడు, త్వష్ట, మనువు లుద్భవించిరి. వారికే విశ్వకర్మ, విశ్వభూ, విశ్వస్త, విశ్వస్రష్టలను పేర్లును కలవు. విశ్వకర్మ (పూర్వ ముఖోద్భవుడు) ఇంద్రపుత్రికయగు బ్రహ్మపత్నిని పెండ్లాడెను. మయుడు (దక్షిణ ముఖోద్భవుడు) రాజపుత్రి క్షత్రియపత్నిని పెండ్లాడెను. త్వష్ట (పశ్చిమ ముఖోద్భవుడు) కుబేరపుత్రి వైశ్యపత్నిని పెండ్లాడెను, మనువు (ఉత్తర ముఖోద్భవుడు) నలపుత్రి శూద్రపత్నిని వివాహమయ్యెను. ఈ నలుగురు దంపతులకును వరుసగా స్థపతి, సూత్రగ్రాహి, వర్ధకి, తక్షకులను పుత్రులు కలిగిరి. వీరిలో స్థపతి సకలశాస్త్రపారంగతుడైన ప్రధాన పర్యవేక్షకుడు (Chief Architect), వేదవిదుడు; నిర్మాణపథకముల నిర్ణయించువాడు. సూత్రగ్రాహికూడ వేదశాస్త్రజ్ఞుడు; మానకౌశల్యము, వాస్తుచరిత్రజ్ఞానము కలవాడు; పథక నిర్మాణదక్షుడు (Draftsman). వర్ధకి నిర్మాణవస్తువుల శక్తి నెఱిగినవాడు; చిత్రకరాభిజ్ఞుడు. తక్షకుడు చెక్కడంపనులలో నిపుణుడు. రాయి, కఱ్ఱ, లోహము, రాగి, ఇత్తడి, వెండి, బంగారముల పనిచేయుటలో నేర్పరి. ఈ నాలుగు తెగల శిల్పులచేతనే, భారతీయ వాస్తువిద్యా ప్రచారము, గృహ, దేవాయతన, దుర్గ, నగర, వాపీ కూప తటాకాదుల నిర్మాణము కొనసాగింపబడినది.

---

12. Indian Architecture-Vol I.

13. భారతీయ సంస్కృతి.

14. An Encyclopaedia of Hindu Architecture.

15. "శిల్పతంత్రాది సంఖ్యాయుత లక్ష ద్వాదశకోమతా"—చిత్రసారము.

16. An Encyclopaedia of Hindu Architecture.

# విచిత్రమేళనము

శ్రీ సి. నారాయణరెడ్డి

చేదులోన స్వాదుతా విచిత్ర రుచి ప్రేరణమ్ము
అవ్యక్తములోన వ్యక్తతా వ్యథా ప్రతారణమ్ము
అశ్రుసిక్త పక్ష్మమ్ముల నగ్నిశిఖా ఖేలనమ్ము
ఏమిటీ అపూర్వానుభవామృత విష మేళనమ్ము.

నొసట వ్రేలు ముంగురులం దుసికొల్పెడి ఉన్మాదము
నుసిరాల్చెడు దివ్వెలలో మసిలిపోవు ఉన్మోదము
ప్రసవదళమ్ముల కన్నుల పగటికలల కీలనమ్ము
ఏమిటీ అపూర్వానుభవామృతవిష మేళనమ్ము.

మంచు పొగలలో రేగిన మించుకాగడా మిన్కులు
మధురయామినుల మూగిన విధుర జీవితపు కిన్కులు
గాలితరగలందు గడ్డకట్టిన మధుపాలనమ్ము
ఏమిటీ అపూర్వానుభవామృత విష మేళనమ్ము.

నిట్టూర్పుల తీగెల స్పందించెడు మోహనరాగము
నీడల పెదవులపై పారాడెడు కాంతిపరాగము
నీలో నా లోపలి సంధ్యాలయ సంచాలనమ్ము
ఏమిటీ అపూర్వానుభవామృత విష మేళనమ్ము.

# రాళ్లపల్లివారి వచనరచన

## శ్రీ సాళ్వ కృష్ణమూర్తి

ప్రశాంత చిత్తముతో వ్రాసిన వ్రాత ఏదైనను వెన్నెల తునుపుతో తియతీపుగా నుండును. తెలుగున ఒడుపుతో తేటగా వ్రాయనేర్చిన కొద్దిమంది సిద్ధహస్తులలో శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారొకరు. ఆయన రచనలు చదివి ఆహ్లాదపడనివారుండరు. తేటతనముతో నాహ్లాదపఱచి ఒడుపుతో వన్నెగావు గొల్పుట ఆయన నేర్చిన, కాదు ఆయన కల్పించిన విద్య.

శర్మగారిది మంచిపోక కుందిలమైన మాట సగిలి; వార్తికమైన వాక్యరచన. అది ఆత్మానుభూతి నిరాఘాట మార్మికతల క్రీడాఫలము. ఆయన విశిష్ట రచనలో ప్రకాశించును ఆత్మానుభూతి సహజముగ తిక్కన యున్నిపదార్థములవలె వేరుపరచి చూపరానిది— కాని దాని యునికి మాత్రము మనకు గోచరించుచుండును. దొరకని ఆ దానిని పట్టుకొన ప్రయత్నించుటకు మారుగా ఆయన రచనకు మూలమైన క్రమసంగతిని ఇట్లూహించును: ఆత్మగానతి, దానికైన చిత్తశుద్ధి, చిత్తశుద్ధితో నిధిగా చేరినచ్చిన స్వాతంత్ర్యము, స్వాతంత్ర్యమువలని సమ్యక్‌దృష్టి, సమ్యక్‌దృష్టి కారణముగా విస్పష్టవర్ణము, విస్పష్టిలోని లీలాలోలత. లీలాలోలత కంగములైన సౌందర్య మాధుర్యములు. ఆయన రచనలో ఈ యుదారగుణములన్నియు అంతటా వ్యాపించియుండుటయే దాని యసదృశమైన గుణము.

ఎదుటివానిని తన తలపుదాకా తెప్పుటయే రచనకు ప్రయోజనము. దానికి పాఠకుని మన్నించుట, విశ్వాసము చూరగొనుట ముఖ్యము. శర్మగారి రచనలో తమకు తెలిసినది పాఠకునికి తెలియుదను దృష్టి గాని, తెలిసినదానినంతయు వాని తలపై రుద్దవలెనను తొందర గాని కాన్పింపవు. తేలికగా సాత్త్వికమైన ఆలోచన గనుక రచనలో తీపు నేటగా పరలును. దాని కాయన వినయధనము వన్నె వేయును. నిజముగా ఎంతయున్నను పాండిత్యభారమున క్రుంగినవారని, ఉన్న దానిని బరువునకు గాక తెరకలలో నీకలవలె ఎగురుటకు మాత్రముపయోగించుకొనగల, వారిలో శర్మగారొకరు.

తరువాత, ఆయన రచనకు ప్రాణము గూర్చునది ఆయన మనసుకు సంబంధించిన నాగరకత (Urbanity), దాని వెంటనంటి కాన్పించెడి నిక్కుచూడని నిరాడంబరత (Simplicity).

'సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్
న బ్రూయాత్ సత్యమప్రియమ్,
నాఽనృతంచ ప్రియం బ్రూయా-
దేష ధర్మస్సనాతనః.'

ఈ ధర్మము పాటించిన శర్మగారి రీతులను నొప్పింపని నొప్పింపరాదను మనసు తీరు—గాద తీవ్రతలో గూడ దీనికి తప్పనివారు కారాయన. అనృతమును ప్రియమని చెప్పనే చెప్పనివారికదా అప్రియమైన సత్యమును ప్రియముగానే చెప్ప ప్రయత్నింతురు. ఇట్టి విషయములం దాయన జాగ్రత్త యెట్టిదో ఈ వాక్యమును పరిశీలించిన తెలియును. 'మతీయము బసవేశ్వరుడు పోషించిన పండ్రెండు వేల జంగాల కథల వంటివి చూచినచో కామపురుషార్థ విషయమున, కేవలసహవాసవిషయమున, ఇతరుల దృష్టికన్న కొంత భిన్నముగా ఉదారముగా నుండునని మనకు తోచక తప్పదు.' ఇది పొగడికయు తెగడికయు రెండును గాని యాథార్థ్యవాదము.

ఎంత ప్రశాంత చిత్తముతో వ్రాసినను శర్మగారు భావలోలుపులే. సహజముగ వచ్చిన సత్త్వగుణము, సాధించిన ప్రశాంతత ఆయనలో నున్నవి గనుకనే ఆయన రచనలకు విలువ—వలసినప్పుడు రచనలోగూడ భావమునకు లొంగిపద్దుటచే ఆయనకును మనకును ఒక ఆప్తత ఏర్పడును. 'ఆ స్వసామ్రాజ్యము'ను స్మరించుచు రాయల వైభవమును వ్యాసమున శర్మగారు వ్రాసిన ఈ వాక్యము లెట్లు రేపటెంపవలె కరకరలాడుచున్నవో చూడుడు:

'వానిలో మన మేపని యెంతమాత్ర మిప్పుడు చేయగలిగియున్నామనుమాట పోనిండు. అతడు చేసి పెట్టి చేతికిచ్చినవానిలో నే యేవి యెంతెంత మాత్రము మిగిలించుకొనియున్నాము? ఆ సింహాసనము తిప్పయైనది. ఆ దానశాసనములు విరిగిన బండలతో చిలిమిన రేకులతో సర్కారువారి మ్యూజియములలోనో చరిత్రకారుల యింటి మూలలలోనో పడియున్నవి. ఆ గ్రంథములలో ముక్కాలుమువ్వీసము పురుగులు తినిపోయినవి. ఆ విద్యలు కథలైనవి. ఆ సామ్రాజ్యము చట్టుబండలైనది. ఆ లక్ష్మి యెత్తువారి చేతిబిడ్డయై

ఈ తమరచన తలపులోని భాగ మెక్కడికాగిన తావక్కడి కానుచు, చదివెడువానికి సుఖముగ నుండు నట్లు, శ్వాస కవకాశమిచ్చుచు గ్రుక్క త్రిప్పుకొన వీలుండునట్లుగా నుండవలెను. శర్మగారి రచనలో ఈ శ్వాసగతి ననుసరించెడి వాక్యవిన్యాసము గమనింప దగినది. లయనుగురించి ముందు మనవి చేయుదును.

పోల్చి చెప్పదలచినప్పుడు శర్మగారి వచనము తిక్కన రచనవంటిది. ఇరువురిలోను కొన్ని సమాన ధర్మములున్నవి—వాక్యముల సూటిదనము, పదముల కంటె తలపు నొత్తిచెప్పుపద్ధతి, ఇమిడిక. తలపు ప్రధానమైనప్పుడు మాటల తేటగా నుండజేయుట రచన లోని యొక మర్మము. అట్లే నొక్కి చెప్పదలచిన భాగమున దానికి కలుగునట్లు అక్షరావృత్తి చూపించుటయో లేక స్ఫుటముగా కఠినమైనను యతి వేయుటయో తిక్కన వ్రాత వాడుక. శర్మగారి వాక్యముల బరిశీలించుటకు ముందుగా చేతికివచ్చిన కవి బ్రహ్మ వాక్య మించుక చిత్తగింపుడు.

"అనిన విని రథికవరు లందఱు 'సహదేవుండింత యొప్పవాడు నే సాత్యకి పలుకు లిట్లుండునే! తక్కటివి యొక్క పెద్ద మాటలు? పగవారి నడిగికొనం బోవుట యుచితంబె? కయ్యంబు కర్జంబుగానిదె? భంగంబు నీగికొనం దగదె?' అనునివి మొదలుగా ననేకు లనేక ప్రకారంబుల వీరాలాపంబులం గొలువెల్ల నొక్క మ్రోతగా చెలంగిన రోలుంగులు నింగి ముట్టె."

(ఉద్యో. 3. ఆశ్వా.)

ఈ వాక్యమునందు మొదట సామాన్యమగు అక్షరావృత్తి. రెండవచోట రెండు చిన్న వాక్యములుగ విరిచి వ్రాయుట సహదేవసాత్యకులకు తుల్యత నేర్పరచుటకు. మూడవచోట ఉద్రేకము. నాల్గవ చోట ప్రతిపదము నూది చెప్పుటచే పదాదిలో కకారావృత్తి. చివరి వాక్యమున శ్రుతిసుభగత్వమునకై 'మొదలుగా' 'మ్రోతగా' అనుచోట్ల యతి వేయబడినది. ఇందలి తత్తత్ స్థానములందలి న, ల, ర, ల ద్విరావృత్తి, 'చెలంగిన ఎలుంగులు నింగి ముట్టె'నను చోట్ల బిందుపూర్వక గకారావృత్తి పాఠకుని కప్పటి కలకలమును దాని కఱకుదనమును మనసుకు తట్టించు ననుటలో సందేహ మేమి?

శర్మగారి రచనలో ఇట్టి అక్షరావృత్తి వాక్యమును పట్టాలమీద రైలుబండి నడచినంత సుఖముగా నడిపించును. సామాన్యముగ వ్రాసిన ఈ వాక్యమున గల అక్షరావృత్తిని గమనింపుడు: 'కారణ మేమనగా వారాకలికి భుజించువారేకాని మోమోటమునకుగాని పద్ధతి ప్రకారముగాని ఇష్టము లేకున్నను భుజించు వారు కారు.'

పాఠకుని మనసు ప్రత్యేకముగ తలపుపై నిలువ వలెనన్నచో అక్షరావృత్తిలో వైవిధ్యముండితీర వలెను. ఆ యక్షరావృత్తియును వాక్యమునందలి ఏ చలితాంశకో చలితాంశలోనే పరిమితముగ నుండవలెను. ఈ వాక్యమును చిత్తగింపుడు.

'విష్ణుచిత్తు డెంత విరక్తసంసారియై 'అబుద్ధేశ్చ ధనుఃపత్రు'డైనను, వానకాలమున భార్య వంట చేసిన పాక దగిలి యామె కన్నులు నొచ్చు నేయని ముందుగానే బెండకాయ బొండ్లముల పెంచించి సిద్ధముగా జేసి పెట్టుకొనవలసెను." ఇందలి మొదటి చలితాంశలో సగము వ్యాసకర్తది. తక్కిన సగము కృష్ణరాయలది. తన సగములో 'వి' ద్విరావృత్తమైనది. ప్రధాన వాక్యమున రెండుచోట్ల యతి వేసినారు. తొలి చలితాంశలోని రెండవసగమునగల మాటలు రాయలవి గనుక రాయలదే అయిన ప్రధానవాక్యార్థమునకు చెందిన 'కన్నులు'లోని 'ను' వర్ణముతో 'ఇత్థం ధనుః పత్రు' ననుచోటి 'ను' వర్ణమునకు ఆవృత్తి చూపినారు.

ఇట్లు, అక్షరావృత్తియో యతియో అన్నిచోటుల నిర్వహించినను అది బయటికి పొక్కక అణగియుండుటయే రచనలోని గొప్పదనము. తిక్కన పదమధ్యాక్షరములతో యతిని నిర్వహించినట్లుగ శర్మగారును పదమధ్యాక్షరములతోనే రెండుచోటుల గాకున్న ఒకచోటనైనను ఆవృత్తియో, యతియో చూపినారు. ఈ చిన్నవాక్యమును చూడుడు:

'వరూధిని యెన్నిమాఱులు జ్ఞప్తికి దెచ్చుకొన్నను తాను దేవత యను విషయము మఱచి పదేపదే మనవలె చెమర్చును.'

'వరూధిని'యన్న పదములోని వకారమునకు 'దేవత'యన్న పదమధ్య వకారముతో యతి. 'తెచ్చుకొన్నను' అను దాని యాద్యక్షరమునకు 'పదేపదే' లోని రెండవ నాల్గవ యక్షరములతో యతి. 'మాఱులు' 'మఱచి' 'మనవలె' అనుచోట్ల పదాద్యక్షరముల కావృత్తి కనుపట్టి వాక్యార్థము స్ఫుటప్రతీతికి సహకరించును.

తలపు నొక్కి చెప్పినచోట శర్మగారి వాక్యములు తిక్కన ననుసరించి పదాద్యక్షర మైత్రి నే పాటించును; చూడుడు:

'రాజులుకూడ ఇట్టి భావములకు కొంతలోపడి యుండినను ఇంతకన్న నుదారమైన ధర్మదృష్టి యతని నొక ప్రక్కలో బలముగా నొత్తిడి చేయుచుండుటచే తామసవృత్తికి లోగక తప్పించుకొని ధన్యుడై నాడు.'

---

ఈ వాక్యమున 'కూడ' 'కొంత' అను మాటలు తలపునకు నొక్కులు దీర్పగా, 'భావములకు', 'లోపడి' అనుచోట్లగల యతి ఆ చోటికి మాత్రమే పరిమితమై నిలువగా, 'ఉదారమైన ధర్మదృష్టి' 'ఒక ప్రక్కలో' 'ఒత్తిడిచేయుగా' అనువాని పదాద్యక్షర మైత్రి ఇంచుక దూరదూరముననుండి ప్రధాన కారణమును పైకి దెచ్చి చూపింపగా, 'తామసవృత్తికి లోగక తప్పించుకొని ధన్యుడైనాడు' అను ప్రధాన వాక్యభాగము అవ్యవహితమైన పదాద్యక్షర మైత్రిచే అర్థమును ముద్రవైచినట్లుగ చెప్పుటకు సహకరించుచున్నది.

సాధారణముగ వచనమున—అందునను ఉపన్యాసములకుగా వ్రాసినదానిలో-వక్రోక్తియే ప్రయోజనసిద్ధి కుపయోగించునది. కేవలము దర్శనకే అంది వచ్చెడి ధ్వని వచనమున నుండుట గొప్పగుణమే కాని అంతట మన అక్కర తీర్చునట్టిది గాదేమో! శర్మగారి రచనలో సద్యస్స్ఫూర్తిగల వక్రోక్తి పలుతావుల కాన్పించును. మచ్చునకు: 'ఒక వేళ నాశపడినను మన మేమి ఒడలిపై పూసికొనగలమా? మన దేహములు మన అధీనములా? దర్జీవాని కమ్ముకొన్నవి! వాడు మన కష్టనిర్బంధనము చేసి మనస్వేదపరిమళమును మన దేహముమీదనే ధ్రువముగ రక్షించి పెట్టుచున్నాడు.' ఇందలి తొలివాక్యములలోని కాకాక్షిప్తమైన వక్రోక్తిని గమనింపుడు.

తిక్కన రచనవలెనె శర్మగారి రచనయు ఒక్కొకచోట ఎక్కుడులేని ఇమిడిక చూపును. 'అల్పాక్షరముల ననల్పార్థ రచన' చేయుమని చెప్పిన వారెంతమాత్రము చేసిరో చెప్పుట కష్టమేగాని నాటి తిక్కనయును నేటి శర్మగారును చేసినారని చెప్పవచ్చును. ఈ వాక్యము చూడుడు: 'ఉండునది ఉండవచ్చునట్టిది ఉండవలయునట్టిదియు నగు వస్తువును బ్రదర్శించుటలోడనే కళలన్నియు మొదలు పెట్టును.' ఇందలి మొదటి మూడుపదములకు కళలపరముగ మూడు పేజీల వ్యాఖ్యానము వ్రాయవచ్చునుగదా!

అంతేకాదు ఆ యిమిడిక కొన్నిపాళ్లు మనకు పరిచితముగాని వాక్యవిన్యాసమును కల్పించి చమత్కారము చూపించును.

"అట్లైన మన కింత తలనొప్పి లేకుండ 'విశ్వకర్మ వంశ్య వినర వేమ' యనియే వేమన వ్రాయవచ్చుగానుండెనుగదా!"

---

వాక్యరచనలోని విశేషములకు వచ్చినచో నింక, మనము సాధారణముగా వాడెడు చేదర్థక సముచ్చయార్థకములు లేకయే పని గడుపుకొని పోగలరు '...నావంటి వానికి వేమన జీవితమును తెలిసికొనవలెనన్న పుడు కలుగు కష్టము చెప్పితీరదు.'

మనము నిరంతర మర్థములేని పదముల క్రింద జమకట్టి వాడు మాటలను అదికినట్లుగ వాడుట శర్మగారి అలవాటు. 'అక్కడికిని వారు కోపము నవలనిరియుచల నిరువురికిని (ఆలుమగలకు) విరుగనె గావలసినదే.'

మరి 'శబ్దశాస్త్ర నియమాలను ఎదిరించె దొమ్మగా వారు అప్పుడెప్పుడుండెబట్టే ఏ భాషైనా ప్రవాహినిగా నడుస్తుం'దని 'త్యాగయ్య నాదసుధారసము'న వ్రాసిన శర్మగారు ఆ దొమ్మ తామకూడ తగినంతగా చూపినవారే. పుస్తకములలో గ్రుత ప్రకృతికములుగానున్న. అవ్యయము లెన్నియో వ్యవహారమున కళలైనవి. శర్మగారు వ్యవహారమునుబట్టి రచన సాగించినారు. అట్లే సాధారణముగ షష్ఠీ వర్ణమునకు ముందు నకారము వాడకపోవుట, 'లోపను' మొదలగు ప్రయోగములు అటువంటి శిష్టములు. వ్యవహారముగూడ నంతే. కొందరు సరళాదిగవాడు దిద్దు, గడుప మొదలగు శబ్దములను తిద్దు, కడుప ఇత్యాదిగ వాడుట శర్మగారి స్వమాండలికాభిమాన ఫలమనుకొందును.

వ్యవహారము ననుసరించి భాషకు జీవముపోసి గ్రాంథిక వ్యావహారిక భాషలకు భేదములేదని చూపిన శర్మగారి చేయి తిరుగులేనిది. నేను పరిశీలన కాగినంత వరకాయన రచనలోని విశేషముల బ్రదర్శింప బ్రయత్నించితిని. అందలి తెనుగుతన మొక్కటే మాత్రము విస్తృతిచేత నేమి, వైవిధ్యముచేత నేమి సులభముగా వ్యాసములకు లొంగునది కాదు. శక్తిగలవారి చేతిలో తెలుగొక మహత్పదార్థమువంటిది. దానిని ప్రదర్శింప నేర్చిన శర్మగారికి నమస్కరించుటతప్ప చేయగల ప్రయత్నము కాన్పింపదు.

# కన్నె తలపులు

శ్రీమతి ఆర్. నాంచారమ్మ

నిలువు టద్దము ముందు నిలబడి
ఏలనో మరి చూపు త్రిప్పదు
ఏమి చూచెనో తనలో తానే
నవ్య మంజులతన్ !

చంచలమ్ములునైన కన్నులు
నిశ్చలంబులు నయ్యె నయ్యెడ
ఎంత చూచిన తనివి తీరని
అంద మెయ్యదియో !

ఆమె మోమున మెరయు సంగట
ముగ్ధ మోహన హాసరేఖలు
తన్మయం బొనరించు తలపు ల
వెంత తియ్యనివో !

అంతలోననె విన్నబోవును
వాలిపోవును వదనపద్మము
ఎవ్వ రెరుగుదు రామె హృదయపు
వింత వైఖరులన్ ?

గాలి పాటలో క్రొత్తయందము
పూవు తావిలో నవ్యభావము
చంద్రకాంతిలో నూతనత్వము
సృష్టియే క్రొంగ్రొత్తసి.

తళ్కు తళ్కున మెరయు నెడదలో
తా నెరుంగని భావ మేదో
మబ్బుచాటున తారకాళి మ
యూఖముల వోలెఁ !

# విశ్వనాథవారి మేనకా విశ్వామిత్రము

శ్రీ యస్వీ జోగారావు

కవి సమ్రాట్టుల కవితాశిల్ప సుందరనందనారామములో కల్పవృక్షము రామాయణము. ఆ కల్పవృక్షస్కంధశాఖయందు నిలరారు నొక మధుకోశము మేనకా విశ్వామిత్ర ఘట్టము. వారి రామాయణమున వివిధఘట్టములందలి తీరు వేరు, దీనితీరు వేరు. ఇది విశ్వామిత్రుని కథయయినను ఆ పాత్ర శీలము నతిరిక్త శిల్పముగా మలచియున్నను విశ్వనాథవారు దీనిని విశ్వామిత్రుని కథయనుటకంటె మేనక కథ యనుట కెక్కువ మోజు పడుదురు. ఏతత్కథా ప్రధానశ్రోత రాముడు. కథ యంతయు విని లక్ష్మణునితో

"అన్ని యంశమ్ములను జెప్పినట్టి తీరు
వేఱు; మేనక కథ తీరు వేఱు గాద"

అని వ్యాఖ్యానించినాడు. అట్టిది కవి అభినివేశము.

మూలమున పది యనుష్టుప్పులుగా నున్న కథ ముప్పది పద్యములుగా నిందు ప్రస్ఫుటింపబడినది. ఈ ప్రపంచీకరణము ప్రధాన కథా కలితార్థయుక్తికి భంజకమని భావింతురేమో కొందఱు భావుకులు. వాల్మీకి వాచంయమత్వము నిందు డిందు పడినదని యను వారుందురు గాక. కాని యీకథ శృంగారకథ. చెప్పుచున్నది శతానందుడు; జనక పురోహితుడు; అహల్యా గౌతముల అపత్యము. వినుచున్నది పదునారేడుల రాచబిడ్డలు రామలక్ష్మణులు. రాజర్షి జనకుడు ఒక శ్రోత. మఱియు 'మహర్షి పరిషన్మధ్యగతు'డైన విశ్వామిత్రుని సమక్షమున నీ కథనము సాగుచున్నది. ఇది యెంత మేనక కథయైనను నిందతడు నొక పాత్రయగును గదా! అట్టిచో ఔచిత్య నిర్వహణ మిట అసిధారావ్రతమని వేఱ చెప్పనక్కఱలేదు. ఇచటి రచన మాత్రము ఇది కవి యభినివేశము నాచికొన్న ఉజ్జ్వల రసవద్ఘట్టమగుటచేనేమొ వారన్నటులే కడుమపట్టుల రచన నతిశయించినది. అవ్యుత్క్రమాన్వయమై సూటిగా సర్వతస్సుందరమై సాగినది – ప్రతిపద్య చమత్కృతిగ, ప్రతిపద మధురముగ, రస ప్రసన్నముగ

'మాకంద తరుశాఖికా కోకిలాలాప
కౌతూహలాకార కలనజేసి
ప్రాత స్సమాయాత శీతానిలాఘాత
సాధుపల్లవహస్త సంజ్ఞజేసి
కేళాధివద్వారి శాఖానదీవేణి
కాంసిత కుసుమాల కాంతిఁజేసి
సామోద కల్హార సంఫుల్ల నీరజ
హాసశ్రీ రాత్రి మోహావతి జేసి
తరుణ శాలీన కోమలాతప విహారి
హృన్మనువాంఛా ప్రవర్తిమరేఖ జేసి
శకలిత మరాళ కూజహాసంబుగా వ
సంత నవశోభ వచ్చె నప్సరసవోలె"

వసంత నవశోభ అప్సరసవోలె వచ్చినదట! ఇదియొక అందమైన అవశ్యంభావి అవ్యభిచారి కావ్యార్థ సూచన. అదియు గాక ప్రతి సంవత్సర జాతకంబున బుధప్రత్యగ్ర యోగంబుగా వచ్చునది వసంతము. అట్లే తపమొనరించు ఋషులకడ కింద్రప్రేరితలై అప్సరలు వచ్చుటయు సహజమను విషయము మిట సూచితము. సందర్భసుందరము, అలంకార చారువు, చమత్కార సమగ్రమునైన వర్ణనయది. ఆ సీసపద్యపు నడకలో 'రసప్రసిద్ధధారాధుని' శ్రీనాథుని కైవారపు హుందాగిరీ యున్నది. ఆ వచ్చిన వసంతము మానవ్యము పరిమితమైన సామాన్యఋతువు కాదు. ఆ వచ్చిన యప్సర సామాన్యాప్సరస కాదు; 'పరమాప్సరస' (వాల్మీకి)యైన మేనక. మునిసన్నిధిని నిత్యఋతు ప్రత్యక్షుడై పదేసు లోకేతరుగా మధుర బాంధవ్యములు నెరపిన నిత్యయౌవనవతు నాయప్సరవోలె తానును పదేండ్లు నిత్యప్రత్యగ్రముగా నిలచిపోయిన దా వసంతము. అందుచే నిట వసంతమున కప్సరసతోడ పొత్తు నాయత్తపరచు ఆ ఉపమా వాచకము 'వోలె' శబ్దము సర్వథా రమణీయార్థ ప్రతిపాదకము.

అప్పుడే జలకమాడి వచ్చినది మేనక. అప్సరస! ఆ రాక—

ఆరొమెడ మందహాసకలి
తావక దీధితి గాంచుమన్నగా
ధీయుని నేత్రమార్గ పరి
ధిక్కృత మోహన మోహసాంగరే

ఛాయతి మానసోత్పల వి
కంపిత ముగ్ధకరాంగుళీ గృహీ
తాయత సిక్తచేల కలి
తాంచిత కాంచిపదాభిరామయై.'

అప్సరః పాత్ర ప్రవేశమున్న నట్లుండవలెను! మూలమున స్నానప్రసక్తి మాత్రము గలదు.

అందమైన యామెది జలకమాడి నిలువునిపాద మార్ద్రవసనాంచితయై యుండునపుడు మొట్టమొదటగా రసికదృష్టి నాకట్టునది యామె కాంచీదామ పదంబగు నితంబము. కాన స్నానమాడిన మేనక మేని కాంచీదామ పదమ్మును చుట్టుముట్టిన విశ్వామిత్రుని చూపుల పారవశ్యమున కట్టి సద్యఃస్ఫురణ గలిగించిరి. ఆ సమాస మామె కాంచీదామమువలెనే సుదీర్ఘముగా శబ్దగుంఫితముగా సాగినది. తదుపరి నోరజాపు నొయ్యారము నొలుకబోయుచు నాట్యహేల జెలగు నడుపుచు 'మువ్వంకలుగ' అనగా త్రిభంగిగా నిల్చిన ఆమె మనోహరభంగిమ సువర్ణితము. ఇక విశ్వామిత్రుని వాలకము—అతని మోహమునుండి దూసుకొని వచ్చిన రసికత్వము గడ్డముమీదుగా ఱొమ్ము గాడిపార హృదయములోపల జొచ్చి చూపుల ద్వారా అభివ్యక్తమైనది. అప్పుడు 'అప్పుడా మాయ రిరంసురును హృత్సదనంబు కవాటముల్ బలెన్'.

ఈ రూపకోపమ్యము లతిమాత్ర మనోజ్ఞములు; అప్పటి మేనామానుల మానరాగ మధురిమలను సహృదయులకు జూరలిచ్చునవి. అంతలో వారి చూపు లర్థవంతములకు నవ్వులుగా పరిణమించినవి. 'హా'మా' ముని (ఆ ముని కథకుడైన శతానందుని ప్రక్కనే యున్నాడు. అయినను 'ఆ' ముని యనుటలో మర్మము ఆ వెనుకటి విశ్వామిత్రుని తీరువేరని స్ఫురింపజేయుటయే యగును.) 'ఓరోరీ వానిపోరు జే! విచ్చిన కేశముల్ పిడుపు పెట్టుగునా?' అని యుద్ధరీతుము సవరించి ముందుల కొడిగట్టినాడు. అదియొక వ్రతిభాగుల రసికత్వము. సరే వారు తడిసియుండెలు నే దుడిచెదనన నే దుడుచు కొందునని పెనగులాడిరి. ఆ పెనగులాటలో 'చివరిదైన ఫలము తడి కౌగిలింతగా బరిణమించె.' అనంతరము వారి శృంగారానుభవములో మరియొక భంగిమ మానియొడిలో మేనక—'ఎసల్ పాడిచిన చూపులై బలుపు ఫుక్కిలులై' 'నీవునీవని' హెచ్చరించుకొని 'భావజభావనమోహపథావధి గాత్రమే వాహా మ్మను కొనుచు, ప్రణయాద్రైతభావనా ప్రకోపములో సుఖించు మండిరి వారు. 'క్రిందౌచు మీదౌచు వారల కేళీ విశేషంబు పట్టదుగదా రామా! జగన్మోహనా!' అన్నాడు శతానందుడు—బ్రహ్మచారి రామునితో! బ్రహ్మర్షి విశ్వామిత్రుని సముక్షమున! మహర్షి పరివస్త్ర్యమున! అనున్నది రామశబ్దమును పునశ్చరణ చేయుకయే యనియుండుట విశేషము!

విశ్వామిత్రుడు మేనకకు దన పర్ణశాల చూపించి స్వాగతమిచ్చినాడు. అద్భుట 'పచ్చని వింటి జోదు మన బంటయి పల్లవ ఖడ్గహస్తుడై' ప్రహరి దిరుగునని అభయమిచ్చినాడు. 'అంతటి రక్షయున్నచో' తన కర్తవ్యంతరము లేదన్నది సరసురాలు! అతని నిత్యనైమిత్తిక కర్మములెల్ల మూలబడినవి ఆమె కుపచారములు సేయుటలో సరిపోయినది. ఆమె కర్ఘ్యపాద్యములుగా మద్యాలక్తక సమర్పణము, ధూపార్చన, కొప్పులో పూలు ముడుచుట మున్నగు నుపచారములు చేయుటతో నాతనికి ప్రొద్దుపోవుచుండెనేగి. కొప్పులో పూలుముడుచుటది కొంత నయము కాని పారాణి రాచుట పాదసేవ సేయుటేటి రసికత్వమను సంభావులు కొందఱుండవచ్చును. అందులకు మా సమాధానము: కాళిదాసు సాక్ష్యము. తన కుడికాలికి పారాణి రాచునంతలో ఇంద్ర ప్రేరితుడై ఈశ్వరుని తపోభంగము చేయుటకై పోయి అనంగుడై పడియున్న మన్మథునిజూచి రతీదేవి 'తవ మం కురు దక్షిణేతరం చరణం నిర్మితరాగమేహి మే' యని పురామధుర స్మృతులు నిక్కణాలు పెట్టి యేడ్చినదట. (కుమారసంభవమున.) అసలు ప్రియురాలి పాదమునకు పారాణి రాచునంత మాత్రముచేతనే అదియొక ప్రాభరసికత్వము గాదట! ఆ పారాణి రాచిన పాదముచే నొక తాపుతిన్న రసికుని జన్మమే చరితార్థమగునట! వాడే భగవంతుడగు మన్మథునకు కడుగూర్పువాడట!

'సాలక్తకేన నవపల్లవకోమలేన
పాదేన నూపురవతా మదనాలసేన
యస్తాడ్యతే దయితయా ప్రణయాపరాధాత్
సోఙ్గీకృతో భగవతా మకరధ్వజేన.'

(అమరుకము)

మరియొక మెట్టుపైకి ప్రాకినాడు పారిజాతము తరిగారు. సత్యాపాదతాడనము నొక ప్రాభవ విశేషముగా పరిగణించినాడతనికంటె ఘనుడు మకరధ్వజుని కన్న తండ్రి. ఇది యంతయు నొక చమత్కారమైన రసికత్వ తత్వరహస్యము. చూడుడు :

'కోకిల కొమ్మలో గూసిన నీరచే
వన్నె విల్చితి వంచు నవ్వమాని
తుమ్మెద పాటలోన ఝుమ్మన విదియేమి
మణితమే యని మేలమాడు మౌని'

ఇట్లు ప్రకృతి సర్వత్ర ప్రణయినీ మధురానుబంధ పులకితముగా కనుపట్టుచున్నది మౌనికి. అతడింక 'మౌని కాడు మమతచే వాచాల సార్వభౌముడయ్యె'నట. వాల్మీకి మౌని పది యనుష్టుప్పులలో చెప్పిన గాథ నింతదూరము వ్యాకరించిన విశ్వనాథవారికే మాట చెల్లునందురేమో! కాని యీ ప్రణయానుబంధములు వ్యాకరింపబడిన తీరు జూడుడు. అది మధురాతిమధురము, మనోహరము.

'తిన పాదమామె పాదము జతగా బెట్టి
యస్మత్పదంబు మాటని వచించు'

ఇంకను ఆ ముని ముచ్చట లేమని చెప్పను! అతని రసిక ప్రతిభ వసంతునివలె నవనవోన్మేషభాసుర ముగుచున్నది. ఈ ముచ్చట మాడుడు:

'చెక్కిలి చెక్కిలి జేర్చి గడ్డము గ్రుచ్చు
కొన్నదా యని గ్రుచ్చిగ్రుచ్చి యడుగు'

నట. ఇదియొక చిత్రమైన కుశలప్రశ్న. గడ్డము గ్రుచ్చుకొన్నదా యనుచునే మరియు గ్రుచ్చిగ్రుచ్చి యడుగుటేమి? అని యనరాదు. ఆ పునరుక్త క్రియా సమాభిహార మనురాగమునకు సంబంధించినది కాని గడ్డమునకు సంబంధించినది కాదని గ్రహింపవలయును. ఈ సందర్భము నీపడించినవారి తెలుగుదనముకాని సత్యభామతో 'చెల్వగు నీ పద పల్లవంబు మత్తను పుల కాగ్ర కంటక వితానము దాకిన నొచ్చునంచు నే నని యెద'నన్న సత్యభామా విధేయుని విన్నపముకంటె యీ కుశలప్రశ్నము మే యుదాత్తముగా నున్నది. అతని పులకలు తాత్కాలికములు. నవోద్భిదములు! అసహజములు, హాస్యములు. ఇతని గడ్డమో! మరి!

అంతటి బుషి ఏమంత కేలిక మానిసియైపోయినా డనిపింపవచ్చును. కాని యీతని చిలిపితనమును ప్రౌఢముగా సమర్థించినారు కవిగారు. 'కై, లాసము పైని దేవుడును లాచిన కామినియందు గల్గు లీ, ల్లాస ముదస్తుడైన బసివాడును బోలె జరింపు నేకదా' యని.

ఇప్పటి యీ మేనకావిశ్వామిత్ర ప్రణయ ఘట్టమునకును సీతారాముల ప్రణయఘట్టమునకును కొంత బింబప్రతిబింబభావము గలదు. గురు శిష్య లిరువురును 'రాజితమైన మోహము నిరంకుశులై' ప్రవర్తించిరి. గురువు బుషి యగుటవలన బర్ణశాలలో 'వెదురుగొట్టాల నింపిన యిప్పపువ్వుల్లు తెచ్చి యర్పరకు' నందిచ్చినవాడు. శిష్యుడు రాజపుత్రు డగుట వలన 'కనకపాత్రికల నింపిన యిరారసముల దెచ్చి మైథిలికి' నందిచ్చెడివాడు. ఇరువురును కోకిలకూతను సాహిత్యపీయూషధారగా భ్రమించినారు. ఇరువురును దమ కరచరణములతో ప్రియురాండ్ర కరచరణములను పరిపోల్చి వారి మార్దవమును గుర్తెరిగినవారు. (బాల కాండము—పుటలు 2?ర, 266—367,68) గురువునకు దగిన శిష్యుడు రామచంద్రుడు! (మేనకకును సీతకును సంబంధము లేదు.) రామునకు మామూలు అస్త్రవిద్య యేకాదు మన్మథాస్త్రవిద్యనుగూడ అనుగ్రహించిన గౌరవము దక్కినదన్న మాట విశ్వనాథవారి విశ్వామిత్రునకు! ఆ మాట విశ్వనాథవారి శ్రీరామ చంద్రుడే స్వయముగా సీతమ్మవారితో నిట్లు సెలవిచ్చినాడు.

'శ్రీ మనోనాథు లీలావిశేష మెవని
సీత యో స్వామి! యెందు నేర్చితని యడుగ
నేను నేర్చిన దేమున్నదే? నతాంగి
కౌశికుం డుపదేష్టయుం గాని దనుమ.'

(బా. కా. పుట 368)

ఇంత సాధన చెన్నడు చేసినాడో రామచంద్రుడు! కాదు శతానందునివలెన గినియున్నాడు. ఏకసంథాగ్రాహి మహానుభావుడు!

అట్టి రామచంద్రుని కొరకసింకెట్టిన ఆ గురుడింకను సెట్టివాడనగా, అవధరింపుడు. ఒక్క సెట్టి పదేండ్ల పాటు ఆరు బుతువుల నొక్కటిగా అకట్టిన ఘటికుడు. ఆ 'మానిథియంబువలన' ఆరు బుతువులు నాశ్రితమున వసంతమొక్క 'యభినయించు'మన్నదట. ఇదియొక మనోజ్ఞభావన. మరి ఆ అభినయ మెట్టిది? 'పూలతో లేతయొంపల జాలుతోడ చివురుతో లేత వెన్నెల నవ్వుతోడ' కొనసాగినది. ఆ కియ్యయొక్క యూపులో నొక్క సమతాసుమము గోచరించి యవును ఆరు బుతువు లొక్క సమంబ అవునవుననిపించుచున్నది. వసంతమే యట్టిది. అది యొక్కటే వద్భుతు స్వభావ గర్భితమును. ఆమని నిలుకడకు మేనక యొనికియు ప్రబల కారణముగా వక్కాణింపబడినది. యది మనోజ్ఞతరము. ఆమెది దేవమానము. ఆమె కదియొక లెక్క కాదు. అట్లు వసంతనిరంతరముగా సాగినది వారి ప్రణయము.

'ఈ మధుమాస మొక్క పదియేడులు పోగ' నన్న యీ పద్యపు టెత్తుగడ యెంతయు మనోహరము. కష్టకాలములో నిముస మేడై తోచునట్లు సుఖకాలములో జనులకు వత్సరములు దినప్రాయములై తోచును. పదియేడు లొక్క మధుమాసమువోలె గతించినవగా అందు వారి సుఖానుభవాధిక్యస్ఫూర్తి సూచితము. ఈ సందర్భమునే మహర్షి వాల్మీకి 'అహోరాత్రాపదేశేన గతాః సంవత్సరాదశ' అని సూచించియున్నాడు. పదేండ్లు నొక్క యహోరాత్ర మాత్రముగ గడచినవన్న మాట మరియు మనోహరము గదా!

అంత నొక నాడు మేనక గర్భిణి యని గుర్తించి నాడు మౌని. అంతట 'గాధిజు కన్నులు తెల్లు వన్నులై'నవట. అనగా తెలివిజేరి నాడనియు నంతకు ముందు నాడు నిత్యకోపారుణశీలములైన యాతని నేత్రముల కిప్పుడీ మధురానుబంధము కారణముగా మంచి పరివర్తన గలిగి యాతని స్వభావమున కొక స్వచ్ఛత వచ్చినదనియు ఇంకను ఆ తెలుపులో అచ్చెరువుపాటు మొదలగు భావముల నంటినాడనియు నర్థమగును. 'ఒకనాడు ప్రొద్దున నాత్రమ పురస్థ నారికేళ వలయంబులు లెక్కపెట్టి పదియేండ్లా బళీ!' యన్నాడు. కొబ్బరిచెట్టుపై ఏటికొక వలయ మేర్పడునట. అట్లా వలయములు లెక్కపెట్టి కొబ్బరిచెట్టు వయస్సుగొలుచుట మనవారికొక పరిపాటి. తెలుగు వారి సంప్రదాయ మిట చక్కగా నను సంధింపబడినది. (ఇట్టి సందర్భము లితరత్ర పెక్కులు కలవు వీరి కావ్యమున) అంతట మౌనికి పశ్చాత్తాపము కల్గినది. 'వినిశ్వస మ్మునివరః పశ్చాత్తాపేన దుఃఖితః' అని మూలము. అట్లు వాచ్యముచేత పరిపరి విధముల నా పశ్చాత్తాప భావనను వ్యాఖ్యానించి తన పాత్రలో పఠితకు సానుభూతి కల్గునట్లు ప్రదర్శించినారు విశ్వనాథ వారు.

'విప్రాః పశ్చాద్బుద్ధయః' అన్నారు పెద్దలు. అప్పటికి విప్రత్వ సముపార్జన వ్యాసంగమున నున్నాడు విశ్వామిత్రుడు. అందులకే మరల మరల నన్ని మారులా ఘోరతపస్సు. ఇక విప్రత్వము పొందుటకు తగిన యోగ్యత కొంత యేర్పడుచున్నదని సూచించుటకే ఆ పశ్చాత్తాపపరిస్థితి నంత పటువుగా చిత్రించినా రనుకొందును విశ్వనాథ వారు.

"అల్ల త్రిశంకు నాటేపగ
యంతయు దీర్చెను నాకరాజతం
డెల్ల తపంబునందు ఘటి
యించును విఘ్నము స్వర్గరక్షకై
చెల్లను న్యాయమై యదియు
జేడిన మేనక కేమి తప్పు? తా
నల్ల సుపర్వరాజు నదు
పాజ్ఞల లోనిది యెంత చూచినన్"

ఇట్లు విస్పష్టముగా విశ్వామిత్రుని పరిస్థితి పరిణామము కార్యకారణసంబంధ పురస్సరము నొక చక్కని ఆరోహణావరోహణక్రమమున విలార్చి యాతని హృదయ పరిణామము స్ఫుటముగా చూచి చూపిన కవి ప్రజ్ఞ కడు ప్రశంసనీయము. ఆ చెప్పుట యెంత నిరాడంబర సుందరము! ఆ మామూలు మాటలలో ఎంత వాటము! ఎంత పొందికయున్నదని! 'ఎల్లయు దోసము నాదగు'నని తీర్మానించుకొని నాడు మౌని. తన సంగతి సర్వము మునికి తెలిసిపోయినదని గ్రహించి నిలువెల్ల వణకుచు కట్టెదుట ప్రాంజలి పట్టి నిలుచున్న మేనకను జూచి 'ఓసీ యప్సర! నీవు బీతు వడదేలో తివ్వి! నీయందు నాదోసంబున్నది గర్భరూపముగ... శిక్షింతునె యేలా నాదు దోసానకున్' అని అభయమిచ్చినాడు. ఆమె గర్భముతో తన కేమియు పట్టదన్నట్లు కాక కర్తవ్యము గూర్చి తను నుపదేశమిచ్చినా డున్నాడు! మీదు మిక్కిలి తనకుం గడు మేలే పొనర్చితివని ఘనముగ ప్రశంసించినాడా మౌని. దేవతల పనికై కూలికి వచ్చినట్టియున్నను 'ఎడదలో తలిచ్చిన నిను చాల శపియింపవలయు నే మధుమూర్తీ!' అనియు, లౌకిక భోగతృప్తి కానిచో ఎంత తపస్సులు సిద్ధి పొందవనియు, ఆ తృప్తిపొందిన తన హృదయము నింక నెట్టి కోకిల కూతయు ఆకర్షింపజాలదనియు, 'అసలు కోకిల యేమొ నాకర్థమయ్యె నీ కృపావేశమున జేసి నీరజాక్షి' యనియు తృప్తితో, కృతజ్ఞతతో, గుండె నిబ్బరముతో ఆత్మ సాక్షాత్కారము పొందిన మహాయోగివోలె నుపన్యసించినాడు. ఇంక కొలదిలో ఆ స్థితి యవధిరేఖ నంటబోవుచున్నాడు. అప్పటున ప్రతిపదము నతని హృదయమునందలి యొక్కొక్క మధుర స్పందనముగా మనకు గోచరించును. అతని లోని కోపము విసుగుగా, విసుగుదల యుపేక్షగా, ఉపేక్ష క్షమగా క్షమ యౌదార్యముగా, ఔదార్య మాపదశీలతగా, వివేకముగా ఉత్తమ మనస్వితగా పరిణమించిన క్రమము నతి నిశితదృష్టితో హృదయంగమముగా చిత్రించినారు కవిగారు.

ఒక్కొక్కచోట విశ్వనాథవారి రామాయణము వాల్మీకమునకు భావపరమైన మహా భాష్యముగా భాసిల్లును. సరిగా నిప్పట్టున అట్లే యున్నది. మూలమున 'మేనకాం మధురవాక్యై ర్వ్యసృజత్' అని యున్న యొక్క పంక్తిలోని ఆ మధురవాక్యములను దానిలోని మర్మము నుదార భావగంభీరములగు నుపనిషత్సూక్తంబులంబోని వాక్యంబులలో నావిష్కరించిరి.

మరల మౌనిస్వాంతమును తపోభినివేశ మావేశించినది. తన లక్ష్య మాదేశించినది. తత్క్షణము 'ఇంక ననుమతి యిచ్చిన నే దపస్సమార్గముల నేగియేగి బ్రహ్మర్షి నగుదు'నన్నాడు స్వామి. అట్లా మె ననుమతి నేసుటలో ఆ మునిస్వామి దెంత యౌదార్యము! ఈ కవిస్వామి దెంత యౌచిత్యము! దశరథ రాజ సభలో వందిమాగధులచే విశ్వామిత్రునిగూర్చి 'నీ ఘనతల్ విచిత్రములు, నీయెద మెత్తు వేలు రా!' ఇత్యాదిగా యశఃపూర్వము చేయించిన ప్రశంస నతిరశః ఇట రుజువుపఱచినారు కవిగారు.

మౌని సంభావణలో నెక్కిన మరియొక మెట్టు

'కోరి ప్రత్యక్షమన్మథుఁడవైతి
కోరక పరోక్ష వైరాగ్య గురుఁడవైతి
లంజియా! యెంత క్రిందికి గుంజినావో
యంత పైకిని జను మార్గ మరసినావు.'

ఈ వాక్యముతో మౌని మధురోదారభావనయు నీ కావ్యఘట్టము ప్రయోజనమును పరాకోటి ముట్టినవి. సహృదయ పాఠకుని కాలము చరితార్థమైనది. పై ప్రణయఘట్టముకంటె నీ పశ్చాత్తాప ఘట్టమే సుందరతరమనుట సత్యదూరము కాదేమో.

'మేనా! నేనును బ్రహ్మర్షి గుణము సుమీ బ్రహ్మకూ మానితో' అనుటలో నొక పంతము పట్టితినికాని నేనా నిన్ను విడుదువాఁడ నను స్ఫూర్తి యున్నది. మరల 'మేనా! నవ్వకుము నా దుకథ మీ యప్సరః పాళితో గానీ చెప్పి' అనుచున్న మౌని విశ్వనాథవారి ఆ కైవాడపు టొడుపులో మనకు మంచి స్మేరముఖోహాసాస్యముగ నే దర్శన మిచ్చుచున్నాడు. ఇక కుంది సాగనంపువెట్టుడు వింద్రునితో తన మాటగా 'కామము కోసి వేసితినటం చా స్వామితో చెప్పవే' యన్నాడు. కోపము ప్రసక్తి నెత్తుకొనని కవి జాగరూకత గమనింపదగ్గది. అతని కంతటితో కామము పోయినదికాని కోప మింకను పూర్తిగా పోలేదు' కనుక నే మేనకతో మౌని చెప్పిన చివరిమాట నమ్మక ఇంద్రు డీసారి రంభనంపగా దాయి కమ్మని శపించి నాఁడు మౌని.

రసికధిషణా సర్వంకషయగు నా రంభ ఈ రామాయణ కల్పవృక్షమున మేనక తిరిగివచ్చి ప్రేమించుట నిక తన వంతు వచ్చినదని యింద్రునకు మొదలవెట్టగా 'ఇది మేనకకును నీర్ష్యపదము వేమో యనియో'నట. గమనించితిరా కవి గడుసుదనము! ఆ యనురాగ మా ప్రణయము మహియ నిష్ఠమనుట కిదే ప్రబల ప్రమాణము. మరియొక మాట. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి పట్టభద్రుడైన దంతట సర్వలోకములకు నొక వింత చెలువము చైతన్యము వచ్చినట్లయినది. దేవదుందుభులు మొరసినవి. కిన్నరు లాడిరి పాడిరి. ఎందరెన్ని చేసినట్లు చెప్పినను అది చెప్పుటకాదు. ఆ చెప్పుట సార్థకము గాదు. 'అంత నృత్యాభిరామమూర్తియై.

అప్సరసయైన మేనక
లిప్పు మధుమూర్తి కోకిలకేకా
దీప్తకీర్తనఁ బాడెఁ గ
కుప్పనమ్రాజ్ఞనము భావ కూలంకషమున్.'

ఈ పద్యముతో నిది విశ్వామిత్రుని కథ కాదు మేనక కథయై పోవుచున్నది. తనతో పదివత్సరము లొక మధుమాసముగా మన్మథసామ్రాజ్యము నేకాతపవారణముగ నేలిన మహాభాగుడు, తన ఎదలోతు లంటిన రసికావతంసుడు, తన ప్రియుడు, శిష్యుడు అతడు సాధించిన లోకోత్తర ఘనవిజయ సముత్సాహ సంరంభము తనది గాక మరి యెవరిది? – అనుకొన్నది మేనక. ఇచ్చటను అప్సరశ్శబ్దము వెనుకటి వసంతావిర్భావ ఘట్టమునందువలె నే అన్వర్థమైనది. ఆ శబ్దమునకు వాల్మీకి యిచ్చిన నిర్వచనమే గలదు:

'అప్సు నిర్మథనా దేవ
రస స్తస్మా ద్వరస్త్రియః,
ఉత్పేతు ర్మనుజశ్రేష్ఠ
తస్మా దప్సరసోఽభవన్.'

అందును ప్రకృతియు మేనక గానవాహిని 'భావ కూలంకషము'గదా! మరియొక విశేషము: ఆ కాకలి కోకిలధ్వని. కేక మయూరధ్వని. అనగా వసంత వర్షర్తు ప్రభావ ప్రత్యాహారమున మధ్యలో మౌని తపఃక్లేశ గ్రీష్మము లుప్తమైనదని ధ్వని. ఇట కాకలీకేకలు!

కోకిలా మయూరములకు సంకేతములు. కోకిలగానమునకును, మయూరము నృత్యమునకును వాసికెక్కినవి. గానము రాగ ప్రధానము. నృత్యము భావాశ్రయము. ధాతువుతోపాటు మాతువును గలది కీర్తన. అనగా రాగ భావములకు సాహిత్య సౌహిత్యమును సంఘటించిన కళాకల్యాణి మేనక.

ఈ కథపై కవికి ప్రత్యేకమైన మాపు కలదు. దీనికి భంగ్యంతర సుందరముగా నొక ఫలశ్రుతిని గూడ రచించినారు వారు. ఆ కథవిని రాజర్షి జనకుడు బ్రహ్మర్షి విశ్వామిత్రున కంజలిపట్టి ధన్యోస్మియని

'ఇంతవంది సదస్యులు నీ కుమార
యుగ్మకము వినుచుండ మహో నిధాన
మైన నీ కథా విస్తృతి గాని వినిన
దా నిరంతర మోదము జెప్ప లేను స్వామి!
'ఇది రెండుగ గడు చిత్రమైన యది స్వా
మీ నాకునుం దృశ్యకథా
శ్రవణంబున్ రఘురామ చంద్రముఖ భా
స్వద్దర్శనంబుగ హృదం
త వికీర్ణంబయి లాగుచున్న యవి.'......

'స్వప్రశస్త కథా పరిష్కారిశాఖ!' అని యుద్ఘాటించినాడు. ఏకాంతమ్మున శ్రీరామచంద్రుండు లక్ష్మణునితో

'ఈ ఋషులెవ్వరు చెప్పిన
సారకథా కథన మెంక్క చాయనె నడచున్
తీరంతర్దీప్తులు బహు
ధారూపిత సూక్ష్మతర కథాంశములు సుమ్మీ'

ఆస్వాదట. ఇది యింకొక గడుసు పోకడ. మొదటి సంగతి యొక కవి తన కావ్యమున కథలో కథగా ఆ కథను పాత్రముఖముగా నాఖ్యాత మొనర్పుచున్నప్పు డా కథాగత కథాశ్రోత పొందిన యనుభూతిని సూచించు టదియొక శిల్పపు మెలకువ. జనకుని యనుభూతి ప్రసక్తి యూలమునందును నిందును గలదు కాని ప్రధాన శ్రోతయైన రాముని యనుభూతి విశేషమిందు వర్ణింపబడినట్లు వాల్మీకమున లేదు. తన పూర్వాశ్రమగాథ తన సమక్షమున చే చెప్పబడు చున్నపు డెవ్వడైన నేదో యొక యనుభూతి పొందక పోడు. అదికూడ కావ్యమున సూచితమైనచో నది యొక సొగసు. కాని విశ్వామిత్రుని యనుభూతి విశేష ప్రసక్తియందును నిందును గూడ లేదు. రెండవ సంగతి! అసలీకథ మేనకదీకాదు, విశ్వామిత్రునిదీ కాదు. చెప్పినవాడు శతానందుడును గాదు. వాల్మీకమున విన్లే యుంపను లేదు. చెప్పినది విశ్వనాథవారు. దదివినది మనము. ఆ కథాకథన కౌశల మాబుషులది కాదు. విశ్వనాథవారిదే. అట్లు పూర్వాపరసంఘటనలు పూసగ్రుచ్చినట్లు కథా సూత్రము లాగు చేర్చు, తన కథా శిల్పమును తానే సమీక్షించుకొనుచు నట నట భంగ్యంతరముగా ఆ ప్రశంస చేయు గడుసుదనము బహుముఖ ప్రజ్ఞా దిత్సువులగు కవులకే కైవసమగు శిల్పము గాని యితరము కాదు. ఇంతకును రామాయణ సామ్రాజ్యమున విశ్వనాథవారి యేల్బడి తీరవేరు. కథ కడు ప్రాతది ; శిల్పము సరిక్రొత్తది.

# రక్తహస్తాలు

శ్రీ ప్రభల సత్యనారాయణమూర్తి

మస్తుగా త్రాగేసిన కండక్టర్ "రైట్... రైట్" అన్నాడు తొడమీద వామ హస్తంతో బలంగా చరుచుకుంటూ—తూలుతూ...

ఇంచుమించు అంత సరకూ పట్టించేసిన డ్రైవర్ బస్సు స్టార్టుచేశాడు.

పర్వతంమీదనుంచీ పక్కని ఆ బాటుకుండా బస్సు అమిత వేగంతో క్రిందకు దిగుతోంది. అటూ యిటూ ఉన్న అగాధాలను పరికించి ప్రయాణీకులు యావన్మందీ ప్రాణాలపై ఆశవదులుకున్నారు!!

* * *

అనకూడదుగాని, అసలు బ్రహ్మదేవుడు ఏ ఉద్దేశంతో—ఏ క్షణంలో ఉండి రాఘవేంద్రాన్ని ఈ భూమ్మీదకు వదిలాడో! రాఘవేంద్రంకూడా పోనీ అని యిప్పుడైనా ప్రతిఘటించకుండా యింకా ఏం చూసుకుని ఈ లోకంలో మసలాలని ఆశిస్తున్నాడో!

ఆ అర్ధరాత్రి భోగం కొంపనుంచీ బయటపడి, యింటికి మళ్ళసరికి కచ్చితంగా...మూడూ అయింది! ఆశ్చర్యం!! చడీ చప్పుడూ లేకుండా వినయగీవతే ఔగి చక్కా వచ్చినట్లుగా యిల్లాలు తలుపు తీసినదికి తను తాను గిల్లి చూసుకున్నాడు...నాలుగు వేళ్ళతోనూ...యిది కలా నిజమా అని సందేహిస్తూ. అంతి సులభంగా విశదమవలే దీ పరిస్థితి—

ఈ విధంగా ఆలస్యమైన ప్రతినిత్యం సందు మొగన తానుండగానే పసిగట్టి బుసలు కొట్టే వాచాల—ఈనా డిలా అయిపోయిందేమిటా సంప్రదాయ విరుద్ధంగా-అని ఆశ్చర్యపోతూ అలాగే వసారలో నిలబడి పోయాడు, చెప్పలు విడిగి. ఆరు త్రిరక్షణంలో 'తన ఈ భార్య అనంతంగా పరమభాగవతో తమరాలయి కూర్చోదుకదా కొంపతీసి' అనిన్నీ విచారించ సాగాడా రసికావతంసుడు!

తర్వాగా వీధి తలుపులు బంధించింది రామాయమ్మ...రాఘవేంద్రం ధర్మపత్ని. కిమ్మనకుండా కనుకొలకుల్లోనుంచీ అతగాణ్ణి కేసి ఓ క్షణం పరికించి చూసి, గదిలోకి చక్కా పోయింది విసవిసా. ఏ భావానికి ఆస్కారంలేని ఆ చూపులో కోటి భావాలూ హాసించాయి రాఘవేంద్రానికి. కాళ్ళైనా కడుక్కోకుండానే, అడుగులో అడుగు వేసుకుంటూ అర్ధాంగిని అనుసరించాడు.

తన వెంటే గదిలోకి చక్కా వచ్చేసిన ప్రాణేశ్వరుణ్ణి పట్టున దూసుకుంటూ, రెండే రెండంగల్లో పోయి గది తలుపులు బంధిస్తూనే భళ్ళున, గిఱ్ఱున వెనక్కు తిరిగింది రామాయమ్మ "మిమ్మల్నే—" అన్నది ఓ రంకె వేస్తూ.

ఉలిక్కిపడ్డాడు రాఘవేంద్రం!

ఉరుమైనా లేకుండానే మచ్చుకు, కోటి అశనిపాతాలొక్కుమ్మడిగా అతగాడి నెత్తిన వర్షించినట్లయింది.

"ఎవర్నీ—"అంటూ యిల్లాలి కభిముఖంగా తిరిగాడు.

"వారినీ వారినీ పిలవడాని కేం ఖర్మం, ఎలుగెత్తి?..."

రాఘవేంద్రాని కర్థం కాలేదు..."చెట్టంత మొగుడూ అత్తరు సాయిబులా సరసన సువాయింపు చేస్తూంటేనూ—" అని రామాయమ్మ పూరించేదాకా. తీరా నిలబడి అంతా విన్నాక, ఆపాంతం అంతా అర్థం అయిందనుకున్నాక, తన వేపోసారి చూసుకుని...సిల్కు లాల్చీ వాసనలకు మురిసిపోయి, ఆ 'ప్రౌఢ'ను సమీపించకుండా ఉండలేకపోయాడు.

"ఏమిటా పొగరుబోతు వేషాలు!" అల్లంత దూరానే నిలవేసింది, ఒకే ఒక్క ఉరుముతో తాళి కట్టిన పెనిమిటినే, రామాయమ్మ!! ఇంకా ఉపేక్షిస్తూ కూర్చుంటే కఠోరమైన తన నిర్ధారణ ఎక్కడ నీళ్ళుకారిపోతుందోనని సందేహిస్తూ, "ఒక్క మాట—" అంది, నొక్కి నొక్కి పలుకుతూ—ఆ నాలుగక్షరాల్నే, గుడ్లు రెండూ సాధ్యమైనంత పెద్దవిచేస్తూ.

"ఏమిటో అది-" సాగదీసుకుంటూ మరికొంచెం చనువు తీసుకోబోయాడు రాఘవేంద్రం. కాని కూట విషాన్ని చిలికి చిలికి నిలబడి అమృతం తీయగల ప్రజ్ఞ ఒక్కటే రాఘవేంద్రం సొత్తు.

"చెబుతున్నాను. అట్లా చూడండి—"రుద్ర చండికలా గర్జించింది రామాయమ్మ, చేయెత్తి చూరు వైపు చూపిస్తూ.

అంతా తయారుచేసి సిద్ధంగా అమర్చి ఉంచిన ఉరిత్రాడు దక్షిణ వాయువులకు ఊయలలూగుతోంది.

సమ్మెటతో నిలబెట్టి నుదుటన మోదినట్లయిందతగాడికి.

రమణీయమైన సన్నివేశం అభినయింపబడుతోందని ఉబ్బి, తబ్బిబ్బైపోతూన్న రాఘవేంద్రం ఉలిక్కిపడుతూ వచ్చి వాస్తవంలో చక్కా మేల్కొన్నాడు! ఆ రమణీయతను కోటి హస్తాలతో చెదరగొడుతూ కళ్ళు యాతనికి మధ్యలోనే తెగజారిపోయింది—

"రావుడూ—"అని అరిచాడు రాఘవేంద్రం.

అరుపే కాదది, అసలు. వేయి నిలువుల లోతుగల నూతిలోనుంచీ కొనఊపిరితో—ఓ పిశాచండెయొక్క ఆర్తనాదంలా ప్రతిధ్వనించింది...ఆ స్వరం.

రామాయమ్మ వడ్డిన దోపిన కొంగును ఒక్కంత ఝళిక్కింపుగా బయటికిలాగుతూ "మరి—" అంది, భీతావహమై పాలిపోతున్న పెనిమిటి ముఖంలో ముఖముంచుతూ.

నాలుగు క్షణాలు నిశ్శబ్దం.

మృత్యుదేవత రాకకు మూగగా స్వాగతాలు పలుకుతూన్నట్లుంది, వారిద్దరి స్థితి సమన్వయించి చూస్తే.

తలత్రిప్పకుంది రామాయమ్మ... కిటికీకుండా చీకట్లో మినుకుమినుకు మంటూన్న నక్షత్రాలను లెక్కబెట్టేలా దృష్టంతా అటే కేంద్రీకరిస్తూ. లెక్క మరి ఎంత తేలిందో ఏమిటో లాగిన చెంగును లేని ఓపికతో తిరిగి బిగిస్తూ...

"అవును. ఒక్కటే నిర్ణయం. ఇక ఈ భూమ్మీద మీరో—నేనో ఒక్కరే బ్రతకాలి; అంతే! గుండెల మీద చేయి వేసుకుని కులపెద్దల ముఖాలు చూస్తూ చెప్పండి...మీరు బ్రతకడం ఎక్కువ అవసరమా, నేను బ్రతకడం ఎక్కువ అవసరమా?"

రాఘవేంద్రానికి ఈ మాటలలో సగం వినిపించి ఉంటాయేమో. నిప్పులు కక్కుతూ ఆ చీకట్లో భీకరంగా ప్రజ్వలిస్తూన్న ఆ రెండు కళ్ళనూ చూసి కంపించిపోతూ విన్న విషయంలో ఏ రహస్యంత మాత్రమో అర్థంచేసుకుని ఉంటాడు. ఉన్న తెలివి కూడా నీళ్ళు కారిపోయిందంతలోనే; బొమ్మలా మందుడై చూస్తూ నిలబడిపోయాడు.

ఈ పిచ్చి ముఖభావంతో రామాయమ్మ కోపం రెచ్చిపోయింది! అయినా సంబాళించుకుంటూనే శక్తివంచన లేకుండా, ఆవేశంతో అనసాగింది—

"ఎన్ని చెడుతిరుగుళ్లు తిరిగినా, ఎన్ని పాపాలు పులుముకున్నా, పిల్ల కాయల్ని మాత్రం యెగరేసి దంపబోనని చేతిలో చెయ్యేసి చెప్పండి. నిశ్చింతగా పోయి ఆ ఉచ్చులో నా మెడ బిగించుకుని చచ్చి ఊరుకుంటాను. లేదా, ఏ కలవారి కాళ్ళో పట్టుకుని, నీళ్ళబిందెలు మోసో, ఊడిగాలుచేసో పిల్లల్ని నేను పోషిస్తాను...తినికూర్చునే మహాయోగ్యుల్ని మన్నించే రోజులు కావు గనక యివి, పోయి 'రామా—కృష్ణా' అనుకుంటూ, మీరే ఆ పని చేయండి!"

"రావు—డూ..." అదిరిపడి ఒక్క కేక పెట్టాడు రాఘవేంద్రం.

మహాశిలలో అణువైనా కరిగే సూచన లవుపించటంలేదు!

"రావుడూ లేడు...దేవుడూ లేడు! ఇదే అంతిమ నిర్ణయం. త్యాగాలు చేసిన పూర్వుల పేర్లు చెప్పుకుని విఱ్ఱవీగే పురుషత్వం కదా...అట్టా గుర్రు నేలేస్తారేం? అయిదు నిమిషాల్లో అంతా మరి తేలిపోవాల్సిందే."

—సరిగ్గా అయిదునిమిషాలు లెక్క తప్పకుండా గడిచిపోయాయి!

పుట్టాక ఆలోచించడం, అభిమాన పడడం, అన్న రెండు తత్త్వాలూ రుచిచూసి ఎరుగని రాఘవేంద్రం ఏ ఆలోచన చేశాడో, ఏ అభిమానాలకు పోయాడో...

అంతేనా అని రెట్టిస్తూన్నట్లుగా తలపంకించాడు. ప్రియురాలికోసం చక్రవర్తిత్వాన్నే కాలదన్ని గద్దె దిగి వెళ్ళిపోతూన్న సామ్రాట్టులా—కుర్చీలోనుంచీ లేచి నిలబడ్డాడు. తొణకలేదు... రామాయమ్మ బెణకనైనా లేదు!

అడుగులో అడుగు వేసుకుంటూ పోయి నులక మంచం ఎక్కి నిలబడి, మెడ నిక్కించి రామాయమ్మ ముఖంలోకి సగర్వంగా ఓ చూపుచూశాడు. చూస్తూనే ఉచ్చులో తలదూర్చి, అందుబాటు కని అమర్చిన నులక మంచాన్ని బలంకొద్దీ కాలితో వెనక్కు తన్నేశాడు!

"మిమ్మల్నే—" అన్న వెఱ్ఱికేకతో ఒకే ఒక్క అంగలోపోయి గుండెలకు హత్తుకుంది భర్తను, పాపం రామాయమ్మ! ఆ క్షణం ముగియకుండానే మంచం ముందుకు లాగి, మునివేళ్ళతో దానిమీదకు ఎగిరి నిలబడి, ఒణికే వేళ్ళతో ఎలాగో ఆ ఉచ్చు సడలించి, విజయగర్వంతో మిలమిలలాడుతూ తేజరిల్లిపోతూన్న పెనిమిటి ముఖాన్ని ముద్దులతో ముంచెత్తింది. "మీరా—మీరా..." అంటూ మాటి మాటికీ.

రామయమ్మను పొదివిపట్టుకున్నాడు రాఘవేంద్రం.

పట్టు సడలించుకుంటూనే కస్సున లేచింది రామాయమ్మ.

"చాల్లెండి మరి! సిగ్గూ లజ్జా లేకపోతే సరి... బోతిగా. లోకులు నిలవేసి పొడుస్తారనైనా వెరవ వద్దా? సంపాదన లేకపోతే సరేసరి...నిస్తులన్నా పొదుపు చేసుకోకపోతే ఎట్లా? అంతా ఈ రాత్రి ఆ రండల పాదాల చెంత కుప్పవేసి, పిల్లలతో మరి తెల్లారి ఎట్లా వేగుదామనుకుంటున్నారూ?"

అంతటితో సరిపెట్టుకోకుండా, రసభంగం కావిస్తూ రామాయమ్మ వృథాగా నిత్యం ఉండే గొడవలనే తిరగతోడుతూంటే నవ్వొచ్చిందా సమయంలో, అతగాడికి.

నవ్వేశాడు, పకపకా.

వివస్త్రనుజేసి ద్రావకాలు కుమ్మరించినట్లయింది రామాయమ్మకు. "అంతకన్నా పోయి చావ రాదూ—"... అతగాని బదులు తానే అభిమాన పడుతూ వందరెట్లు, గుడ్ల నీరు కుక్కుకుంది రామాయమ్మ.

"రావుడూ—" దీనంగా చూశాడు.

ఎదురు చెబుతాడనుకుంది కోపంతో కనీసం ఈ మాటకైనా. భర్త జవాబుచెప్పక కిమ్మనకుండా తను కక్కే విషాన్ని దిగమింగుతూ భరిస్తూండడం చూస్తూంటే రామాయమ్మ మనసును కోటి చీమపురుగులు కొరుకుతూన్నట్లవుతోంది!

"పైగా రావుడూట...రావుడూ! ఆడదాని సొమ్ము తింటూన్నందుకే అభిమానపడి చావాలి. పై పెచ్చు ఆ ఎంగిలికూడు మూటగట్టుకొని సాని కొంపలమ్మటా—ఆడింకొంపలమ్మటా పడి తిరగ డానికి...రామచంద్రా...పురుగుల్లో కూడా ఉండ నివ్వకయ్యా, ఈ మొగజాతిని!" అంటూనే రెండు చేతులూ ఎత్తి నెత్తి బాదుకుంది, పాపం.

గొల్లున నవ్వాడు, మళ్ళీని.

చురచురా చూసిందతగాడికేసి, రామాయమ్మ నమిలి మింగేసేదానిలా.

రాఘవేంద్రం భావ్యం:

"అంతటి శక్తిమంతుడూ, మహిమాన్వితుడూ అయిన రామచంద్రుడికే ఆమాత్రం అభిమానం ఉండేదంటావా, పాటె మొగజాతిమీద!"

"ఆ జన్మిచ్చినవాడికే నా ఉండాలి...ఈలాటి అసమర్థుల్ని భూమ్మీద నడవనీయరాదన్న జ్ఞానం..."

ముక్కూ మూతీ తుడుచుకుంటూ రామాయమ్మ పాపం యింకా ఏమేమో వాపోతూనే ఉంది. చీమ కుట్టినట్టయినా చలించకుండానే నిలువునా మంచం మీద వ్రాలి నిద్రాణంలోపడి గుఱ్ఱు పెట్టసాగాడు రాఘవేంద్రం.

దూసుకుంటూ వచ్చింది ఒక్క తీవ్రమైన నిట్టూర్పు, రామాయమ్మ గుండెల్ని.

గంపగయ్యాళి రామాయమ్మ అని తలపోస్తే నిజంగా పాపం మనకో ఒరిగేదేమీ లేదు.

పూర్వాశ్రమంలో రామాయమ్మ సాటిలేని వినయవతి! తండ్రి వరసన ముప్పొద్దులా కూర్చుని రామాయణ భాగవతాదులు ఆసాంతం పఠించి జీర్ణించుకున్న విద్యావతి. ఆయా సమయాల్లోనే పతివ్రతా శిరోమణులంతా, అంతో యింతో తమతమ ప్రభావాల్ని ఆ లేతమనసుపై రుద్దేశారు.

వినయవతీ, సహనవతీ అన్న కీర్తిని సముపార్జించుకున్న రామాయమ్మకు ఏదో యింత నీడున్న మారాజును చూసి కట్టబెట్టేశాడు, రామయమ్మ తండ్రి.

ముళ్ళు పడ్డంతవఱకు...మొగుడంటే మానవ మాత్రుడే కాక మరేమిటో అని తలపోయసాగింది. ఆ 'ఏమిటో' అంతా అత్తింటికి తరలివచ్చాక 'ప్రత్యక్ష దైవం'గా పరిణమించింది. అంతే...పాపం, ఆ పిచ్చి కూన కాళ్ళు కడిగి బురద తాగడం మినహా అంతా చేసేసింది!

పరాత్పరుని పిలుపు విని అత్తా మామా సెలవు తీసుకున్నారు. వియోగభారంతో ఏ ఒక్కరూ క్రుంగి పోకుండా. ఒక్క మాసంలోనే.

'ప్రత్యక్ష దైవం' అసలు రంగు బయటపడింది. మరో మాసమైనా మళ్ళకుండానే వాస్తవాన్నంతా వచ్చి ఓ వాడు పీఠరుగుమీద విశ్రమించింది.

'వ్యవహారాల' కని చెప్పి సూర్యోదయం మునుకుండా బయటకు పోయిన రాఘవేంద్రం యింకా యింటికి తిరిగిరాలేదు.

అత్తా—మామా ఒక్కమాసంలోనే నిధనం పొందినందుకు కరుణాహృదయులు వీళ్ళంతా తమ్మ పరామర్శించడానికి వచ్చారనుకుంది పాపం, రామాయమ్మ.

"అబ్బే, కాదమ్మా—" అన్నట్లుగా ఉన్నాయి వాళ్ళ ముఖాలూ. "మరి—?" అనుకుంటూ ఎంతసేపో గడిపింది.

యుగాలే నిముషాలై పరుగులెత్తుతున్నాయా, లేక నిముషాలే యుగాల్లా వేధిస్తూన్నాయా యిదమిత్థంగా తేల్చుకోలేకపోయింది. పెనిమిటేరాడూ... పిల్చేవారూ!

"సిగ్గులజ్జా లేకపోతే సరి పాడుమనుషులకి... వంటరిగా ఆడకూతురు యింట్లో మసలుతూంటే తగుదునమ్మా అని అరుగులమీద తైతాయించ డానికి!" అని పళ్ళు కొరుకుతూపోయి సంజదీపం వెలిగించి కళ్ళకద్దుకుంది.

కూర్చుని కూర్చుని వాళ్ళు సైతం పాపం విసిగి పోయారు.

"సరే. మేం మరి వస్తా మమ్మాయీ. అత గాడు రాగానే మరిచిపోకుండా, ఆ ఋణాల సంగతి తేల్చు కు నేటందుకే మేం వచ్చామని చెప్పి పంపించు." అంటూ ఓ పెద్ద మనిషి లేచి నుంచున్నాడు. ఈసూరు మంటూ మిగిలినవాళ్ళుకూడా భారంగా శ్వాస విడుస్తూ అరుగులు దిగి ఆయన ననుసరించారు.

ఋ...ణా...ల సం...గ...తి !!!

—రామాయమ్మ స్థితి వర్ణించడానికి మరి చాలా పాండిత్యం కావాలి.

తడబడుతూ, తలుపు ఒకింత ఓరచేసుకుని, "ఇ...ఇ...ఏఏ ఋణాల...సం...గ...తం...డీ??" అంది వణికేస్వరాన. కాళ్ళు స్వాధీనం తప్పిపోతు న్నాయి ... పర పురుషులతో మాట్లాడినపాపాన పోలేదెప్పుడు. పుట్టాక అసలు 'ఋణం' అంటే ఫలానా అని ఎరుగనైనా ఎరుగదు పాపం!

ఎట్లాగో ఈ స్వరం యిందాకటి పెద్ద మనిషి చెవిలో దూరింది. ముందడుగు వేస్తున్న వాడల్లా సావ ధానంగా వెనక్కు తిరిగి చూస్తూ..."ఆడవాళ్ళు, నీకెందుకమ్మా ఈ వ్యవహారాలు... మేమూ మేమూ చూసుకుంటాం లే—" అంటూ సెలవు తీసుకున్నాడు.

—అక్షరాలా అట్లాగే చూసుకున్నారు, వాళ్లూ వాళ్ళూను. నాలుగైదు రోజులు గడిచిపోయాయి.

"మరేం చేద్దాం—" అన్నాడు రాఘవేంద్రం. తాపీగా ఆ తర్వాత.

"అంటే—" అంది అర్థంకాక, అయోమయంగా రామాయమ్మ.

ఈ నాలుగైదు రోజుల్లోనూ మనసుపాడ్చిన ఆ సామీలనుగురించి తానై ఏమీ అడగలేదు రామాయమ్మ.

"అంతే మరి!" అన్నాడు రాఘవేంద్రం, అంతా విశదీకరించాక.

అంతా విశదీకరించాడు. ఒట్టుకు ఒక్క విషయం దాచలేదు!!

"అమ్మో నా బిడ్డలో..." అని రోదిస్తూ నిద్రి స్తూన్న పసిపాపల్ని లేవదీసి గుండెలకు హత్తుకుంది గాఢంగా.

నమిలి మింగేలా చూసింది భర్తవేపు, ఆ ఆవేశం లోనే. ఓ క్షణం.

ఒక్క క్షణం మాత్రమే. తరు త్తరక్షణంలో నే ఎవరో కోటి కంఠాలతో తన చెవులో ఊదారు గాబోలు... 'పతియే ప్రత్యక్ష దైవం!' అని.

"మీరే చెప్పండి—"అంటూ, తన క్షణికా వేశాన్ని నిగ్రహించుకుని పశ్చాత్తాపంతో క్రుంగిపోయింది పాతాళానికి.

ప్రాణేశ్వరుడు నిరాధారంగా నిలబడి చేతులు దులుపుకోవడం చూస్తూండగానే లోకం తీరుతెన్నులు యథాతథంగా ఆమె కళ్ళ గావాన కాసాగాయి. లోకం తాను అనుకుంటూన్నట్లు—ఉగ్గూ పాలూ మారాలు లేకుండా పెళ్లికు త్రాగి బుద్ధిగా ఆడుకునే మంచి బాలుడిలా—సంచరించటం లేదు. ఇన్నాళ్లుగా తనకు తెలిసిన లోకం కాదిది. తనకు తెలిసిన మనుషులు కారు వీళ్లు. ఆటలపాటల పేరిట అస్తులు దోచు కుంటూరా లేకపోతే యింత అమానుషంగా! మహా నరకం ఓటున్నదని వీళ్ళ పెద్దలెప్పుడూ వీళ్ళకు వర్ణించి చెప్పలేదా?

రామాయమ్మ రామాయమ్మలా లేదు.

క్రమంగా అర్థం కాజొచ్చింది లోకం తప్పు కాదదిఅనీ, లోకం ఎప్పుడూ తన కృత్రిమ స్వభావా లతో అచంచలంగా యిట్లాగే ఉంటోందనీనీ. లోప మంతా చంచలస్వభావుడూ ముందుచూపులేనివాడూ అయిన తన భర్తదేననీని.

ఈ వేదన అంతా రోజులు గడుస్తూన్న కొద్దీ అగ్నిపర్వతంలా తనలో పేరుకుపోయింది. లోకంలో ఉన్న సహనాన్నే ఎరువుతెచ్చుకున్నట్లుగా కళ్ళు మూసుకుని అంతా భరిస్తూవచ్చింది. కాలక్రమాన పసుపూ—కుంకం పేరుచెప్పి తన పుట్టింటివారు ముట్ట జెప్పిందికూడా కరగడం ప్రారంభించాక, ముందు జాగ్రత్తకోసమైనా తాను కొంచెం ఓంకంగా నిలబడే అవసర పరిస్థితులు సంక్రమిస్తే తాత్కాలికంగా అవస్థ లనుసైతం అధిగమించాలని కఠోరంగా సంకల్పించుకుంది.

ఆ అవసరం రానేవచ్చిందీనాడు. తాను కూడా నీళ్లు కారిపోకుండా నిలబడి 'నీవా—నేనా' అని సవాలుచేసింది. ఆత్మీయమైన దివ్యప్రబోధాలను పవి త్రావల మహాలు దూసి పెనుకెరిని పెడుతూ, కిమ్మన కుండా పెనిమిటి 'నీ వెందుకూ...యింతేగదా... నేను చూసుకుంటాలే—' అన్న ధోరణిలో దనిపోవడానికి సంసిద్ధుడవడంతో, త్రొక్కి ఉంచిన సంస్కారం అంతా వెయ్యి ఏనుగుల బలంతో విజృంభించి భర్తను ప్రతిఘటనకు వేలా చేసింది.

భరివ్యక్తును పొందుపరచడానికి పైన భగ వంతుడు లేడా? అందుకోసం మూర్ఖురాలై క్రూరంగా తాను పెనిమిటినే బలి పెడుతుందా...భగవంతునిపైనే భారం వేసి నిద్రిస్తూన్న రాఘవేంద్రానికి కోటి నమ స్కారాలు చేసింది రామాయమ్మ! పాపం...!!

* * *

కంపెకర్ కంగారుగా పడుతున్నాడు. కొద్దిగా నుత్తునుంచీ కోలుకుని, ముందు కూర్చున్న డ్రైవర్ ముఖకవళికలు ప్రయాణీకులకు అవుపించటం లేదు. ప్రార్థించే ఆ దీనులపట్ల భగవంతుని దయ ఎంత పరిమాణంలో ప్రసరింపనున్నదో రామన్న క్షణాలే విశదం చేయాలి!

# బిరుదనామధేయములు

శ్రీ విక్రాల శేషాచార్యులు

జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః,
నాస్తి యేషాం యశఃకాయే జరామరణజం భయం.

బిరుదములచేతనే పిలువంబడెడు కవిపండితుల నెఱియుటకుముందు కొంచెము ఆ బిరుదముల స్వరూపమును చర్చించుట సమంజసము. కాన తదర్థము కొంచెము యత్నింతము.

ఆత్మజునకు జననీజనకులు బారసాలనాడు బంధుమిత్ర బృందము నెదుట హోమాదికార్యముల నెఱపి తమ పెద్దలయొక్కయో లేక యే యిష్టదైవము యొక్కయో గాకున్న నిష్టమైన యొక నామమును బియ్యమునందు వ్రాసిపెట్టి యాతని యొక నామాంకితు నెట్లు జేతురో అట్లే విద్వాంసునకు గాని, కవికి గాని పండితులు సభయందు సారస్వతచర్చ యొనర్చి యుచితమైన యొక బిరుదమును 1ముద్రిత పత్రముమీద వ్రాసి యొసంగి యాతని నొక బిరుదాంచితునిగఁ జేయుదురు. ఇది విద్వత్కవులకు విద్వత్కవుల సుహృత్తులైనవారు సలిపెడు ఒక నామకరణమని చెప్పదగు. నామకరణ మప్పుడు బంధువులు బిడ్డకు నాభరణాదులఁ జదివించునట్లు బిరుదప్రదానము నాఁడు పండితునకును సహృదయులు పండిత శాలువలు మొదలగువాటిని బహుమానముగ నొసంగెదరు. బిరుదములు విద్వాంసులయొక్క సామర్థ్యమునకు చిహ్నములు. ఎట్లన ?

శ్రీ కాశీ కృష్ణాచార్యులవారి పేరునకు ముందు తత్గ్రంథములయందు "అవధాని శిరోమణి" బిరుదు ప్రఖ్యాపనమునం దాదిత్యునికన్నను ముందుగ నరుణునివలె దృష్టమగుచుండు. శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులవారి కావ్యాంతములయందు "కింకవీంద్రఘటా పంచానన విద్వత్కవి బాలకళానిధి బాలసరస్వతీ శతావధాని" యను వారి బిరుదవాహిని కాశీ ప్రాంతమున గంగావాహిని తనువున దృష్టంబగుచుండు. మాతండ్రిగారు శ్రీ విక్రాల రామచంద్రాచార్యుల గారి పేరుతోటి "విద్యారణ్య పంచానన విద్యావాచస్పతి"యను వారి బిరుదద్వయము తద్గ్రంథముఖ్యుల శ్రీ మహావిష్ణుమూర్తితోటి తత్కర కమలములయందు శంఖచక్రములఁబలె పరిదృశ్యమానం బగుచుండు.

ఈ బిరుదములలో "విద్యారణ్యపంచానన", "కింకవీంద్రఘటాపంచానన", "అవధాని శిరోమణి" బిరుదములు మూడు పైఁజెప్పినవారికిఁ దప్ప మఱియేరికిని లేమిఁజూడ, రఘువంశమునందు—

హరిర్యథైకః పురుషోత్తమః స్మృతో
మహేశ్వరస్త్ర్యంబక ఏవ నాపరః,
తథా విదుర్మాం మునయశ్శతక్రతుం
ద్వితీయగామీ నహి శబ్ద ఏష నః.

అని రఘువుతో దేవేంద్రుఁడు పలికినమాట స్మరణమునకు వచ్చుచుండును.

సాహిత్యవిద్యాప్రవీణ లోనైనవియు బిరుదప్రాయములేయైనను అవి కళాశాలలయందు నిర్ణీతములైన గ్రంథభాగములఁ జదివి వాటిలోఁ బరీక్షలయందు తీర్ణులయినవారికి తదధికారులచేత దేయములై యున్నవి.

భారతదేశము ఖండాంతరవాసుల పాలనమునకు లోనై యున్నకాలము మొదలుకొని కొన్ని బిరుదములు దొరతనమువారినుండి గడించఁదగినవియైనవి. క్రీ. శ. 1887 వ సం॥మున జరిగిన విక్టోరియా జూబిలీ సందర్భమున ఇంగ్లీషు దొరతనమువారినుండి "మహామహోపాధ్యాయ" బిరుదము శ్రీ పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవార్లంగారు మున్నగు నలుగురు భారతవర్ష విద్వాంసులకు లబ్ధమైనది. (చూ. ఆంధ్రపత్రిక శుక్ల సంవత్సరపు ఉగాదిసంచిక పుట-270) కొన్ని ప్రసిద్ధములైన సభాసంస్థలచేత నొసంగఁబడునవిగ నున్నవి. అన్నింటిని వెనుక తెలిపెదను. "క్షితి మహారాష్ట్రభాషచేఁ జెప్పఁబడెడు ఛకరోక్తులు బిరుదులై పెక్కుదనరు" అని బిరుదములనుగురించి అప్పకవీయము చతుర్థాశ్వాసమునందు చెప్పబడినదికాని విద్వత్కవుల కొసంగబడెడి బిరుదములు ప్రాయికముగ సంస్కృతభాషామయములుగనే యుంటున్నవి. ప్రతివాదిభయంకర, విద్వజ్జన కోలాహల, కవిసార్వభౌమ కవిరత్నాదు లిందు కుదాహరణములు.

బిరుదములను ప్రాచీనులు వాడుచుండిరి కాని "బిరుద" శబ్దమునుమాత్రము తఱచుగ సంస్కృత

---

1. మహర్షులకు సదృశుఁడనియో (అభినవ వాల్మీకి.), పూర్వకవులకుఁ దుల్యుఁడనియో (అభినవ కాళిదాస.), లేక గొప్పవాఁడనియో, శ్రేష్ఠుండనియో (మహాకవి. కవిసిద్ధ.)ఇత్యాద్యర్థముగల బిరుదమును.

గ్రంథకర్తలు వాడినట్లు కానరాదు. 2సాహిత్య రత్నాకర3 వాసంతికా పరిణయాది కతిపయ గ్రంథములలో మాత్రము కనిపించుచున్నది.

బిరుద శబ్దము ఏ భాష? ఇది సంస్కృతశబ్దము కాదని తలఁచి సంస్కృత విదులే కొందరు దీనికి సంస్కృతములో నేమి పేరు కలదని ప్రశ్నింతురు. అట్లు కాదు. ఇది సంస్కృతపదము. అట్లు పూర్వోక్త వాసంతికా పరిణయ నాటకములో పంచమాంకమునం దొక శ్లోకముయొక్క అధోజ్ఞాపిక (ఫుట్ నోట్) లో తన్ముద్రాపకులు (మైసూరు శ్రీ ధర్మాధికారిచక్రవర్తి అయ్యంగార్, విద్యాతరంగిణీ ముద్రాశాలాధ్యక్షులు) కేశవ నిఘంటువునుంచి ప్రమాణమును వ్రాసియున్నారు. ఆ నాటక శ్లోకము, నిఘంటు శ్లోకమున్ను ఇవి:

సర్వే సన్తి జపంతి యోగిపురుషా
గాయంతి త్వమీ శోభనం
గంధర్వాప్సరసం నటంతి పురత
స్సౌరాజ్యవారాంగనాః,
దివ్యా వందిజనా స్తువంతి బిరుదం
దీపోత్సవం సంతతః
సూర్యా ద్వాదశ సాధయన్తి సుగయా
చంద్రో భువం సించతి."

"సపత్న విజయ ఖ్యాతి-చిహ్నం
బిరుదమస్త్రియామ్."

అని. ఆంధ్రభాషార్ణవము 2 వ కాండ క్షత్రియ వర్గమునందు పవాడమున కర్థముగ నీశబ్ద మియ్యబడియున్నది. "బిరుదము బిరుదనఁ బవాడ మనఁగను బరగు నధవ!" (ప. 193)

శ్రీ బ. సీతారామాచార్యులగారు శబ్దరత్నాకరమునందు - సంస్కృతము పుల్లింగమని వ్రాసియున్నారు. బిరుదమనది దీని వైకృతము. (చూ. శబ్దరత్నాకరము) వాచస్పత్యమంతటి బృహదభిధానమ్మున వ్రాయమికిఁ గారణము చింత్యము.

బిరుదమునకు బదులు పూర్వము పదశబ్దము, నామశబ్దము, దానిపర్యాయములు వాడఁబడునట్లు బహుగ్రంథ పర్యాలోచనవలన తెలియుచున్నది. పద ప్రయోగమున కుదాహరణము—భవభూతి మహావీర చరిత్ర నాటకము ప్రథమాంకమున ప్రస్తావనయందు, "......తత్రకేచి త్తైత్తిరీయాః......పవిత్రకీర్తేర్నీల కంఠస్యాఽఽత్మసంభవః శ్రీకంఠపద లాంఛనో భవభూతిర్నామ జాతూకర్ణీపుత్రః కవి......" ఇత్యాది. ఇచ్చట శ్రీకంఠ శబ్దమునకు "శ్రీర్భారతీ కంఠే యస్య స ఇతి పదభూషణోఽర్థాత్ శ్రీకంఠోపాధికః." అని శ్రీ జీవానంద విద్యాసాగర భట్టాచార్య రచిత టీక. ఉత్తరరామచరిత్రమునం దాపదమునకే రామచంద్ర బుధేంద్ర విరచిత భావబోధినీవ్యాఖ్యః "శ్రీకంఠ పద లాంఛనః లాంఛనం పరిచాయకం చిహ్నం విశేషణ మితియావత్. శ్రీర్వాగ్దేవీ కంఠే యస్య శ్రీకంఠః శ్రీకంఠ ఇతిపదం లాంఛనమస్య శ్రీకంఠ పదలాంఛనః శ్రీకంఠ విశేషణక ఇత్యర్థః."

అనఁగా రెండుగ్రంథముల యందలి శ్రీకంఠ పదలాంఛన శబ్దమునకు శ్రీకంఠుఁడను పదము చిహ్నముగాఁగలవాఁడని తాత్పర్యము. శ్రీకంఠుఁడన శ్రీయన వాగ్దేవత సరస్వతి. ఆమె కంఠమునఁగలవాఁడని యర్థము.

నామశబ్దమును వాడుట కుదాహరణము — ప్రపన్నామృతము 34 వ అధ్యాయమున భగవద్రామానుజులవారికి భారతీదేవి భాష్యకార బిరుదము సమగ్రహించిన ఘట్టము:

ఇత్యంగీకృత్య వాగ్దేవీ శ్రుత్యర్థం తేన భాషితం,
తస్యాఽకరోద్భాష్యకార ఇతి నామ ముదా తదా.

అని.

బిరుదమునకు పర్యాయ (బదులు) నామములు:- గుణ నామధేయమనియు ఉపనామమనియు ఉపాధియనియు మరిమూడు పేళ్ళుగలవు. గుణనామధేయమునకు ఉదా: వేదాంత దేశికుని సంకల్ప సూర్యోదయ నాటకము 1 వ అంకము ప్రస్తావనలో—సూత్రధార వాక్యము—"కవితార్కిక సింహ ఇతి ప్రఖ్యాత గుణ సమాఖ్యః" అని. సమాఖ్యా నామధేయం ప్రఖ్యాతగుణ నామధేయః అని తద్వ్యాఖ్యా ప్రభావలీ. కవితార్కిక సింహః అని ప్రఖ్యాతమైన గుణనామధేయము గలవారని యర్థము. ఉపాధిశబ్దప్రయోగమున కుదా:-శ్రీమాన్ మాతండ్రిగారి విద్యావాచస్పతి బిరుదపట్టాలో "నవద్వీప బుధైః ప్రీతై స్సద్గుణగ్రామదర్శనాత్, విద్యావాచస్పతీత్యేషోపాధి రస్మై ప్రదీయతే" అని. ఉపనామ పదప్రయోగమున కుదాహరణము:- పైదాని యందే, "న్యాయ పంచానన తర్కతీర్థోపనామక శ్రీ శశాంకభూషణ శిరోమణి శర్మభిః." అని. కనుక బిరుదము పదము గుణనామము ఉపనామము ఉపాధి విశేషణము అను నీ నాలుగు నేకార్థ వాచకములు.

బిరుదార్హులు:—పాండిత్య పాటవము చేత పండితులకు వలెనే వితరణ వీర్యాదిగుణ ప్రకర్షముచేత ప్రశస్తులైన వారికిని బిరుదము లొసంగఁబడును.

---

2. వారాణసీ ధర్మసూరి. 3. శ్రీవట్ శఠారి యతీశ్వరరచితములు.

వితరణ ప్రకర్షమున కుదాహరణము: విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులవారు. ఇందు తొలి రెండు బిరుదములు వితరణ విషయకములు. కళాప్రపూర్ణ పదము విద్యావిషయక మైనది. వీరియందు త్యాగ విద్యలు రెండును నెలకొనియున్నందున తత్సంబంధములగు నుభయవిధ బిరుదములు విలసిల్లినవి.

బలాతిరేకమున కుదాహరణములు: అభినవ భారతభీమ, ఆంధ్ర వీరకంఠీరవ, జగదేకవీర, మల్లమార్తాండ, మల్లరాజతిలక, వీరజయ హనుమాన్ శ్రీ కోడెరామమూర్తి నాయుడు గారు. ఇవి యన్నియు వారి వారి విజ్ఞాన దానశక్తి ప్రముఖ గుణస్ఫోరకములు!

బిరుదములు కొన్ని వారి వారి కవిత్వ పాండిత్యాదులఁ దిలకించి పండితులు సభలఁ బరీక్షించియు తత్సామర్థ్య స్ఫోరకముగాఁ గల్పించి యిచ్చునవిగ నున్నవి. కాన నప్పుడప్పుడు క్రొత్తవి కూడ నుదయించుట కలదు. ఇప్పటి కుదయించిన బిరుదపుంజములో కొన్నింటి నిటఁ జేర్కొనుచున్నాను. సమయోద్ధండ కోలాహల, షడంగవేదజ్ఞ, శ్లేషయమక చక్రవర్తి, సంబుద్ధాగమ చక్రవర్తి, శాస్త్రవాచస్పతి, విద్యా వాచస్పతి, విద్యారణ్య పంచానన, విద్యార్ణవ, విద్యానాథ, విద్యానిధి, విద్వన్మణి, విద్యాలంకార, విద్యాసాగర, విమర్శకాగ్రేసర, విద్వత్కవి చక్రవర్తి, వాదికేసరి, బాలసరస్వతి, బాలకళానిధి, ప్రౌఢసరస్వతి, పండితరాజ, ప్రతివాదిభయంకర, కవిసింహ, కవికుంజర, కవిసార్వభౌమ, కవిశేఖర, కవితిలక, కవిరత్న, కవిభూషణ, కవివల్లభ, కవికంఠీరవ, కవిగండభేరుండ, మహాకవి, ఉపన్యాసభూషణ, అభినవపండితరాజ, అభినవభట్టబాణ, అభినవ కాళిదాస, అభినవవ్యాస, అభినవ వేదాంతాచార్య, అభినవనిగమాంతాచార్య, విద్యాసాగర, కవితార్కికసింహ, కవితార్కిక కంఠీరవ, కవివైద్యపురందర, కవిగణక సార్వభౌమ, అనుష్టుప్ చక్రవర్తి, సంబుద్ధాగమ చక్రవర్తి, కావ్యరత్న, వేదాంతరత్న, వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతి, తర్కవాచస్పతి, విద్యాభూషణ, తర్కవాగీశ, తర్క వేదాంతభూషణ, బ్రహ్మతంత్రస్వతంత్ర, కావ్యవ్యాకరణతీర్థ, తర్కవ్యాకరణతీర్థ, కావ్యస్మృతితీర్థ, కావ్యతీర్థ, స్మృతితీర్థ, తర్కతీర్థ, న్యాయరత్న, స్మృతిరత్న, దైవజ్ఞరత్న, దైవజ్ఞ సింహ, దైవజ్ఞ వాచస్పతి, సాహిత్య సరస్వతి, వేదార్థ వాచస్పతి, జ్యోతిషాయుర్వేద విద్వాన్, సాహిత్యాచార్య, వ్యాకరణాచార్య, సాహిత్యవిశారద, సాహిత్యశిరోమణి, వ్యాకరణ శిరోమణి, భిషగ్వర, ఆయుర్వేదాచార్య, ఆయుర్వేద భూషణ, మహామహోపాధ్యాయ, వైద్యరత్న, పండితరత్న, భారతరత్న, కావ్యకంఠ, కళానిధి, కళాప్రపూర్ణ, వ్యాఖ్యానవాచస్పతి, పండితసార్వభౌమ, పండితమార్తాండ—మొదలుగాఁ గలవి.

వివిధ సంస్థలచేతను నియ్యఁబడు బిరుదములు కొన్ని:

సర్వతంత్ర స్వతంత్ర, సమయోద్దండ కోలాహల, సంబుద్ధాగమచక్రవర్తి, సాహిత్య సరస్వతి, షడంగ వేదజ్ఞ, శాస్త్రవాచస్పతి, విద్యావాచస్పతి, విద్యారణ్యపంచానన, విద్యార్ణవ, విద్యానిధి, విద్యాసాగర, విద్యాలంకార, విద్యానాథ, విద్యాభూషణ, వైదికసార్వభౌమ, విద్వన్మణి, విద్వత్సింహ, వ్యాఖ్యానవాచస్పతి, వేదార్థవాచస్పతి, వేదాంతవాచస్పతి, వేదాంతభూషణ, విద్వత్కవిచక్రవర్తి, వాదికేసరి, వైయాకరణ పంచానన, ప్రౌఢసరస్వతి, బాలసరస్వతి, బాలకళానిధి, బాలవాల్మీకి, ప్రతివాది భయంకర, పండితరాజ, పండితసార్వభౌమ, పండిత మార్తాండ, తర్కవాగీశ, తర్కవాచస్పతి, బ్రహ్మతంత్రస్వతంత్ర, కార్తాంతికాగ్రేసర, కళానిధి, కళాప్రపూర్ణ, కవికుంజర, కవితిలక, కవిరత్న, కవిశేఖర, కవిభూషణ, కవివల్లభ, కవిసింహ, కవికంఠీరవ, కవిరాజ, కవిసార్వభౌమ, కవిచక్రవర్తి, కవిచూడామణి, కవిశిరోమణి, కవిసమ్రాట్, కవితాకోవిద, కవితాకళానిధి, కవితాచతురానన, చతుర్విధ కవితా చతురానన, మధురకవి, మహాకవి, మహాకవిశిరోమణి, బాలకవి, ప్రౌఢకవి, సరసకవి, చిత్రకవి, విశ్వకవి, మహాకవి, కవిరాజశిరోమణి, కవివైద్యపురందర, కవితార్కికసింహ, కవిగణక సార్వభౌమ, జ్యోతిషాయుర్వేద విద్వాన్, దైవజ్ఞ వాచస్పతి, ఉపన్యాసభూషణ, తర్క వేదాంతభూషణ, సభాభూషణ, అభినవపండితరాజ, అభినవవ్యాస, అభినవవాల్మీకి, అభినవ కాళిదాస, అభినవ వేదాంతాచార్య, అభినవనిగమాంతాచార్య, దైవజ్ఞ సింహ, దైవజ్ఞరత్న, దర్శనరత్న, సాహిత్యరత్న, కావ్యరత్న, వేదాంతరత్న, న్యాయరత్న, స్మృతిరత్న, పండితరత్న, వైద్యరత్న, తర్క తీర్థ, కావ్యతీర్థ, స్మృతితీర్థ, తర్కవ్యాకరణతీర్థ, కావ్యవ్యాకరణతీర్థ, కావ్యస్మృతితీర్థ, సాహిత్యాచార్య, వ్యాకరణాచార్య, వేదాంతాచార్య, ఆయుర్వేదాచార్య సాహిత్య శిరోమణి, వ్యాకరణశిరోమణి, సాహిత్యవిశారద, సాహిత్యవిద్యాప్రవీణ, వ్యాకరణవిద్యాప్రవీణ, (ఉభయ) భాషాప్రవీణ, ఆయుర్వేదభూషణ, భిషగ్వర, మహోపాధ్యాయ, మహామహోపాధ్యాయ, విద్వచ్చూడామణి, విమర్శకాగ్రేసర, విమర్శకశిరోమణి, శ్లేషయమక చక్రవర్తి, సుధీమణి మొదలైనవి.

బిరుదముల వాడికలోని విధము :— ఈ బిరుదములను గ్రంథములలో శ్లోకములయందుఁ గాక సర్గాద్యంతముల చివర నుపయోగించుటయందు మూఁడు విధములు కనుపించుచున్నవి. ఎట్లన ? 1. పేరుకుముందు. 2. పేరుకు వెనుక. 3. పేరుకు నిరుప్రక్కలను. తొలి విధమున కుదాహరణము— ఇతి శ్రీపదవాక్యప్రమాణపారావారపారీణ మహామహోపాధ్యాయ కోలచల మల్లినాథసూరి విరచితాయాం సంజీవనీ సమాఖ్యాయాం రఘువంశ వ్యాఖ్యాయాం...సర్గః.—అని. ఇందులో మల్లినాథశబ్దము నిజనామము. కోలచలశబ్దము ఆంధ్రదేశ సంప్రదాయసిద్ధమైన ఇంటిపేరు. సూరిశబ్దము పండితశబ్దపర్యాయము. కాగా మిగిలిన రెండును బిరుదములు. 2. రెండవ రీతికి నుదాహరణము — ఇతి శ్రీ తారానాథ తర్క వాచస్పతి భట్టాచార్య సంకలితే వాచస్పత్యే బృహదభిధానే......శబ్దార్థ సంకలనం - అని. ఇచ్చట తారానాథ యనునది గ్రంథకర్తృనామము. వెనుకటి రెండు పదములు ఆయన బిరుదములు. 3. మూఁడవ విధమున కుదాహరణము—ఇతి శ్రీ కవితార్కికసింహస్య సర్వతంత్రస్వతంత్రస్య శ్రీమద్వేంకటనాథస్య వేదాంతాచార్యస్య కృతిషు యాదవాభ్యుదయే మహాకావ్యే... సర్గః అని. ఈ గద్యమునందు శ్రీమద్వేంకటనాథశబ్దము కవినామధేయము. దీనికి ముందటి రెండు వెనుకటిది యొక్కటియు బిరుదములు. ఈ యుదాహరణములలో మొదటి యుదాహృతింబట్టి తొలుత బిరుదములను వెనుక పేరునున్నా కలిపి ఒకటే సమాసముగఁ గూర్పంబడినది యనియు, రెండవ యుదాహృతింబట్టి మొదట పేరు దాని వెనుక బిరుదములును, కలిపి యొకటే సమాసముగ నుకువంబడినది యనియు, మూఁడవ యుదాహరణముంబట్టి బిరుదములకు బిరుదులు స్వనామమున్ను వేరు వేరుగ విభక్తులతోటి ప్రతిపాదితమైనవి యనియు, పేరు కిరుపార్శ్వములను బిరుదములు గలవనియు తెలియంగవలెను. కొందరు ముందువెనుకల బిరుదములను మధ్యమున స్వనామము నునిచి సమస్తపదముగ వాడెదరు. ఎట్లన? శ్రీమాన్ మాతండ్రి గారికి నవద్వీపములో ది ఆనరబులు జస్టిస్, సర్. ఆశ్ తోష్ ముఖర్జీ, సరస్వతీ, సంబుద్ధాగమ చక్రవర్తీ, శాస్త్రవాచస్పతి, విద్యార్ణవ, కె. టి. సి; ఎఫ్. ఆర్. ఎం.ఎ. సి. ఎల్ ; డి. ఎస్. సి; పి. హెచ్. డి; యఫ్. ఆర్. డియస్. యఫ్. ఆర్. యస్. ఇ. యఫ్. ఎ. యస్. బి; ఇత్యాది, వైస్ ఛాన్సలర్ కలకత్తా యూనివర్సిటీ; ప్రెసిడెంటు, నవద్వీపవంగవిబుధజననీసభ గారు మున్నుగాగల నవద్వీప వంగవిబుధ జననీసభలో నొసంగిన "విద్యావాచస్పతి" సర్టిఫికేటు పట్టా (ఇది ముద్రితమైనది) లో చేవ్రాలుచేసిన విద్వన్మహాశయులలో "మహామహోపాధ్యాయ శ్రీ సీతారామన్యాయాచార్య శిరోమణి శర్మభిః" అని యొక పండితరత్నముయొక్క హస్తలిపి.

ఇట్లు బిరుదముల పెన్నివిధముల వాడుకొనినను ప్రాచీనాధునికు లందరు తమ పేళ్లకిడక వాటిని ఆదిమధ్యాంతములలో నొకచోట పొందుపరచియే యున్నారు. ఇకను ప్రాక్తన విద్వత్కవీంద్రులలోఁ గొందరు చిన్ననాఁడు తండ్రిపెట్టిన పేరు చెప్పటను పేర్కొనకయే విద్వద్దత్తమైన బిరుదు నే గ్రంథములలో చేర్కొని యున్నారు. కాన వారిని యా బిరుదములతో నే మనము పిలుచుచున్నాము. ఇది గమనింపదగిన యంశము. వా రట్లొనర్చుటకుఁ గారణము బిరుదములయందలి మక్కువతో వాటితో నే (బిరుదములతో నే) తాము వ్యవహృతులు కావలయునని కానోపు. ఇట్టివారలలోను గగణ్యుఁడు కవిరాజపండితుఁడు. ఇకనుఁ గొందరు స్వనామాదికము గ్రంథములలో పలఁ జేర్కొనినను అధ్యాయాదివ్యపదేశగ్రంథాంశములచివరయందును, గ్రంథసమాప్తియందును, గద్యములలో గుణనామధేయముగ బిరుదము నే వ్యవహరించిరి. అక్కతన వారును బిరుదనామముతో నే పిలుఁబడుచున్నారు. ఇట్టివారిలో వ్యాసమహర్షి మొదటివాఁడు. మఱి కొందరు నిజనామములను బిరుదనామములను రెంటిని తమ కృతులయందు వాడియున్నను వారిని బిరుదములతో నే వ్యవహరించుచున్నారు. దీనికిఁ గారణము వా రాయా శాస్త్రములయందుఁ గావించిన యసదృశమగు పఠన పాఠనప్రచారములే కారణము. వేదాంతదేశికు లట్టివారు. ఇట్లు ముత్తెఱంగులను బిరుదములచేత నే చెప్పఁబడుచుండెడు ప్రాక్తన పండితకవిప్రకాండముల నా యెఱింగినంతవరకు వ్రాయబూనుచున్నాను.

## వ్యాసుడు (వేదవ్యాసుడు)

ఇమ్మహర్షి యొక్క నామధేయము ద్వైపాయనుఁడు, కృష్ణద్వైపాయనుఁడు అని. ముందు ఒక్కటిగ నున్న అనంతమైన వేదమును కలియుగమునందు మానవులయొక్క ఆయుఃశక్తినిఁ గాంచి కనికరముతో వారికిఁ జదువశక్యముగా విభజించినందున నీ నామధేయము గలిగినది. ఇందుకు మహాభారతము ఆదిపర్వము 63 వ అధ్యాయము:

ఏవం ద్వైపాయనో జజ్ఞే సత్యవత్యాం పరాశరాత్,
న్యస్తో ద్వీపే సయద్బాలస్తస్మాద్ద్వైపాయనః స్మృతః.
పాదాపసారిణం ధర్మం సతు విద్వాన్యుగే యుగే,

ఆయుశ్శక్తించ మర్త్యానాం యుగానుగ మవేక్ష్యచ.
బ్రాహ్మణో బ్రాహ్మణానాం చ తథాఽనుగ్రహ
కాంక్షయా,
బిభేద వేదా న్యస్మాత్తస్మాద్వ్యాస ఇతి స్మృతః.

అని. వ్యాసుఁడనినను వేదవ్యాసుఁడనినను వేదములను విభజించినవాఁడని యొక పేరర్థము. ఈయన 28 వ ద్వాపరమున (అనఁగా మొన్నటి ద్వాపరముననే) వేదవిభజన జరిపెను. ప్రతిద్వాపరాంతమునందు నొక్కొక్క మహర్షి నారాయణాంశమునఁ బుట్టి వేదములను విభజించుచుండునని పురాణములు ప్రతిపాదించుచున్నవి. ఇది వైవస్వత మన్వంతరమునందు 28 వ మహాయుగము. కాన మొన్నటి ద్వాపరము 28 వది. కాఁగా ఇంతవఱకు 27 ద్వాపరములు కడచినవి. కాన 27 మంది మహర్షులు వేదములు విభజించి వ్యాసశబ్దము నొందియున్నారు. వారు శ్రీవిష్ణుపురాణము 3వ అంశము 3 వ అధ్యాయమునందు ప్రతిపాదితులైయున్నారు. వ్యాసవిస్తరభీతిచేత శ్లోకములను వదలి వారిపేళ్ళు మాత్రము వ్రాసెదను. 1. స్వాయంభువుడు 2. ప్రజాపతి 3. ఉశనస్సు 4. బృహస్పతి 5. సవిత 6. మృత్యువు 7. ఇంద్రుఁడు 8. వశిష్ఠుఁడు 9. సారస్వతుఁడు 10. త్రిధాముఁడు 11. త్రివృషుఁడు 12. భరద్వాజుఁడు 13. అంతరిక్షుఁడు 14. ధర్ముఁడు 15. త్రయ్యారుణి 16. ధనంజయుఁడు 17. కృతంజయుఁడు 18. సంజయుడు 19. భరద్వాజుఁడు 20. గౌతముఁడు. 21. ఉత్తముడు. ఈయనకు నామాంతరము హర్యాత్మ. 22. వేనుఁడు. నామాంతరము వాజశ్రవుఁడు 23. సోమశుష్మాయనుఁడు. నామాంతరము తృణబిందువు. 24. ఋక్షుఁడు. నామాంతరము వాల్మీకి. 25. శక్తి 26. పరాశరుఁడు 27. జాతూకర్ణి అని. వీరిలో వసిష్ఠ శక్తి పరాశరులు వ్యాసుల వారికి వరుసగ ప్రపితామహ పితామహపితరులు. కనుక వ్యాసులును వారి పితృ పితామహ ప్రపితామహులును వంశక్రమముగ నిట్లు గొప్ప విద్యాధికారము నొందుట విశేషము.

మున్నిందఱు మునులు వ్యాసులుగ వచ్చియుండినను ప్రకృతచర్చ్యమానుఁడైన వ్యాసుఁడే (కృష్ణద్వైపాయనుఁడే) వ్యాస వేదవ్యాసశబ్దములచేత వ్యవహృతుఁడగుచున్నాఁడు. అందుకుఁ గారణము—పైవారు తమ గ్రంథములలోను, గ్రంథాంత గద్యములలోను, తమకు వ్యాసనామము నుగ్గడించుకొనమియు, మనకత్యంత చిరకాలమునాటి వారగుటయు, రెండవది ఇఁకనుఁ కృష్ణద్వైపాయనుఁడన్ననో మనకు సమీపకాలములోని వారు, తమ గ్రంథములలోపల స్వప్రథమనామ బిరుద నామములఁ జెప్పి, గద్యములలోను "ఇతి శ్రీ మన్మహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం...పర్వణి ... అధ్యాయః" అనియు, "ఇతి శ్రీమద్భాగవతే పారమహంస్యాం సంహితాయాం వైయాసిక్యాం ... స్కంధే ... మహాపురాణేఽష్టాదశసాహస్రికాయాం" అనియు తనను వ్యాసశబ్దముతోఁ జెప్పుకొనుటయు, వింకను మహాభారతమువంటి ఉద్గ్రంథమును పురాణాది శాస్త్రములలో ననేక గ్రంథముల రచించుటయుఁ గారణములుగా నందరిచేతను వ్యాసవేదవ్యాసశబ్దములచేతనే చెప్పఁబడుచున్నారు. గ్రంథాంతగద్యములయందు తనను వ్యాసశబ్దముతోనే పేర్కొనినను గ్రంథప్రారంభములలోఁ దనజన్మవృత్తాంత ప్రథమనామములనుఁ దెలిపినందున అనేక వ్యాసస్థితి నెఱింగిన పండితులకు తన గ్రంథములఁ గుఱించి యే వ్యాసుఁడో యన్నసందియము శంకోదయమునకు నవకాశములేని యట్లొనర్చెను. వీరియొక్క నామములు—వ్యాసః, వేదవ్యాసః, కృష్ణః, కృష్ణద్వైపాయనః, ద్వైపాయనః, బాదరాయణః, సాత్యవతేయః, పారాశర్యః అని కలవు. ఇన్ని పేళ్లలోను ఈ మహానుభావుఁడు వేదవ్యాసపదముతోనే పిలువఁబడుచున్నాఁడు. ఈ మహర్షి పరమేష్ఠి రచియించిన గ్రంథములు—18 మహాపురాణములు ఇవి బ్రాహ్మ పాద్మ భాగవత నారద గారుడ వైష్ణవ వారాహ వామన మాత్స్య కౌర్మ శైవ లైంగ స్కాంద బ్రహ్మాండ బ్రహ్మవైవర్త భవిష్య మార్కండేయాగ్నేయములు అనునవి—19. మహాభారతము 20. బ్రహ్మ (వేదాంత) సూత్రములు 21 వ్యాసశిక్ష 22 వ్యాససిద్ధాంతము 23 వ్యాసస్మృతి. ద్వాపరయుగ సంజాతులగు వీరు స్థిరజీవులని శాస్త్రములు నుడువుచున్నవి.

## విద్వజ్జన కోలాహలుడు

ఈయన పేరు ఆక్కియాళ్వాను. శ్రీరామానుజుల పరమాచార్యులైన యామునాచార్యుల (ఆళవందార్) వారికి ప్రతివాదియై చివరకు వారి శిష్యుఁడైనవాఁడు చోళరాజ గురువు. యామునాచార్యుల జననము క్రీ. శ. 916 జులై 16 ది. కాన ఈయనయు నాశతాబ్దిలోనివాఁడే యగును. చరిత్రముల విన్నాము తప్ప ఏతత్కృతమైన గ్రంథ మెద్దియు కానరాదు.

[సశేషము]

# అగుమంచి అబ్బురపు పాత్ర

శ్రీ ఆరుద్ర

ఆంధ్ర ప్రజానీకంలో అశేషప్రచారంగల కాటమరాజు కథకి ఈ అగుమంచికథ అనుబంధగాథ. ఇది ఇంతవరకు పుస్తకరూపంలో అముద్రితం. దీనిని శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు పరిష్కరించగా, పండితుల పత్రిక 'పరిశోధన'లో వరుసగా మూడు సంచికలలో దాని సంపాదకులు ప్రచురించారు. వాళ్ళకి కృతజ్ఞతతో అసలు కథనీ, అనుబంధ గాథనీ సమన్వయపరచడానికి మొదట ప్రయత్నిస్తున్నాను.

అగుమంచి అన్నల చెల్లెలు. ఆమెని 'అక్కన్న' అనికూడా పిలిచేవారు. ఆమె అలవల్లురాజు మనుమరాలు. పెద్దిరాజు ముద్దులకూతురు. కాటమరాజుకి స్వయంగా కాకపోయినా, సవతిచెల్లెలు.

కాటమరాజు కథ గంభీరమైన సాగరమైతే, అగుమంచికథ అందులోని సుడిగుండంలాగ నిరంతర సంచలనంతో కూడుకొన్నది. సమరంసాగే సమయాల్లో సాధ్వి మనస్సులోని సంక్షోభానికి అగుమంచి కథ సంకేతం.

అగుమంచి మగనాలు. భర్తపేరు పుత్తమరాజు. అతడామె మేనత్తకొడుకే, మంచి పరాక్రమశాలి. అతని గురించి 'భట్టు రాయబారం'లో ఇలాగుంది:

"పుత్తమరాజు తా నుక్కు కంబమును
వయినాన దన్నెను వగి నొక్క వాడు
కక్కసపు వైరుల—కడుపులు చించి
చెనగిన పగవారి—చర్మను లొలుచు.
...........................
...........................
పుత్తమ రాజొకడు పోరిలో సిద్ధి
భూవరుదశమంత పోరిగొనజాలు."

అగుమంచి కొక్కడే కొడుకు. అతని పేరు పోచయ్య. పల్నాటియుద్ధంలోని బాలచంద్రుడిలాగ ఈ పోచయ్యకూడా సానుభూతి పాత్రమైన బాల పాత్ర. బాలచంద్రుణ్ణి ఎవరో దెప్పి పొడిచినందుకు యుద్ధానికెళ్ళి సంకులసమరం చేసినట్టే, ఈ పోచయ్య కూడా, వేరెవరోకాదు మేనమామ కాటమరాజే ఏనాడో దెప్పి పొడిచిన మాటలు జ్ఞప్తి తెచ్చుకొని, భీకరయుద్ధంచేసి పగవాళ్ళ తలలు కొట్టితెస్తాడు... ఈ బాలుడికి వివాహమైంది. మేనమామ అయితమ రాజు కూతుర్ని సిరిగిరిచే ఇతడికిచ్చారు. ఈ సిరిగిరి యాదవు లందరిలోనూ చదువుకొన్నది. 'కోటిపాటి తాటివృక్షము తెచ్చె కథలో'"...పార్సి...తెలుగు సరవంబును...చెలగి కన్నడమును జదివె నాగరము' అని ఛప్పన్న దేశీయభాషలు ఆమెకు వచ్చునని కవి చెప్తాడు.

పేర్కొకాక అగుమంచికి చాలామంది దగ్గర బంధువు లున్నారు. వాళ్ళగురించి పోనుపోను తెలియచేకూలిగాని ఇప్పుడే చెప్పినందువల్ల, మందలో గోవుల్లాగ అందరూ కలిసిపోయి, విడిగా విస్పష్టంగా గుర్తించడానికి వీలుండదు.

అగుమంచి నిర్మొగమాటపు మనిషి. నిష్ఠూర మెచ్చినాసరే నిజం నిర్భయంగా చెప్పగలదు. అఘాయిత్యపు మాటలైనాసరే అంతరంగంలో అనుకొన్నది ఆమె బయటకు చెప్పగలదు.

అగుమంచి అసలు స్వభావం 'కోటిపాటి తాటి వృక్షం తెచ్చేకథ'లో మనకు కనబడుతుంది. నెల్లూరు సిద్ధిరాజులతో యుద్ధం తప్పదని నిశ్చయించుకొన్నాక కాటమరాజు కమ్మలు వ్రాయించి ధనకొండలో నున్న సవతితమ్ముడు అయితమ రాజుకి పంపించాడు. ఆ జాబుని అంతరంగికుల సమక్షంలో అయితమ రాజు చదివించాడు. కొడుకుని కదనానికి కదలిరమ్మని కాటమరాజు కోరినందుకు అయితమ రాజు కన్నతల్లి సిరిదేవి మూర్ఛపోయింది. అప్పుడు అగుమంచి ఇలా అన్నది:

"కటకటా యోయమ్మ—కడుదైన్య పడుచు
నిటువలె మూర్ఛబో—నేటికి నీకు
పరగనక్షీణమునకు—బంపినీ కిపుడు
పరికింప వలనన్న—పగవాడు వారె
నేరాలి కొడుకును—వేడుక జూచి
మారుభూమికి నంప—మన పిట్టు నిలిచె
నీ కన్న కొడుకైతె—నీవు అంపుదవ
యా కాటభూపాలు—నంపితి గాక
...........................
ఇతని బొమ్మనగనే—యటు మూర్ఛవచ్చె
నతని బొమ్మన నోరు—ఆడె నే తల్లి!"

అగుమంచి ఆడిన ఈమాటలకు జవాబేమీ చెప్పలేక, మూర్ఛ తెప్పరిల్లి నందుల సిరిదేవి శివుణ్ణి తిట్టింది. అయితమరాజు దండు కదలి కాటమరాజుకి సహాయం వెళ్లాడు. వెళ్ళేటప్పుడు అతడు:

"అన్నల చెల్లెల అనుమంచి వినరో!
యన్నమందకు మేము అరుగంగవలయు
నిది మొదల్ శివరాత్రి యిటవచ్చుదాక
బదిలముగ దనకొండ పాలించు నీవు"

—అని రాజ్యభారము ఆమె మీద పెట్టి పోయాడు. ఆమె ఎలాగ పాలించిందో వివరించేదే అనుమంచి కథ. ఇది సూటిగా తేటగా సుందరంగా ఉంటూ, యుద్ధం జరిగేటప్పుడు రాణివాసంలోని ఆరాటాన్ని బాగా చిత్రిస్తుంది. తన బంధువులంతా యుద్ధంలో చిక్కుకున్నారే అన్న తపన, వాళ్ళ కేమవుతుందో అన్న బాధ అడుగడుగునా అనుమంచి పాత్రలో అనుమంచి కథలో మనకు కనబడుతుంది. బెంగ, భయం, నిరాశ, నిస్పృహా ఆమెని ఆవేశించినట్టు కనబడుతుంది.

"దిన దిన వార్తలు దినచరులచేత
ననువొంద నంపెద నక్కరో! నీకు
బాలేటివార్తలు—పావురాలచేత
నైకొంచె లేఖలు—వ్రాసి యంపుదును
నేనుండి శివరాత్రి—నెలవున మెరిగి
మాన కేతుంతురు—మనము జంగాలు
వసియుల కన్నంబు—వసి దృష్టిగాను
దనయక యంపింము—తగ వేడ్కతోన."

—అని చెప్పి అయితమరాజు యుద్ధానికెళ్ళాడు. శివరాత్రి వచ్చింది, కాని మంచలో నున్న బంధువుల వార్తలు రానందున అనుమంచి మనస్సు మనస్సులో లేదు. అయినా అయితమరాజు చెప్పినట్టు ఆమె శివరాత్రి చేయించింది. ఏ లోపం రానివ్వకుండా మనము జంగాలకీ అయ్యగార్లకీ సమారాధన చేయించడమే కాక తాను స్వయంగా, "...చెలువైన పచ్చళ్ళ శాకపూరలను ప్రకటముగ వడ్డించె పణతి యనుమంచి!"

శివరాత్రినాడు దేవుణ్ణి పూజించడానికి గుళ్ళోకెళ్ళింది.

"'అన్నలు చేసెడి యస్తార వ్రతము
సమ్మతి నే జేయ సమకూడి వస్తి
నను కృపజూడు పన్నగరాజహార!'
యని వేడగా నంత నా లింగమునకు
తన రూపు తీరెల్ల దప్పె నా క్షణమె
రౌజ్జని వస్త్రముపై యేర్పడియుండె"

ఇది చూసి అనుమంచి భయపడింది. కలకంఠుడిప్పుడు కళ తప్పినందుకు ఫలితంగా

"రణరంగమందలి రక్తంబు పారి
యీ గంగ రేవున కెగదట్టకున్నె."

—అని భావించింది. ఎక్కడి ఎరగడ్డపాడు? ఎక్కడి దనకొండ. అప్తులు మరణించి, అక్కడి రక్తం ఇక్కడికి ఎగదట్టవచ్చుని ఆమె ఆరాటపడింది. ఈ సంగతి చుట్టూతా ఉన్నవాళ్ళకి దాచుకోకుండా చెప్పేసింది.

అడుగడుగునా అనుమంచికి దుశ్శకునాలే కనబడ్డాయి. తలంటు పోసుకోబోతే, ఆమెకోరకు తెస్తున్న తలనూనె ద్వారబంధం తగిలి చిందింది. స్నానమాడాక, అన్నలిచ్చిన చీరలు సొమ్ములు ధరించాలనుకొంది.

"ఆలోన నప్పుడు ఆ చీరనగలు
కళ దూసి వహిమెడి కాన్పించె నంత."
"కలకంఠి యది చూచి కడు చిన్నబోయి
నా తల్లి వినవమ్మ నా యన్నలిడ్డ
సొమ్ములు చీరలు సొంపు తప్పినవి
యెరగడ్డపాడులో—నే మానో తల్లి
కానివార్తలు విన—గాంతునో యేమొ!"

అని ఆమె బాధపడుతుంది. పేరుపేరు వరసన అన్నలు పెట్టిన నగలూ, చీరలూ ధరించి అవి కళ తప్పినందుకు అతనికి ఆపద తప్పదని భావిస్తుంది. (ఆ భావనలో ఎంతో కవిత్వం కూడా ఉంది) మచ్చుకు:

"వలభన్న యిచ్చిన పట్టంచుచీర
పట్టుపై వ్రాసిన ప్రతిమలకెల్ల
నిట్టె ప్రాణమువచ్చి యీ క్షణమునను
లోచక తమలోన దుఃఖించసాగ!"

'అహా!' అనిపించే అందమైన కల్పన. వెంటనే అనుమంచి యిలా అనుకొంది.

"నిర్జీవ ప్రతిమలు నేడు దుఃఖింప
దుర్జనవైరుల తునుమాడి చంప
బట్టావులన్నకు బల్లెలు నాటి
అటు ఘోరయుద్ధాన హతము కాబోలు!"

ఈ విధంగా భావించాక—

అన్నలిచ్చిన సొమ్ము లనువుగా తనువు
వెన్నెగా పురుషుని వారాల సొమ్ము
లనుమంచి తాలిమి నలరంగ బెట్టి
పూలమాంజిష్ఠను పూని తా గట్టి
..............................
పుడమీసు చెల్లికి పూలమాంజిష్ఠ
ప్రాంకమై యుండెను పులిగోరు రవిక
పిక్కటిలి యపుడు బిగువుగా నుండె
అరయంగ సొమ్ముల కటుకాంతి వచ్చె
మేనికి బంగారు మేలిమి హెచ్చె.
తనువల్లి కాంతికి తా వెరగంది
కన్నతల్లిని జూచి కలకల నవ్వి
"మాచితివే తల్లి చోద్యమ్ము కాని
పుట్టింటి వారిడ్డ భూషణాలివి
యమరవాయెను గాని అత్తవారిడ్డ
సొమ్ములే యమరెను శుభము కాబోలు!"

అని తలపోసింది. అన్నలిచ్చిన సొమ్ములు అమర వంగుకు వాళ్ళకి ఆపద అని ఎలా భావించిందో అలాగే పురుషు డిచ్చిన సొమ్ములు అమరినా అతనికి ఆపద అనే భావించింది. అతనితో పాటు సహగమనం చేసి మోక్షము పొందే యోగమున్నందుకే 'శుభము కాబోలు!' అనుకొంది. 'ఇది నాకు మోక్షంబు ఇది నాకు జయము' అని బయటకు చెప్పేసింది. ఈ అఘాయిత్యం మాటలకు అందరూ నొచ్చుకొన్నారు. ఆమెను చూసి

"ఇంతేసి పంతాలు యింత యనుమంచి
పంతంబులేటికే శాంతవుల్ మీద?
మనియుండ నిటువంటి మాటలు నీకు
అనగాదు పాపము అన్నలమీద."

అని పిన్నలూ పెద్దలూ పలికారు. అనుమంచి తగ్గుముకోకుండా,

"పంతగ్గి యమటయా పంతాలు తల్లి!
జగితప్పి సొమ్ములు చీరలుండంగ
సెగగగ జెప్పితి మేమి సేరంబు!"

అంది. ఆమె అలంకరించుకొన్నాక అందరూ కులదేవత గంగను కొలుచుటకు వెళ్ళారు. గంగ గుడిలో దేవతని అలంకరించాక అనుమంచి

"పాలేటి కేగిన ప్రభువుల దలచి
పాలోని అన్నల పోలికల్ జూచె
అన్నల పోలిక లటు చిన్నబోయి
వన్నెదప్పుదు రక్త వర్ణమైయుండె".

అది జూసి అనుమంచి గంగను ప్రార్థించింది.

"రంగుగా పాలేట రాజుల శుభము
మాతోను జెప్పవే మము గన్న తల్లి!"
"అక్కన్న వేడితే అప్పు డెరువమ్మ
ఉక్కుబొమ్మవలె నుండెను గంగ."

అనుమంచి అది చూసి రకరకాల మొక్కులు మొక్కుకొంది. చల్లవారు చల్లగా వస్తే ముందు జడలిస్తానంది. చిట్టిమరది లెస్సగా ఉంటే పదివేల దివ్వెలు ఎత్తిస్తానంది. కొడుకు కులాసాగా ఉంటే కుంకుమబళ్లు తోలిస్తానంది. భర్త బాగుంటే బంగారు గుడి కట్టిస్తానంది. గోపంగి బీరన్న మంగతావారు చల్లగా ఉంటే గుండం తొక్కుతానంది. ఇన్ని విధాలుగా మొక్కుకున్నా గంగ కనికరించలేదు. పైగా విపరీతాలు సంభవించాయి.

"అనుమంచి వేడగా నప్పు డెరువమ్మ
మిణుగురు మేఘముల్ మెరసినట్లుండె
పటపటమని గుడి పగిలినట్లాయె
కటకట యేడ్చెను కన్నులపాప
జోటజోట కన్నీరు జోరున కురిసె
గడగడ వణికెను గంధమాదిగను.
రవ్వలు చెదిరెను రత్నాలు రాలె
మువ్వలు గజ్జెలు మురమురలాడె
రొదగమ్మ గంగము రౌద్రమైపోయె.
..............................
కుడికంటి రక్తము కురియంగసాగె
ఎడమకంటను నీరు యేరులై పారె
దడ దడ మని గంగ తల్లడమందె
గుడిలోని గంగమ్మ గుడిరొమ్ము విరిగె!"

అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పక గంగ ఇలా వైపరీత్యాలు సంభవింపచేస్తే అనుమంచి ఊరుకోలేదు. అందుకే దేవత అని లెక్క చేయకుండా—

'ఇప్పుడు మానితే నీనాటిరాత్రి
కస్తూరిగంధి నా కలలోన వచ్చి
రొప్పుగ మేలును నొవరంగ కీను
చెప్పవె అన్నల క్షేమంబు నాకు!' "

అని అజ్ఞాపించి మరీ కదిలింది. ఆమె చుట్టూతా ఉన్నవాళ్ళు "...గంగను దూర నక్కన్న తగదు!" అని చెప్పినా వినలేదు. ఆమెకి భోజనం సయించలేదు. రాత్రి ఆమెకి గంగ కలలో కనబడింది. 'పల్లవులందరు వసుధపాలేట చెలిన వార్తలు శక్తితా సెరిగి' చావు కబురు చల్లగా చెప్పి

"గోపాలు డెత్తెను కొండను దివికి
గోపాలుడే భువి గొల్చిన విడిచె!"

అని గంగ అనుమంచిని మేల్కొలిపింది. నిద్ర లేచి కలత చెప్పి కలలకి అర్థం చెప్పగలిగినది కొటమరాజు భార్య సిరిగంగ ఒక్కర్తె అని అక్కడికి అనుమంచి అర్థరాత్రివేళ వెళ్ళింది. ఆమె మాటలు విని తల్లి సైతం

"అబ్బురపు కూతురనుకొంటు నిన్ను
గొబ్బున మృతికాక కూతుర నీవు"

అని విసుక్కుంది, కాని కోడళ్ళందర్నీ పిలిపించి కొలువు తీర్పించింది. అనుమంచి కల చెప్పింది. కొటమరాజు భార్య కల విప్పింది.

"కల జెప్ప కల విప్ప కడు తెల్లవారె
నుదయాద్రి శిఖరాన నుదయించె నినుడు!"

కల చెప్పడం, కల విప్పడం ఇంత తేలికగా అయిపోలేదు. అనుమంచి నిరాశతో పీడకలని వర్ణించింది. కొటమరాజు భార్య ఆశావాదంతో, దానికి శుభార్థం చెప్పింది. తరువాత ఏం జరిగిందో తెలుసుకోవాలని అందరికీ తహతహలాడుతుందిగాని దురదృష్టవశాత్తు యింతటితో ఇది అసంపూర్ణంగా అంతమైంది.

'సామ్రాజ్యపు దండయాత్రలలో సామాన్యుని సాహసమెట్టిది?' అని ప్రశ్నించి ఆ దృక్పథంతో చరిత్రని అర్థం చేసుకొందామనే ఆధునికులకి ఈ అనుమంచి కథ బోలెడంత ముడిపదార్థం. యుద్ధకాలంలో స్త్రీ హృదయం ఎంత తల్లడిల్లుతుందో చిత్రించే యిటువంటి కావ్యం ఏదేశపు సాహిత్యంలోనైనా గర్వించతగ్గది. ఇటువంటి 'అబ్బురపు'పాత్ర చాలా అరుదుగా కనబడుతుంది.

# కఠినోపనిషత్

శ్రీ దేవరకొండ బాలగంగాధరతిలక్

నీలకొండచిలువలు వెలుతురు కుందేళ్లను మ్రింగి సంఘపు మర్రిచెట్టుకు
చుట్టుకొని మత్తుగా నిద్రపోయే సమయాన,
మానవారణ్యంలోని పెద్దపులులు జరీకండువాలు, బిరుదాంకితమైన సువర్ణపత
కాలు ధరించి సిటీలో సభావేదికమీద కథాకళీనృత్యం చేస్తూన్న కాలాన,
సాయం విహారార్థ మరిగే చక్కని చుక్కల మినుకుమినుకు వెలుగుల్లో చలి
కాచుకునే పడుచువాళ్లచప్పట్ల తప్పెట్లు మ్రోగే ముహూర్తాన,
అతగాడు ఒక్కడూ ఊపిరాడని గదిలో జిడ్డుతేరిన తనముఖాన్ని కన్నీళ్లతో
టాయిలెట్ చేసుకుంటున్నాడు.

అర్ధరాత్రి థియేటర్లలో అర్ధనగ్న లాస్యానికి సెక్సీహాస్యానికి అమెరికన్
జాకెట్లు తొడిగిన బంగారపు పిచుకలు కిచకిచలాడినపుడు,
ఊరవతల సందులలో అంగళ్లలో విక్రయార్థం రంగేసిన రకరకాల మొహాల్ని
పేరుస్తోన్నప్పుడు,
యుద్ధాల్ని సృష్టించే మహానాయకులు దేశాల సరిహద్దులలో నిలబడి ద్వేషాల
శతఘ్నులు పేలుస్తోన్నప్పుడు,
అకాలమరణం పొందిన అనాథబాలుణ్ణి ఒడిలోపెట్టుకొని అతగాడు ఎర్రని
కళ్లతో ఏమీ ఎరుగని దేవుణ్ణి ప్రశ్నిస్తున్నాడు.

వెలుగుని వెనక్కి నెట్టుతూ రేపటిరోజుకి పదివేల సంవత్సరాలనాటి పాత
ముఖాన్ని అతికేందుకు ఒక హాహా హూహూవు ప్రయత్నిస్తోన్న ప్రాతః
కాలాన,
కాలాన్ని సాగదీసి సాగరాన్ని మథించి ఖగోళాల నావర్తించి అధునాతన
భావుకులు స్వప్నభుక్కులు వర్తమాన శిరస్సుని వధించబోయే సమయాన,
గత భూతకాల ప్రసక్తిలేక గగన పాతాళాల మధ్య ఏటవాలుగా జారే విలా
సులు తత్‌క్షణప్రయోజనసాధకులు చిరునవ్వులు చిందే విషమ సంధ్యవేళల,
అతగాడు మూడవ పరిమాణంలోని ఊహాలకి ఆకారం కల్పించలేక తికమక
పడుతున్నాడు.

నెత్తుటిలో దోగుతూన్న చరిత్ర శిశువుకు బొడ్డుకు బదులు పొట్టనుకోసిన అవివేకపు మంత్రసానులవలె దేశాధినేతలు తెల్లబోయి నిల్చిన సమయాన,

కోరికకీ సంతృప్తికీ, మాటకీ ఆచరణకీ, మనిషికీ మనసుకీ మధ్య అగాధాలు నిలచి ఆవులించే క్షణాన,

అందాన్ని హత్యచేసి వికృతీ, ఆనందాన్ని చంపి అశ్రువూ జీవితపు మైదానం మీాద ఒడంబడిక చేసుకొనిన రోజున,

అతగాడు పరీక్షనాళికలో ఎండిన నాగరికత గుండెని పరీక్షించి కొంచెం కొంచెం తన నెత్తురుతో తడుపుతున్నాడు.

చీలిన జీవితాల నెరదలలోంచి వచ్చే అస్పష్టపు ఆక్రందన ధ్వానాల, భయంకర రహస్యాలపైన నల్లని విస్మృతి వస్త్రం కప్పే వేళ,

కూలిన తాగుబోతు, కూలిన యింటి నడికుప్ప, బ్రతుకు రైలుదారిలో వ్రాలిన మృత్యువు లెక్క ఒకే ఒక కాన్వాసు మీాద ఆర్టిస్టులు చిత్రిస్తూన్న నిముషాన,

కష్టాల బాధల భయాల పర్వతశిఖరాలపైన నిలచిన కాంతి నీహారాల ఆశా సూర్యకు ప్రతిఫలింప ఏడురంగుల ఇంద్రధనస్సు లెక్కవెట్టి కోట్లకొలది జనులు ఎండమావుల పంపకలు చేసుకునే సమయాన,

అతగాడు తెగిన ఫిడేలు తీగల్ని కదలని గడియారపు గుండెల్ని చినిగిన స్వప్నపు సంచుల్ని రిపెయిర్ చేసే ప్రయత్నంలో నిమగ్నుడయాడు.

స్టెన్ గన్నులు, బోల్గన్లు, జెట్ విమానాలు, రాకెట్ల సమూహాలు ఒక్కొక్క యుద్ధంలో మనుష్యుల్ని చంపి నాగరికతను రక్షించే అద్భుత చారిత్రక ఘట్టాలలోన,

ఆస్తికులు నాస్తికులు మతాలు సిద్ధాంతాలు మనుష్యుల్ని మరచి పరమ సత్యాన్ని గరచి పైకితేనే ఆవేశపు మధ్యాహ్నపు ఎండలలోన,

నాలుగురోడ్ల కూడలిలో నిలబడి సౌఖ్యనగరానికి దారి తెలియక, సైన్ పోస్టు మీాది మిథ్యాలిపి డిసైఫర్ చెయ్యలేక జిగీషువుల జిజ్ఞాసువుల ముఖాలు వెలవెలబోతున్న సమయాన,

అతగాడు ఒక్కడూ ఊపిరాడని గదిలో ఉరిపోసుకు చనిపోయాడు.

# మాధవవర్మ : అతని సంతతి

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

[గతసంచిక తరువాయి]

గజపతి వంశజులైన సూర్యవంశక్షత్రియులు కళింగోత్కల దేశములను పరిపాలించిన పూర్వగంగాన్వయుల సింహాసనము నాక్రమించుకొని క్రీ. శ. 1434-35 (శా. శ. 1356-57) నుండి కటకము రాజధానిగ ఓఢ్రదేశమును యేలిరి. గజపతి రాజ్యస్థాపకుడు కపిలేశ్వర గజపతి (క్రీ. శ. 1434-35-1470). ఇతడు చాల పరాక్రమవంతుడు. రాజ్యమునకు వచ్చిన కొలది కాలములోనే ఇతడు కటకమునకు దిగువ ప్రాగ్సముద్రతీరస్థ పశ్చిమదేశముపై దండెత్తి దానిని జయించెను. అనతికాలముననే సింహాచలము మొదలు కొండవీడు, అద్దంకి నగరముల వరకు గల సముద్రతీరస్థ ప్రాంతము కపిలేశ్వరగజపతి యధికారము క్రిందికి వచ్చినది. కొండపల్లి, వినుకొండ, కొండవీడు, అద్దంకి మొదలైన దుర్గములు శాలివాహన శకము 1376 (క్రీ. శ. 1454) నాటికి గజపతుల పరిపాలనలో నుండెను.

గజపతి సైన్యములు ఈ దండయాత్రలోనే తెలంగాణములోని ఓరుగల్లును, రాయలసీమలోని శ్రీశైలప్రాంతమును గూడ జయించినవి. ప్రాయికముగ ఈ దండయాత్రా సందర్భముననే కపిలేశ్వర గజపతి మల్లికార్జునరాయల కాలమున విజయనగరమును ముట్టడించియుండును. గంగాధరుని గంగాదాస ప్రతాపవిలాస నాటకమును విశ్వసించినచో కపిలేశ్వర గజపతి పరాభూతుడైనట్లు ఎంచవలసియుండును. కపిలేశ్వరపౌత్రుడైన ప్రతాపరుద్రగజపతి తన యనంతవరము తామ్రశాసనమున మల్లికార్జునరాయలోడిపోయి కప్పము చెల్లించినట్లు తెలుపుచున్నాడు. ఇందేది నిజమో నిర్ధరింప వీలుపడదు. ఓరుగంటిలోని హంవీరదేవుని శాసనము శాలివాహన శకము 1381 నాటిది. కర్నూలు జిల్లాలోని గజపతుల శాసనము4లును శాలివాహన శకము 1382 నాటివే కావచ్చును. అటుచేత గజపతుల యీ దండయాత్ర ఆ ప్రాంతముననే జరిగియుండును. ప్రాయికముగ ఉదయగిరి దుర్గముకూడ ఈ దండయాత్రయందే గజపతి కపిలేశ్వరునికి వశమైయుండును.

ఉదయగిరి గజపతులకు వశమైనపిదప కొద్ది కాలమునకే హంవీరదేవుడు తన తనయుడు కపిలేశ్వర కుమార మహాపాత్రునికి కొంత సైన్యమునిచ్చి క్రీ. శ. 1460-61 (శా. శకము 1382-83) లో దక్షిణదేశ దిగ్విజయార్థము పంపెను. దక్షిణదేశముపై దండెత్తి వెళ్ళిన కపిలేశ్వరకుమార మహాపాత్రుని విజయధాటికి అడ్డగాలు లేకపోయినవి. చంద్రగిరి, పడవీడు, కంచి, తిరువారూరు, తిరుచిరాపల్లి మొదలైన మహాదుర్గములన్నియు అనతికాలముననే అతని యధికారము క్రిందికి వచ్చినవి. దక్షిణమండలములలో ఇతని శాసనములు శాలివాహన శకము 1386 నాటికి కానవచ్చినవి.5

కుమారకపిలేశ్వర మహాపాత్రుడు జయించిన సముద్రతీరస్థమైన యీ ప్రాక్కర్ణాట సామ్రాజ్యములోని చాలభాగము కర్ణాటాధీశ్వరుడైన మల్లికార్జునదేవ మహారాయల (క్రీ. శ 1446-1465) సామంతులైన సాళువ వంశజుల యధికారము క్రిందనుండెను. వీరందరు ఒక్కటే కుటుంబములోనివారు; పరస్పర బంధుత్వాభిమానములు గలవారు; ఉదయగిరి, చంద్రగిరి దుర్గముల కనుకవరైన సీమలలో చాలభాగము వీరి పరిపాలనక్రింద నుండెను. శకవర్షము 1382-83 ప్రాంతమున గజపతుల దక్షిణదేశ దండయాత్ర ఆరంభమైన కాలమునందు వీరందరు మహామండలేశ్వర బిరుదము వహించియుండుటయే కాక స్వతంత్రులుగ వ్యవహరింపజొచ్చిరి. వీరందరును గజపతి దండయాత్రలో పరాజయము నొందినవారే.

సాళువ సామంతులలో చంద్రగిరి దుర్గాధిపతియైన సాళువగుండరాజతనయుడగు నరసింహరాయలొకడు. శాసనములందితడు సాళువగుండ నరసింగయ్య దేవ మహారాజని, సాళువ నరసింగయ్యదేవ మహా

రాజని వ్యవహరింపబడియున్నాడు; విజయనగరాధీశ్వరుడైన రెండవ దేవరాయ మహారాయలకాలము నుండి అతని కొలువులోచేరి మల్లికార్జునదేవ మహారాయలకాలమున అతనికి మంత్రియు, సైన్యాధీశుడునై పేరుప్రఖ్యాతులు గాంచినవాడు; సాళువవంశ రాజన్యులందరిలో కడు శౌర్యపరాక్రమోపేతుడు. గజపతులను తరిమివైచి కర్ణాట సామ్రాజ్యమును శత్రుదుర్నిరీక్ష్యముగ జేయవలెనని యాతని కోరిక. కాని యాతని కోరిక కపిలేశ్వర గజపతి జీవించియుండినంత కాలము నెరవేరలేదు. క్రీ. శ. 1469-70 (శాలివాహన శకము 1391-92)లో కపిలేశ్వర గజపతి మృతినొందిన వెనుక కటకము సింహాసనమునకై అతని తనయులు హంవీరదేవ, పురుషోత్తమ దేవులకు కలహము సంభవించినది. ఈ యవకాశమును గైకొని రాయసామంతులలో అగ్రగణ్యుడైన సాళువ నరసింహరాయలు క్రీ. శ. 1470 (శా. శ. 1392)లో ముందు చంద్రగిరి, ఉదయగిరి రాజ్యములను జయించి క్రమముగా కృష్ణానదివరకుగల సముద్రతీరస్థప్రాంతమును వశపరచుకొనెను. సోదర కలహములో విజయము నొందిన పురుషోత్తమగజపతి పితృసింహాసనము నధిష్ఠించునాటికి కృష్ణానదివరకుగల రాజ్యము మరల సాళువ నరసింహరాయల అధికారము క్రిందికి వచ్చినది.

పురుషోత్తమ గజపతి సింహాసన మెక్కిన కొంత కాలమునకు దక్షిణదిశను తాను నష్టపోయిన రాజ్యమును సంపాదించుకొనుటకై మరల కర్ణాట సామ్రాజ్యముపై దండెత్తెను. శా. శ. 1406 (క్రీ. శ. 1484) నాటికి వినుకొండ, కొండవీడుప్రాంతము లాతని యధికారము క్రిందికి వచ్చెనుకి. పిదప నాతడు ఉదయగిరిపై దండెత్తి దానిని పట్టుకొనెను. ఉదయగిరి దుర్గవిజయము ప్రతాపరుద్రగజపతియొక్క సరస్వతీ విలాసమునందును, అనంతవరము తామ్రశాసనమునందును వర్ణితమైనది. పురుషోత్తమ గజపతి ఉదయగిరిని సాధించిన సందర్భమున కర్ణాటకుల కధిపతియైన నరసింహరాయలను బట్టుకొనెననియు, కాని యాతడు తనకు ప్రాణదానము చేయుమని ప్రార్థించినందున అతనిని విడిచిపెట్టెననియు సరస్వతీ విలాసము చెప్పుచున్నది. ఈ విషయమే అనంతవరతామ్ర శాసనమునం దిట్లున్నది:

యస్సైన్య నిత్యోతిరప్రతాపదహన
జ్వాలాయమానధ్వజ
స్తంభాబద్ధ కుసుంభ రక్తవసన
ప్రేంఖావిధగ్నద్విషే,
సంధాయాథ మయాదనాంజలి ముహో
దత్త్వోదయాద్రిం ధయా
దాత్మానం మముచె నృసింహనృపతిః
కర్ణాట దేశాధిపః.

ఉదయాద్రిని పురుషోత్తమగజపతి కొసంగి కర్ణాట దేశాధిపతియైన నృసింహనృపతి తాను విడుదల పొందినట్లు తెలియుచున్నది. పురుషోత్తమ గజపతికి పట్టుపడునాటికి నృసింహరాయలు కర్ణాట దేశాధిపతి యని చెప్పబడుట వలనను, నృసింహరాయలు విజయనగర సింహాసనమును క్రీ. శ. 1486 లో అధిష్ఠించినట్లు విజయనగర చరిత్రకారులు చెప్పుచుండుటవల్లను పురుషోత్తముని ఉదయగిరి దండయాత్ర ఆ ప్రాంతముననే జరిగి యుండవలెను. ఆ నాటినుండి కృష్ణదేవరాయలు తన పూర్వదేశ దండయాత్రలో తిరిగి ఉదయగిరి దుర్గమును జయించువరకు అది గజపతులయధీనమందే యుండెను. సాళువ నరసింహరాయలు కాని, అతని యనంతరము విజయనగరసింహాసనము నధిష్ఠించిన అతని తనయుడు ఇమ్మడి నరసింహరాయలు కాని, ఈ నరసింహరాయలకు వెంటనె సచివత్వము నెరపి పిదప అతనిని త్రోసిరాజని విజయనగర సింహాసనము నాక్రమించుకొన్న తుళువ నరసానాయకుని కుమారుడు వీర నరసింహరాయలు కాని ఉదయగిరిని మరల సంపాదింపజాలక పోయిరి. ఉదయగిరిని మరల సాధించిన ఖ్యాతి వీర నరసింహరాయల సోదరుడైన కృష్ణదేవ రాయలకు దక్కినది.

పై నుడివిన రీతిని ఉదయగిరిని గజపతులు రెండు తడవలు- మొదటితడవ కపిలేశ్వర గజపతి కాలమునను, రెండవతడవ పురుషోత్తమ గజపతి కాలమునను- కైవసము చేసికొనిరి. రెండవతడవ పురుషోత్తమ గజపతి స్వయముగా వచ్చి దానిని సాధించుటయే కాక కర్ణాటాధిపతియైన సాళువ నరసింహరాయలను బాడు దలబట్టి తుద కాదుర్గమును గజపతుల కిచ్చివేయు షరతుమీద నాతనిని విడుదలచేసెను. ఈ విషయముల నన్నిటిని గుర్తించుకొని పూర్వోదాహృతపద్యములకు కవిచరిత్రకారులు, విజయనగరసామ్రాజ్య వాఙ్మయ చరిత్రకారులు, కవితరంగిణీ కర్తలు చేసిన వ్యాఖ్యానము లెంతవరకు సమంజసములై నవో చూడ వలసి యున్నది.

'మాధవ వర్మ భూమండలేశ్వరవంశజలధి' కను సీసపద్యములో విశేషణప్రాయములైన నాలుగు చరణములను బసవరాజునకే యన్వయించుచునని, అందు వలన ఉదయగిరి దుర్గమును భేదించినవాడును, 'గజపతి సురథాణి గడిదుర్గముల' కధ్యక్షుండుగా నుండినవాడును బసవరాజే యని ఇంతకుపూర్వ మీ విషయమునుగురించి వ్రాసినవారు, చెప్పియున్నారు. కాని యది సరియైనమాటగ దోచదు. నా యుద్దేశమున పూర్వోక్త విశేషణము లన్నియు తిమ్మరాయునికే వర్తించును. ఉదయశైలమును విభేదించినవాడును, 'గజపతి సురథాణిగడిదుర్గముల' కధ్యక్షుడైనవాడును తిమ్మరాయడు కాని అతని తనయుడు బసవరాజు కాడు. ఇది మొదటి తడవ గజపతుల ఉదయగిరిదుర్గ విజయమునకు సంబంధించిన విషయము. కుమార వీరబసవరాజన్న యే తిమ్మరాయని కొడుకు పేరు. స్థానిక చరిత్రలలో నితడు వీరకుమార బసవరాజని వ్యవహృతుడైనాడు. పూర్వోక్త సీసపద్యమునందలి మొదటి నాలుగు పాదములందలి విశేషణము లన్నియు బసవరాజునకు గాక తిమ్మరాయునికే చెందవలెను. స్థానిక చరిత్రల సాయ మవసరము లేకయే ఈ విషయమును తిమ్మరాయుల శాసనముల వలననే నిశ్చయింపవచ్చును. నెల్లూరు జిల్లా ఉదయగిరిలో తిమ్మరాయుల శాసనములు క్రీ. శ. 1470 నాటివి కలవు. ఉదయగిరి దుర్గమును భేదించిన పిదప తిమ్మరాయడు ఆ దుర్గముమీద గోపాలకృష్ణునికి నగరు కట్టించి ఆ దేవుని అంగరంగ భోగాలకు, దీపారాధనకు భూదానాదికము చేసెను. ఈ విషయమును తెలుపునవే ఆ శాసనములు. ఈ దానధర్మములను తెలుపు శాసన మిట్లున్నది:

"శుభమస్తు॥ స్వస్తి శ్రీ జయాభ్యుదయశాలివాహనశక వరుషంబులు 1382 అగునేంటి వికృతి సంవత్సర శ్రావణ శు 11 ఆ. రఘువంశింరాజు బెజవాడ పాడిగడించిన మాధవవర్మ మనుమండు రణరంగభైరవ మల్లికావల్లభ సహకారబాంధవ హొంసబిరుదర గండం డనంబరగిన కంటమరాజు వల్లభయ్య కుమారుండు తిమ్మరాయనింగారు వుదయగిరిమీంది మన్యానను గోపాలకృష్ణునికి నగరు కటించి ప్రతిష్ఠ సేయించిరి; యీ దేవునికి నైవేద్యానకున్ను దీపారాధనకున్ను దినానకు బియ్యం చోదన ౧। పెసలు న॥ నెయ్యి న-॥ యీమరియాదను సమర్పించిరి, యీ దేవునికి అంగరంగ వైభవాలకున్ అమరచెరువు వెనకను నడిమితూముకిందను కు 1000 యీ పట్టి వరిపుడిని నిరోహారి లేక చెల్లి అటుగాను ధారవోసి సమర్పించిరి. 8."

తిమ్మరాయని రెండవశాసనము కూడ సరిగా ఆనాటిదే; అది కాశీవిశ్వేశ్వరదేవరకు నగరు కట్టించి ప్రతిష్ఠ సేయించి నైవేద్యానకు, దీపారాధనకు, అంగరంగ వైభవాలకు అతడు చేసిన దాన ధర్మాదికములను తెలుపును. 9. ఈ రెండు శాసనములలోను వికృతికి సరియైన శాలివాహనశకవత్సరము తప్పుగ నీయబడినది. అది 1392 (క్రీ. శ. 1470) కాని 1382 కాదు. ఈ తిమ్మరాయని శాసనములు ఉదయగిరిలోనే కాక చిత్తూరుజిల్లా తిరుమలలోను, చెంగల్పట్టుజిల్లా కాంచీపురములోను కూడ కానవచ్చినవి. తిరుమలలోని ఇతని శాసనము శకవర్షము 1389 సర్వజిత్తు సంవత్సర తులామాసమునందలి బహుళ పాడ్యమి కృత్తిక నాటిది 10. దీనికి సరియైన ఇంగ్లీషు తేది 16 అక్టోబరు 1467. ఇందితడు కంటమరాజు వల్లభరాయని కుమారుడు శ్రీ మన్మహామండలేశ్వర, హొంసబిరుదరగండ తిమ్మయదేవ మహారాజనియు, సూర్యవంశమునందలి బెజవాడ పాడి నిల్పిన పినమాధవవర్మ వంశ్యుడనియు తెలుపబడినాడు. ఇతనితండ్రి వల్లభయదేవమహారాజు శాసనము కూడ తిరుమలలో గలదు. అది శకము 1390 సర్వధారి సింహమాసమునందలి శుద్ధత్రయోదశి, తిరువోణం (శ్రవణ) నక్షత్రము నాటిది11. ఇందితనికి అంతెంబరగండ, గజపతి బిరుదములు కలవు. ఈ శాసనము ఉదయగిరి రాజ్యమున కనకవరమైన పాత్తపినాడులోని పరాంబిలూరు గ్రామమును తిరువేంకటముడైయానుకు (తిరువిడయాట్టముగా) సమర్పించినవిషయము తెలుపుటకు పుట్టినది. దీనికి సరియైన ఇంగ్లీషు తేది 1 ఆగస్టు 1468 (నక్షత్రము పూర్వాషాఢ కాని శ్రవణము కాదు). కాంచీపురములోని తిమ్మరాయుల శాసనము 12 శకము 1392 వికృతి సంవత్సరమునందలి మకర మాసమున అపరపక్ష అమావాస్య ఆదిత్యవారము (తిరువోణం) నాటిది. ఇందితడు విజయనగరాధీశ్వరుడైన విరూపాక్షదేవ మహారాయల సామంతుడుగ నున్నాడు; బెజవాడ పెదమాధవవర్మ వంశజుడుగ పేర్కొనబడినాడు. ఈ శాసనమునకు సరియైన ఇంగ్లీషు తేది 20 జనవరి 1471. ఆనాటికే వీరు పెదమాధవవర్మ వంశజులలో పినమాధవ వర్మ వంశజులలో సరిగా గుర్తింపకుండని స్థితి యేర్పడినది. విరూపాక్ష రాయలు పృథివీరాజ్యము చేయుచుండగా తిమ్మరాయలు కాంచీపురమునందలి అరుళాళప్పెరుమాళ్ల కు

చేసిన దానధర్మాదికము లిందు వివరింపబడినవి. ఈ శాసనము ననుసరించి చూడగా తిమ్మరాయలు విజయనగరాధీశ్వరులైన విరూపాక్షదేవ మహారాయల సామంతుడే కాని గజపతి సామంతుడు కాడని తేలుచున్నది. కాంచీపురములోని విరూపాక్షరాయల శాసనము 13 శకవర్షము 1389 సర్వజిత్తు, సింహబహుళ దశమి బుధవారము ఆశ్లేషా నక్షత్రము నాటిది (19 ఆగస్టు 1467) కావచ్చునుండుటచేత ఆ ప్రాంత మంతయు మరల విజయనగరాధీశ్వరుల వశమైన దనవచ్చును. శకవర్షము 1389-90 నుండి విజయనగరాధీశ్వరుల శాసనములు మరల చెంగల్పట్టు, ఉత్తరార్కాడు, దక్షిణార్కాడు మొదలగు దక్షిణ మండలములలో గాన్పించుటవలన విజయనగరాధిపతులును, వారి సామంతులును మరల క్రమముగా గజపతి సైన్యములను తరుమగొట్టి దేశమును వశపరచుకొనుచుండిరని విశదమగుచున్నది. ఒక్క దక్షిణ మండలములే కాక సముద్ర తీరస్థములైన మండలములును క్రమముగా వారికి వశమైనవి. ఈ మండలములలో ప్రసిద్ధమైన ఉదయగిరి దుర్గమును గజపతుల నోడించి వారివద్దనుండి తీసికొని విజయనగరాధీశుల కిచ్చినవాడు కంటమరాజు వల్లభయ కుమారుడు తిమ్మరాయడు. ఈ ఉదయగిరిని కపిలేశ్వర గజపతి ఎప్పుడు స్వాధీనము చేసికొనెనో తెలియదు కాని శకవర్షము 1392 నాటికది విజయనగరాధిపతులకు మరల కైవసమయినది. కపిలేశ్వర గజపతి చనిపోయిన వెంటనే సాళువ నరసింహ, తిమ్మ భూపతులు దానిని గైకొనియుండవలెను. ఇదియేకాదు, సముద్రతీరస్థ ప్రాంతము కృష్ణానదివరకు, విజయనగరాధినేతల యధికారము క్రిందికి వచ్చి మరల దీనిని పురుషోత్తమగజపతి దండెత్తి వచ్చువరకు వారిక్రిందనే యుండెను.

తిమ్మరాయల కుమారుడు బసవ భూపాలుడు శకము 1392 (క్రీ. శ. 1470) తరువాతనే రాజ్యమునకు వచ్చియుండవలెను. తిమ్మరాయలు మాత్రమే కాక అతని పూర్వులందరును కర్ణాట సామ్రాజ్యాధిపతులను గొలిచి రాజ్యప్రాభవమును బడసినవారలే. వీరిది మొదట బెజవాడ స్వస్థలమైనను కాలక్రమమున వీరు రాయలసీమ కరిగి చాగలమఱ్ఱిసీమను పరిపాలించియున్నారు. తిమ్మరాయల జ్యేష్ఠసోదరుడు సింగభూపాలుని శాసనము 14 కర్నూలుజిల్లా శిరువెళ్ళ తాలూకా చాగలమఱ్ఱి గ్రామములోని చెన్నకేశ్వరాలయమున గానవచ్చినది. ఇది శాలివాహన శకము 1373 ప్రజోత్పత్తి, అనగా క్రీ. శ. 1451 నాటిది. సింగభూపాలుడీ శాసనమున తాను కంటమరాజు సింగభూపాల పౌత్రుడనని, వల్లభరాయ పుత్రుడనని, విజయదేవరాయ పౌత్ర వీరప్రౌఢదేవరాయ పుత్ర మల్లికార్జునదేవరాయ కృపా కటాక్షైశ్వర్యధుర్యుడనని చెప్పుకొనియున్నాడు. ఇతడు తన నాయంకరములోని చాగలమఱ్ఱికి పశ్చిమమున నున్న చెన్నకేశ్వర దేవునికి తన తండ్రి వల్లభరాయునికి పుణ్యముగా గోపుర ప్రాకారాలు కట్టించి ఆ దేవుని అంగరంగ వైభవముల నిమిత్తము కొంత భూమిని దానమిచ్చినట్లు పూర్వోక్త శాసనము తెలుపుచున్నది. ఈ విషయము తిమ్మరాయని సవతి సోదరుడైన పాపరాజు కుమారుడు సింగరాజు బెజవాడ శాసనమువలనను (శా. శ. 1440) తెలుపబడినది. ఈ సింగభూపతి మల్లికార్జున రాయల సామంతుడు కాగా అతని సోదరుడు తిమ్మక్ష్మాపాలుడు మల్లికార్జున రాయలకు పిదప విజయనగర సామ్రాజ్యమును బరిపాలించిన విరూపాక్షరాయలకు సామంతుడై గణనకెక్కెను.

స్థానిక చరిత్రలవలన ఈ మాధవవర్మ వంశ్యులను గురించి యింకను కొన్ని విశేషములు తెలియుచున్నవి. వల్లభరాయుని తల్లి మాధవమ్మ. ఆమె పేర వల్లభరాయలు 15 శాలివాహన శకము 1349 ప్లవంగ సం॥న, అనగా క్రీ. శ. 1427 లో మాధవపురమను గ్రామమును గట్టించెను. మాధవవరమను గ్రామ మొకటి కర్నూలు జిల్లా ద్రోణాచలము తాలూకాలో నున్నది. అదే యీ మాధవపుర మేమో తెలియదు. అదే యిదియైన యెడల వీరి నాయంకరము ఇప్పటి ద్రోణాచలము తాలూకాలో గూడ వ్యాపించినదని చెప్పవచ్చును. వల్లభరాయనామాంచితులు, సింగరాజ కుమారులు— బెజవాడ శాసనము ననుసరించి—యిరువు రున్నారు: పెదవల్లభరాజు, పినవల్లభరాజు. బెజవాడ శాసనము వలన వీరెవరికి గాని మాధవమ్మ యను భార్య యుండినట్లు తెలియదు. ఈమె పెదవల్లభరాయని ద్వితీయ భార్యయో, పినవల్లభరాయని భార్యయో తెలియరాదు.

కందమురాజు సంతతివారి నాయంకరము మన్య ప్రాంతము. ఈ కారణమున నేమో వీరికి మన్యభార్గవులని బిరుదము కలిగినది. మన్యభార్గవ, పరోపబిరుదర గండ, రణరంగభైరవులను వీరిబిరుదాంకములు వీరి శాసనములలోను, దూబగుంట నారాయణకవి విరచితమైన పంచతంత్రములోను గూడ గానవచ్చుచున్నవి.

ఈ బిరుదములను మాత్రమే కాక నారాయణకవి 'తెల్ల దలాటాంక,' 'ఉభయదళ విండి'16 బిరుదములను గూడ తన కృతిపతియైన బసవరాజునకు తగిలించినాడు. ఈ రెండు బిరుదముల విశేషము సరిగా బోధపడుట లేదు. బసవరాజు పితామహుడైన వల్లభరాజు చాగలమర్రిలో శాలివాహన శకము 1358, అనగా క్రీ. శ. 1436 లో ఒకకోట కట్టించినట్లు స్థానిక చరిత్రములు చెప్పుచున్నవి.17

సాళువ నరసింగరాయలు విజయనగరాధీశ్వరుడైన విరూపాక్షరాయల పక్షమున కర్ణాట సామ్రాజ్య సముద్ధరణమునకు పూనుకొని కపిలేశ్వరగజపతి మృతినొందినవెంటనే గజపతు లాక్రమించుకొన్న కర్ణాట రాజ్యభాగమును జయింప బూనుకొన్న సందర్భమున నిదివరలో నుడివినట్లు, ఉదయశైలమును విభేదించిన వాడు తిమ్మభూపాలుడు. ఈ యుదయగిరి విజయము క్రీ. శ. 1470 ప్రాంతమున జరిగినది. ఆ ప్రాంతమును జయించిన యనంతరము తిమ్మరాయలును, అతని సోదరులు పాపరాజు, ప్రభాకర రాజులును, కడప మండలములోని పొత్తపి, నెల్లూరు మండలములోని ఆత్మకూరు ప్రాంతములను, తిమ్మరాయ కుమారుడైన బసవరాజు కర్నూలుజిల్లా చాగలమర్రి ప్రాంతమును రాయసామంతులై పరిపాలించిరి. కర్నూలు జిల్లా శిరువెళ్ళ తాలూకా నద్దూరు గ్రామము నెలుపలనున్న గణపతి దేవాలయము ముందరి యొక రాతిమీద శాలివాహనశకము 1420 కాళయుక్తి, అనగా క్రీ. శ. 1498 నాటిది బసవరాజు శాసన మొకటి యున్నది. మహామండలేశ్వర బసవరాజు దేవరాజు కాళయుక్తి సంవత్సర మాఘ శు 14 నాడు రాయలవారికి పుణ్యముగా పూలతోట వేసి గన్నెరు చెట్లు పెంపు నిమిత్తము కురువెన రాచినాయునికి, జంగం బసవయ్యకు కొంత భూమిని దానముగా నిచ్చి ఈ ధర్మశాసనమును 18 వ్రాయించెను. ఈ శాసన కాలమునాటి కీప్రాంతమున కేలికలు కర్ణాటాధీశ్వరులే. తిమ్మరాయుని కుమారుడైన బసవరాజు కర్ణాటరాయ సామంతుడే కాని గజపతి సామంతుడు కాడనుట స్పష్టము. బసవరాజు పినతండ్రియైన పాపరాజు తనయుడు సింగయదేవమహారాజు కృష్ణదేవరాయ సామంతుడు. పురుషోత్తమ గజపతి మరల కృష్ణకు దక్షిణమున ఉదయగిరి వరకు గల దేశమును క్రీ. శ. 1485 ప్రాంతమున జయించినను రాయలసీమలోని కర్నూలు జిల్లా శిరువెళ్ళ ప్రాంతము మరల వశము కాలేదు.

పూర్వోక్త విషయముల నన్నిటిని పర్యాలోచనలోనికి దీసికొనినచో 'మానవవస్త్ర భూ మండలేశ్వర వంశ జలధికి నీరాజు చందమామ' అను సీసపద్యములోని 'గజపతి సురథాణి గడి దుర్గముల కెల్ల నీరాజు వజ్రంబు బోరుతలుపు' అన్న పాఠము సరియైనది కాదని తోచుచున్నది. 'వజ్రంపు బోరుతలుపు' అను దానిలో 'బోరుతలుపు' అన్నది సవరింపవలె ననుకొందును. ప్రబోధ చంద్రోదయము తాళపత్ర గ్రంథము లందలి పాఠమెట్లున్నదో చూపనున్న నాకవి లభ్యము కాలేదు. తాళపత్రగ్రంథములను పరిశీలించువారు ఈ సీసపద్యపాఠము పైనిచ్చినదానికి భిన్నముగ నున్నచో నాకు తెలిపిన కృతజ్ఞుడను.

ఇక నరసింహ నృపతి యెవరో విచారింప వలసి యున్నది. బసవరాజు కాలమున నలుగురు నరసింహ నృపతులు కర్ణాట సామ్రాజ్యమున గడు ప్రఖ్యాతు లయినవా రున్నారు. వీరిలో సాళువ నరసింహరాయ లొకడు; ఇతని కార్యకర్తయైన తుళువ నరసానాయకు డొకడు; ఇతడు శాసనములందును, గ్రంథములందును నరసింహ నృపతియనియే వ్యవహృతు డయ్యెను. సాళువ నరసింహరాయల కుమారుడు ఇమ్మడి నరసింహరాయ లొకడు; తుళువ నరసానాయకుని కుమారుడు వీరనరసింహరాయ లొకడు. ఇట్లు బసవరాజున కించుమించుగ సమకాలికులు నలుగురు కానవచ్చుచుండ 'శ్రీకర వీక్షణ' యను పద్యములోని నరసింహ నృపతి సాళువ నరసింహ నృపతియేయని గాయి గ్రుద్దినట్లు చెప్ప వీలు లేదు. 'వశకర' యన్న విశేషణముకొన్న వాడని యర్థమైనను దని నయోద్యానై పుణ్యమున పై నలుగురిలో నెవరో యొకరి నావసు మెప్పించి యతనిని దనవానిగ జేసికొనెనని యర్థము చెప్ప వచ్చును. జీర్ణ గ్రాహముగ సాళువ నరసింహుని బట్టుక నినట్లే చెప్ప నక్కరలేదు. ఇంతకు బసవరాజు రాయసామంతుడు కాని గజపతి సామంతుడు కాడు. నరసానాయకుడు శాలివాహన శకము 1425 (క్రీ. శ. 1503) లో మృతినొందెను. ఇతని మరణానంతరము కూడ ఇమ్మడి నరసింహరాయలు జీవించియే యుండెను. అందుచేత శాలివాహనశకము 1420 (క్రీ. శ. 1498) నాటి బసవరాజు శాసనమునందు చెప్పబడిన రాయలు సాళువ నరసింహుని పుత్రుడైన ఇమ్మడి నరసింహరాయలు

కొనసాగెను. పిదప ఇమ్మడి నరసింహరాయలు రాజయి నను అధికారమంతయు తుళువ నరసానాయకునిదే. అట్లగుట 'శ్రీ కరవీథిన' యను పద్యములోని నర సింహనరపతి తుళువ నరసానాయకుడైన గావచ్చును.

కర్ణాటాధీశ్వర సామంతుడైన నాటినుంచి బసవ రాజు వారిని భక్తి విశ్వాసములతో గొలుచుచు వారి సంగ్రామములలో పాల్గొని వారికి విజయములు చేకూర్చుచు వచ్చెను. ఇతడు పారసీకక్షితీంద్రుని బలముల నోడించినట్లు బెజవాడ శాసనములోని యీ క్రింది

యుద్ధే యే నాభిభూతః
సకలబలయుతః పారశీకక్షితీంద్రో
వ్యక్తే శ్రోణీభృతో య
ద్బిగదమనుపమం మల్లికావల్లభాది,
దుర్గా.ణ్యుగ్రాగరివర్గా
దపిద జగృహీరే బాహువీర్యాదవార్యా
ద్దిగ్యాత్ర చర్యా యదీశా
త్రిభువన ధవళై స్తూయ తే యస్య కీర్తిః.

అను శ్లోకమువలన దెలియుచున్నది. ఈ శ్లోక మున జెప్పిన పారశీకక్షితీంద్రుడు బహమనీసుల్తాను మహమూదుషా సామంతుడైన అదిల్ ఖానని తోచు చున్నది. నరసానాయకుడు తన చివరికాలములో విజయనగరసామ్రాజ్యముపై దండెత్తివచ్చిన ముసల్మాను లపై నెత్తివెళ్లి వారిని జయించినట్లు సంస్కృ తాంధ్రకావ్యములవలన దెలియుచున్నది. నంది తిమ్మన తన పారిజాతాపహరణమున 'పారసీకునకు దుర్భర మానదుర్గంబుఁ దొలఁగించె మానదుర్గమీము' యని నరసానాయకు నభివర్ణించెను. ఇమ్మడి నరసింహ రాయల కార్యకర్తగ నుండిన నరసనాయకుడు పారసీ కేంద్రు నెదుర్కొని మానదుర్గముకడ యుద్ధమున బరాజితుని గావించెనని పైనుడివిన పారిజాతాపహర ణమువలననే కాక డిండిమకవి విరచితమైన అచ్యుత రాయాభ్యుదయమువలనను, తిరుమలాంబ విరచించిన వరదాంబికా పరిణయమువలనను కూడ దెలియు చున్నది. ఈ పారసీకేంద్రుడు ఆదిల్ ఖానని చరిత్ర కారులు నిర్ణయించి యున్నారు 19. బసవరాజు నరస నాయకుని సమకాలికుడగుటలనను, ఇమ్మడి నర సింహరాయల సామంతుడగుటవల్లను ప్రాయికముగ నీ దండయాత్రలో నరసనాయకునివెంట బోయి యుండవచ్చును. బసవరాజు పారసీకక్షితీంద్రు నోడిం చినది, ఈ దండయాత్రలోనే కావచ్చును.

ఈ పై విషయములవలన బసవరాజు శాలివాహన శకము 1420 అనగా క్రీ. శ. 1498 ప్రాంతమున ర్ణాటరాయ సామంతుడుగ రాజ్యమేలి యుండుటం చేత అతని మంత్రియు, ప్రబోధచంద్రోదయ కృతి పతియునైన గంగయామాత్యుడును, తత్కృతి కర్త లైన నందిమల్లయ్య, ఘంట సింగయ్యలును క్రీస్తుశకము పదునైదవశతాబ్దాంతమున నుండినట్లు నిశ్చయింప వచ్చును.

---

3. భారతి, సం. 12, పుట 426 మొదలు.

4. Ep. Coll., 30 of 1915; 277 of 1935–36.

5. Ibid; 51 and 92 of 1919.

6. Ibid; 226 of 1935–36.

7. ఆంధ్రపత్రిక శ్రీముఖ ఉగాదిసంచిక (1933).

8. N.D.I., U. 28. శాసనమున చెప్పిన తిథి వారములు ఆ మాసమునకు సరిపోలేదు.

9. Ibid; U. 29. ఇదియు నంతే.

10. T. D. I. Rep., p. 139; Ins. Vol. II, Nos. 27 and 28, pp. 45–46; T. T. Nos, 7 and 7A.

11. Ibid; Ins. Vol. II, No. 35, p. 60; T.T. No. 159.

12. S.I.I., Vol. IV No. 362; Ep. Coll. 39 of 1890.

13. Ep. Coll; 658 of 1919.

14. Mack. MSS, 15–5–33, pp 223-24.

15. ఈ వల్లభరాయలు విజయదేవరాయల, అనగా విజయభూపతి తనయుడైన రెండవదేవరాయల సామంతుడు. ఇతనికి బెజవాడపురవరాధీశ్వర, బెజ వాడవాటి ప్రతిష్ఠాపనాచార్య బిరుదములు కలవు.

16. 'ఉభయదళ మింతె' యను దానికి మహమ్మ దీయ సైన్యమును, ఒడ్డె సేనలను జయించినవాడని యర్థము చెప్పుకోనవచ్చును.

17. స్థానికచరిత్రప్రకార మితడు శా.శ. 1372 ప్రమోదూతవరకు రాజ్యమేలెను.

18. Mack. MSS., 15–5–33, pp. 223-24.

19 Further Sources of Vijayanagara History, Vol. I, p. 175.

# వార్తలు

## తిరుపతిలో సంగీత కళాశాల

ఈ సంవత్సరం తిరుపతిలో సంగీత కళాశాల దేవస్థానం యాజమాన్యాన ప్రారంభం కాగలదని దేవస్థానం నిర్వహణాధికారి శ్రీ సి. అన్నారావుగారు తెలిపారు.

## గోదావరి డెల్టాలో సాగుకు అదనంగా నీరు

గోదావరి డెల్టాలో మూడులక్షల యాభై వేల యకరాలకు ఏటా నీరు అందిజేయడానికి ఒక పథకం సిద్ధపరచబడింది. ఆంధ్రప్రదేశ్ రెవిన్యూబోర్డు సభ్యులు శ్రీ ఎం. టి. రాజు స్పెషల్ చీఫ్ ఇంజనీరు శ్రీ వెంకటకృష్ణ అయ్యర్ గార్లు గోదావరి డెల్టా నీటిపారుదల సలహాసంఘాలతో సమాలోచనలు జరిపిన ఫలితంగా ఈ పథకం తయారయింది. ఇంతవరకు ఏటా రెండు లక్షల 70 వేల యకరాలకు మాత్రం దాళ్వా పంటకు గోదావరి డెల్టాలో నీరు సరఫరా అయ్యేది.

## రాజోలిబండ పెద్దకాల్వకు ప్రారంభోత్సవం

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ వర్క్సు శాఖా మంత్రి శ్రీ జె. వి. నరసింగరావుగారు జులైలో ఉప్పల్ వద్ద రాజోలిబండ పెద్దకాలువకు—నీరు వదలడంద్వారా—ప్రారంభోత్సవం జరిపారు. ఈ కాల్వలకు 29 చిన్న కాలువలు ఉంటాయి. వీటికింద 88 వేల యకరాల భూమి సాగవుతుంది.

## తృతీయ ప్రణాళికలో సమాజ వికాసం

తృతీయ పంచవర్ష ప్రణాళికలో సమాజవికాస కార్యక్రమ నిర్వహణకు దాదాపు 400 కోట్ల రూపాయలు వ్యయం కాగలదని అంచనా వేయబడిందని, తృతీయ ప్రణాళిక సమాప్తి వేళకు దేశంలోని గ్రామాలన్నిటిలోను ఈ వికాస కార్యక్రమం జరుగుతుందని, కేంద్రప్రభుత్వం సమాజాభివృద్ధి సహకారశాఖామంత్రి శ్రీ ఎస్. కె. డే తెలిపారు.

## సంయుక్తమహారాష్ట్ర సమితి ఉద్యమం

ఇక నాలుగు నెలల్లోగా ద్విభాషా బొంబాయి రాష్ట్రాన్ని విడగొట్టి బొంబాయినగరం రాజధానిగా సంయుక్త మహారాష్ట్రం, మహాగుజరాత్‌లను నెలకొల్పకపోతే వచ్చే నవంబర్ నుంచి రాష్ట్రవ్యాప్తంగా ఉద్యమం ప్రారంభించాలని సంయుక్త మహారాష్ట్ర సమితి నిర్ణయించింది.

## కేరళంలో ప్రతిపక్షాల ఉద్యమం

కేరళంలో ప్రతిపక్షాల ఉద్యమం తీవ్రంగా సాగుతున్నది. ప్రధాని పండిట్ నెహ్రూ రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్‌తోను, దేశీయశాఖామంత్రి పండిట్ పంత్‌తోను చర్చలు జరిపారు. భారతమంత్రివర్గంకూడా చర్చించింది. కేరళలో మరల ఎన్నికలు జరపాలని కాంగ్రెస్ అగ్రనాయకులు భావిస్తున్నారు. కాని, కేరళ ముఖ్యమంత్రి ఇది ఉద్యమమే కాదంటున్నారు. ఈ ఉద్యమంలో ఇంతవరకు 75 వేలమంది అరెస్టయ్యారు.

## పాకిస్తాన్ ఋణం వసూలుకు చర్చలు

ఇండియా, పాకిస్తాన్‌ల మధ్య ఇంకా అపరిష్కృతంగా ఉన్న ఆర్థిక వ్యవహారాల పరిష్కారం కోసం ఉభయదేశాల ఆర్థికమంత్రులు జులై 28 వ తేదీనుండి ఆగస్టు 8 వ తేదీవరకు చర్చలు జరిపారు. దేశవిభజన సమయంలో పాకిస్తాన్ ఇండియాకు ఇవ్వవలసిన 300 కోట్లరూపాయల ఋణం విషయమై ప్రధానంగా చర్చలు జరిగాయి.

## పాకిస్తాన్ రక్షణవ్యయం హెచ్చింపు

జులైనుంచి ప్రారంభమయ్యే వార్షిక సంవత్సరంలో పాకిస్తాన్ ప్రభుత్వం రక్షణశాఖ కోసం 86 కోట్లు రూపాయలు ఖర్చుపెడుతుంది. ఇది మొత్తం ఆయవ్యయపట్టికలో నూటికి 56 వంతులు.

## అమెరికా – రష్యా

రష్యా—అమెరికాల మధ్య సన్నిహితత్వానికి కృషి జరుగుతున్నది. న్యూయార్కులో ఏర్పాటు చేయబడిన సోవియట్ పారిశ్రామిక ప్రదర్శనానికి సోవియట్ ఉపప్రధాని శ్రీ ఫ్రోల్ కోస్లోవ్ ప్రారంభోత్సవం జరిపారు. మాస్కోలో ఏర్పాటు చేయబడిన అమెరికన్ ప్రదర్శనానికి అమెరికా ఉపాధ్యక్షుడు శ్రీ నిక్సన్ ప్రారంభోత్సవం జరిపారు.

## ఇండోనీసియాలో చోదిత ప్రజాస్వామ్యం

ఇండోనీసియా అధ్యక్షుడు డాక్టర్ సుకర్నో ఇండోనీసియా రాజ్యాంగ పరిషత్తును రద్దుచేసి, 1945 నాటి రాజ్యాంగశాసనాన్ని తిరిగి అమలు పరచాడు. ఈ శాసనంకింద సుకర్నోకు దేశంలో "చోదిత ప్రజాస్వామ్యం" (గైడెడ్ డెమోక్రసీ) అమలుపరచే అధికారం సంక్రమించింది. అతడు ఇద్దరు సైనికాధికారులతో సహా పదిమందితో కూడిన మంత్రివర్గం ఏర్పాటుచేశాడు.

# చంద్రోత్సవము: కేరళ మణిప్రవాళకావ్యము

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

సహ్యా పర్వతములలోని యొకభాగమును 'మరుత్తామల' యందురు. దీనిని సంస్కృతీకరించి 'మరతక పర్వత' మని తరువాతివారు వాడికొనిరి. 'మరుత్తామల' యనగా—మందుల కొండ యని యర్థము. హనుమంతుడు లంకకు సంజీవని పర్వతమును మోసికొని పోవుచున్నప్పుడు – దారి తప్పి – యొక శిఖర మచట బడెనట! దక్షిణాపథమున నిట్లు పడిన కొండలకు లెక్కలేదు. తమిళులు 'పొదియమలై' కూడ సంజీవనీ పర్వతములోని భాగమే యందురు. 'మరతక గిరి' శృంగమున నొక గంధర్వుడు తన ప్రేయసియైన కిన్నరితో క్రీడించుచుండెను. చల్లగా మలయవాయువులు వీచుచున్నవి. ఆ వాయువులతో గలిసి యొక నూత్నపరిమళము అననుభూతపూర్వము ప్రసరించెను. ఆ సుగంధము గలిగిన పువ్వు మేదో తెలిసికొని, దానిని తనకు దెచ్చియివ్వవలెనని కిన్నరి కోరినది, ద్రౌపది భీముని సౌగంధికమును గోరినట్లు! వెంటనే యామె కోర్కెను దీర్చుటకు గంధర్వుడు బయలుదేరెను. వాడా సువాసనల త్రోవలబట్టి "తృశ్శివప్పేరూర్" నాడునందున్న 'చిత్రశాలప్పళ్ళి'కి వచ్చినాడు. సువాసనలు వెడలుచున్న దా యూరినుండియే. అచట "మేదినీవెణ్ణిలావు" అను నొక వేశ్య గలదు. అనగా— "మేదినీ చంద్రిక" యని యర్థము. ఆమె చంద్రోత్సవము సేయుచున్నది. ఆ యుత్సవములో "అష్టగంధ" మను పేరుగల సుగంధద్రవ్యములు వాడెను. ఆ గంధములయు, దీపవర్తికలయు పరిమళమే "మరుత్తామల" వఱకు వ్యాపించి కిన్నరి కాకాంక్షలు రేపినది. గంధర్వుడచట నాలుదినము లున్నాడు. చంద్రోత్సవమును వాడు కన్నులారచూచి తిరిగి వచ్చి ప్రేయసికి వర్ణించి చెప్పెను. ఇది – యీకావ్యములోని యితివృత్తమున కుపోద్ఘాతము.

ఒకసారి శచీదేవి చంద్రోత్సవము చేసినది. ఆమె యొనర్చుచున్న యుత్సవమునకు "రివాజు" ప్రకారము అప్సరస లందరును వచ్చిరి. వారిలో మేనకయుకూడ నుండెను. మేనకపై పూర్ణచంద్రుని కన్నుపడినది. దేవవేశ్య చంద్రుని ప్రణయయాచ్ఞ కంగీకరించినది. వారిరువురును మఱుదినము పారిజాత వృక్షముల చల్లని నీడలలో గలసికొందమని[1] 'కటాక్షతూలికాగ్రము'లతో వ్రాసికొని, సంకేత మేర్పఱచికొన్నారు. పూర్ణచంద్రుని యంకమున నున్న చంద్రిక కటాక్షమాత్ర సంసూచితమైన వారి పరస్పర ప్రణయమును గమనించెను. వారేర్పఱచికొన్న సంకేతముగూడ చంద్రికకు సంపూర్ణముగ నర్థమైనది. చాతుర్యవతియైన యామె కింకేమి గావలెను? ఆ సమయమునకు దానే సంకేతస్థలమున దయారైనది. మేనక యప్పటి కింకను రాలేదు. చంద్రిక తానే మేనక యనుకొనునట్లు చతుర్విధ శృంగారములతో సమయోచితముగ ప్రవర్తించెను. చంద్రుడు భ్రమపడెను. ఆ సంకేతమున చంద్రికా చంద్రుల ప్రణయకావ్యములోని యొకయాశ్వాసము రసభరితముగ ముగిసినది. ఇంతలో మేనక యచటికి వచ్చినది. చంద్రునకు జరగిన వాస్తవస్థితి యర్థమయ్యెను. అతడప్పుడు—

"కులయువతి పతాకే! వారయోషేవ నమ్మె
క్కమలి, విగత శంకం నీద తిచ్చోరుమాలం
అవనియిలొరు నూట్రాం డేతు పోయ్ వారయోషా
నుభవ మనుభవిచ్చీ డాక ముచ్చాపవేగాత్"

అని శపించెను. "కులయువతి పతాక"గా నుండవలసిన యో చంద్రికా! నీవు విగత శంకవై వారయోషవలె మమ్ము మోసగించితివి. అందుచేత ప్రపంచమున వారయువతి వై జన్మించి, నూరు వర్షములు జీవింపుము" అని పైదాని కర్థము. చేసిన పనికి చంద్రిక చాల పశ్చాత్తాపపడెను. ఆమె పూర్ణచంద్రునకు ప్రణమిల్లి అందరివలెనే తానును శాపమోక్షమును యాచించెను. మన దేవతలు శాపము లెంత సులభముగ నిత్తురో వాని విమోచనములు గూడ నంత సులభముగనే ప్రసాదింతురుగదా! చంద్రుడుమాత్ర మా కోవలోనివాడుగాక యెట్లు పోవును? అతడు వెంటనే—

"కులవిజయపతాకే! భూతలే పోయ్ పిరన్నా
అని విరవోడు పెయ్ వూ పూర్ణచంద్రోత్సవం నీ
అతు నిరుపమ మస్మత్ప్రీణనం ఞాన్ వరున్నుం
డవిడె నియతం..."

కులవిజయ పతాకవైన యో చంద్రికా! నీవు భూతలమున జన్మించి, సకల సామగ్రితో చంద్రో

1. 'విశిఖమునయెన్నుం తూలికాగ్రేణ'

త్సవము నొనర్చును. ఆ యుత్సవము నాకు చాల ప్రీతికరమైనది. అదటికి నియతముగా చేసువత్తును." అని శాపవిమోచనమును వివరించెను. చంద్రిక చాల సంతోషపడెనట! 'చిత్రిలప్పళ్ళి'లో 'మతి' యను నొక వేశ్య యుండెను. వారాంగనల కుండదగిన సమస్త గుణములను పుంజుకొన్న మూర్తి యామె. 'మతి' యనగా—మళయాళములో 'ఇక చాలు' నని యర్థము. తల్లికి 'మతి' జన్మించినప్పుడు ఆమె మనస్సానంద దోహలమైనది. అప్పుడామె—"ప్రపంచమున నిక నాకే కొదువయు లేదు. ఉన్నయొక్క కొదువయు దీరిపోయినది. నాకింక 'చాలు' నన్న" దట! దానితో నా పుట్టినబిడ్డ పేరు 'మతి'యే యైపోయినది. ఆమెకును సంతానము లేదు. వరుస ననుసరించి 'మతి'గూడ తనకు దోచిన—యితరులు చెప్పిన—పుణ్యకార్యములను చేయసే చేసినది. ఒకసారి యామె మన్మథపూజ యొనర్చెను. ఆ దేవున కామెకు దర్శన మివ్వక తప్పినదికాదు. నాడు దేవతలకును—మనుష్యులకున్న 'లేవా—దేవి' యట్టిది. వచ్చిన దేవుడు వెంటనే యామె కోర్కెను తీర్చి పోయియున్న బాగుండెడిది. అతడా ట్లెంగుకు చేయును? కవి చేయనిచ్చునా? "నీవు పంచతారవ్రతమును చేయుము"మని యాజ్ఞాపించినాడు. 'మతీదేవి' మన్మథుడు చెప్పిన మేరకు పంచతారవ్రతము ననుష్ఠించెను. అప్పుడుకూడ మన్మథుడు దర్శన మిచ్చినాడు. ఈసారి తానొకడే రాలేదు. చంద్రవసంతులను గూడ వెంటవేసికొని వచ్చినాడు. మతి గర్భమున చంద్రికాదేవి యుదయింపబోవుచున్నదని మన్మథు డెఱుకపఱచెను. చంద్రికా శాపవృత్తాంతము నామెకు సవిస్తరముగ వర్ణించి చెప్పినాడు. 'మతి' సంతోషముతో మిన్నందినది. చంద్రిక యామె గర్భమున ప్రవేశించినది. పుట్టిన బిడ్డకు 'మేదినీ చంద్రిక'యని నామకరణ మొనర్చి, మతి యల్లారుముద్దుగ పెంచినది. ఆ శిశువు పుట్టినప్పుడు—'నూరేండ్లు విశుద్ధమైన కీర్తితో నీమె జీవించు'నని యశరీరవాణి పలికినదట! మేదినీచంద్రిక చంద్రునకు చెప్పినట్లు చంద్రోత్సవ మొనర్చెను. పూర్ణచంద్రుడు ప్రత్యక్షమైనాడు. అంతటితో నామె శాపము తీరలేదు. పాపము! రాకా సుధాంశు డిట్లు పలికెను.

"మదనమణి విళక్కాయ్ నీ విళక్కీడు కనృత్
ప్రణయిని! పునరాశాపాంత మస్మిన్ ప్రపంచే
కలిత కుతుకమిన్నే వారసీమంతినీ వా
మపకుడియ మణిప్పూవాణ్ పాక, నిన్ పాదపద్మం."

"మదనమణి దీపమైన చంద్రికా! శాపాంతము వరకును నీవు భూలోకమునందే వసింపుము. వారసీమంతినుల కందరికిని నీ పాదపద్మము సుందరమైన శయ్యగా నుండుగాక!" ఎట్లైనను చంద్రికాదేవికి భూలోకమున నూరేండ్లు వసింపక తప్పలేదు. చంద్రోత్సవముతో నామెకు సిద్ధించిన లాభ మొక్కటే. కుసుమబాణపురి ప్రాణప్రియయైన రోహిణీదేవి యొక ముక్తాహారమును చంద్రిక మెడలో వేసినది. ఇది కావ్యములోని కథ.

మన కళాపూర్ణోదయములోని యేదో యొక చిన్న నిభాము యీ కావ్యమున గోచరించుచున్నది గదా! కాని— సూరన్నశక్తి వేరు. కల్పనాచాతుర్యములో సూరన్నకును—చంద్రోత్సవ కర్తకును సంబంధమే లేదు. ఏదో యల్పాల్పసాదృశ్య మున్నదని మాత్రమే చెప్పితిని. ఈ యిద్దరి కాలముకూడ నించుమించొకటే. 'చంద్రోత్సవ'కవి కొల్లవర్షము ఏడవ శతాబ్దముయొక్క యుత్తరార్థమం దుండెను. అనగా—మన తిళ్ళికోట యుద్ధమునకు సుమారు పదియేండ్లు ముందన్నమాట. జరిగిన పనిలో తప్పిదము చంద్రిక దేనా? చంద్రున కేమి శిక్ష!—అను ప్రశ్న మనమూ కవుల నడిగి లాభము లేదు. నాటి సామాజికారుచి యట్టిది.

పేరునుబట్టియే 'చంద్రోత్సవ ప్రశస్తి'ని చెప్పుటకై యీ కావ్యము ప్రవృత్తమయ్యెనని మన మూహింపవచ్చును. "చంద్రికా మహోత్సవమనియు" "మేదినీ చంద్రికోత్సవ" మనియు దీనికి నామాంతరము లున్నవి. చంద్రికోత్సవములో 'నైదు సంఖ్య'కు చాల ప్రాధాన్యమున్నది. ఆ పద్ధతి ననుసరించి కవి చంద్రోత్సవ కావ్యము నైదు భాగములుగ నొనర్చినాడు. మాలిని—వసంత తిలక—ద్రుతవిలంబితము—మొదలగు వృత్తములతో నీ కావ్యము సాగినది.

చంద్రోత్సవ కావ్యకవి యెవరను విషయము నేటికిని కేరళీయుల కొక ప్రశ్నయే. అట్టే యితని కాలవిషయమునుగూడ. కాని కొందరు సమకాలికులైన కవుల నీతడు స్పృశించియుండుటచే రెండవ సమస్య కొంత సులభముగనే తీరిపోయినది. ఎట్లైనను ఇతడొక 'నంబూద్రి'యై యుండునని వారి యూహా.

ఈ కావ్యము 'మణిప్రవాళ' శైలియం దున్నది. ఈ కావ్యపద్ధతిని సృష్టించినవారు నంబూద్రీలే. వారికి 'సెందమిళ్' భాషతో పొత్తు కుదురలేదు. తాము ఆర్యావర్తమునుండి వచ్చినవారనియు, తమిళము ద్రావిడులభాషయనియు దానిపై వారి కొక చేలిక భావము. అందుచే నంబూద్రీలు కొంతకాలము దేశభాషయందు గాక సంస్కృతమునందే రచనలు సాగించుచు వచ్చిరి. రానురాను 'పాటకజనము'తో వారి సాహిత్యమునకు సంబంధముపోయినది. ఈ ప్రమాదమును వారు గమనించిరి. సంస్కృతమును 'కొడుందమిళము'ను జేర్చి గ్రంథరచన కారంభించినారు. అదియే కాలక్రమమున మణిప్రవాళ మను పేరును సంపాదించికొన్నది. ఈ రచనాపద్ధతి 'లీలాతిలక' కారుడన్నట్లు—త్రైవర్ణికులలో వ్యాపించినది. నాయర్లు—అంతరాళులు—నంబూద్రీల స్త్రీలు—బాలకులు—మొదలగువారు మణిప్రవాళ రచనల నాదరింపదొడగిరి.

లీలా తిలక కారుడు "భాషా సంస్కృతయోగో మణిప్రవాళం" అని లక్షణమును చెప్పెను. భాష యనగా కేరళ మనియే యభిప్రాయము. యోగమనగా—సహృదయులు సమ్మతించుపద్ధతిలో — సంస్కృతము తో జేర్చుట. ఆంధ్ర భాషలో నీ పద్ధతి యుండనే యున్నది. తమిళమందును జైనులు, వైష్ణవులు, మొదలైనవారు తెలుగులో వలెనే సంస్కృతమును యథేచ్ఛగవాడుట కారంభించిరి. కాని, వీనికి 'మణిప్రవాళ' మను పేరు కుదురదు. విభక్త్యంతములైన సంస్కృతపదములతో భాషాపదములను జేర్చినప్పుడే యా పేరు సిద్ధించుచున్నది. మణియను పదముచేత 'భాష'యు ప్రవాళమనుటచే సంస్కృతమును ఈ సమాసము దన్వయింపబడినవి. కాని, మణిప్రవాళమందు వాడు సంస్కృతపదములు సుప్రసిద్ధములై, సుకుమారములై భాషాపదము లను భ్రమ గొల్పుచుండవలెను. 'దేశి'పదము గూడ కేవలము నైఘంటుకము గాక—సర్వ సామాన్యముగ వాడుకదియై యుండవలెను. ఇట్లు రచించిన మణిప్రవాళశైలి—భాషా కావ్యమువలెనే—సామాన్యులలో వ్యాపించి పోవునని వారియూహ. 'లీలా తిలక' కారుడు మణిప్రవాళమును తొమ్మిదిరీతుల వివరించి తెల్పినాడు. పద్యమే గాక గద్యమును గూడ మణిప్రవాళమున వ్రాయవచ్చును. 'లీలాతిలక' కారుని యభిప్రాయము ననుసరించి సంస్కృత శబ్దములకంటెను భాషాపదములే యెక్కువగానుండవలెను. "సందర్భే సంస్కృతీ కృతాచ" అనునొక సూత్రమునుగూడ నాతడు వ్రాసినాడు. దీనినిబట్టి— "కొంకణా"—"తిల్లు రక్షా"—"పోక్కాం చక్రే"—ఇత్యాది పదములును ప్రయోగార్హములైనవి. "పాడిభిః"—"వెన్ మాలికాసు" మొదలైనవి గూడ మణిప్రవాళమున చోటుగల్పించికొనెను. సంస్కృతమును సహింపని తమిళులలో నీ శైలి ప్రచారమునకు రాలేదు. కోయంబత్తూరు నివాసియైన 'కళిమాగ్ విశ్వనాథ'కవి—తమిళమున మణిప్రవాళమును సృష్టించుటకు ప్రయత్నించినాడు. అతని 'కీచకవధ' లోనిదీ క్రింది పద్యము:

2"ముత్తుక్కళాలు మిహానల్ పృవపంకళాలు
మొత్తుక్కలర్తు, తమిషాలపి సంస్కృతేన,
యత్తిక్కలుం దివతు హారలతేవబద్ధా
పుత్తిక్క మత్కృతిరియం సుదృశాం విభూషా"

ఈపద్యమున ద్వితీయాక్షర ప్రాసయున్నది. మళయాళమున నీ నియమము లేదు. తమిళకవి "సుదృశాం విభూషా" అని వాడుట చాల యర్థవంతము. ఆ శైలి నాదరించినది ముఖ్యముగా స్త్రీలే. సాయాహ్న సమయములలో వారు సాహిత్యచర్చలు చేసి కొనెడివారట! వానిలో ముఖ్య విషయములు మణిప్రవాళ కావ్యములే! స్త్రీలుగూడ కొందరు మణిప్రవాళమున కావ్యములు వ్రాసినారు. ముఖ్యముగ నాప్రస్తావమున కాలంబన విభావములు వారే! మళయాళములో "మణి ప్రవాళము" క్రీస్తుశకము 8 వ శతాబ్దమునుండి యారంభమైన దనవచ్చును. మళయాళ సాహిత్యమున కది మధ్యయుగము.

చంద్రోత్సవమువంటి రచనాసౌష్ఠవముగల కావ్యము మణిప్రవాళములో మరియొక్కటి లేదు. అచుంబితములైన భావముల కాతడు పుట్టినిల్లు. అక్కడక్కడ "భారత చరిత్రము" ననుసరించెనని కొందరందురు. కాని, యీ వాదమునకు పెద్ద బలములేదు. కవి చాల విశాలభావములు గలవాడుగ గన్పించును. 'పూనం నంబూద్రి'— 'శంకరకవి' మొదలైన సమ

---

2. "సంస్కృతముతో జేరిన తమిళము—ప్రవాళములతో గూడుకొన్న ముత్తెములవంటిది. ఆ రచన, బద్ధమైన హారలతవలె, కామినీకంఠసీమల శోభింపజేయును"

(తమిళకవి-ద్రావిడమును మణులతో గాక, ముత్యములతో బోల్చెను.)

కాలికుల వారను, ఎంతయో గౌరవముతో చూచెను. అక్కడక్కడ తన వినయమునుగూడ ప్రకటించికొన్నాడు. కాని యావినయము తన శక్తి యెఱుగని అంధప్రాయము మాత్రము గాదు. ఒకచోట కవి యిట్లన్నాడు.

"చరిత మమృతహృద్యం మేదినీ చంద్రికాయా
భువి నిరుపమ మస్మత్ ప్రాతిభం నిర్వివాదం
3అప కేషు మితివృత్తం పూర్ణచంద్రోత్సవం న
4న్నారుమ సుకృతిపాకం నిర్ణయం కర్ణభాజాం"

మణిప్రవాళశైలిని గూర్చి కవి యభిప్రాయమిట్టిది—

"మధుర మధురభాషా సంస్కృతానోన్యసమ్మే
ళన సురభిలయాస్మత్ కావ్యవాణీ విధూత్యా
5తెళియుక పరమిన్నుం మేదినీ చంద్రికా తేన్
6పాషియుమ మొరుకలంబట్ మాలకొండెన్న పోలే.

కావ్యారంభములో తన కిష్టమైన కవుల నందరిని నంబూద్రి వర్ణించినాడు. వారిలో వ్యాస వాల్మీకులు, కాళిదాస భారవులు, బాణ మురారులు గలరు. కాళిదాసును చంద్రోత్సవ కర్త యిట్లు స్మరించెను.

"స్వనిభిరమృత బిందుస్యందిభిః ప్రీణయంతీ
సహృదయ మభిరామై రన్వితా భావభేదైః
సరసమచిత శయ్యా మాశ్రితా విశ్వలోకం
సుఖయతి సుకుమారా కాళిదాసస్యవాణీ!

పై శ్లోకము సంస్కృతమైనను పదముల సౌకుమార్యముతో మణిప్రవాళ రచనయే యనిపించు నంత సుందరముగ నున్నది.

సామాన్యముగ నందరు కవులకువలెనే 'చంద్రోత్సవ' కర్తకును స్వదేశాభిమాన మెక్కువ. దానితో నాతడు కేరళమును చిత్రచిత్రముగ వర్ణించినాడు. భారతదేశమునందలి యితర రాష్ట్రములకు 'చేరము'ను గూర్చి తెలిసినదానికంటె—పదింతలు తెలియనిది. వారు సృష్టించిన సంస్కృత సాహిత్యమునుగూర్చి గూడ యితరుల కెక్కువ తెలియదు. పూర్వకాలమున నైనను కొంత మెరుగగా నుండెను. నేడు మరియు నవ్యాయమైనది. అతడు కేరళములోని కొన్ని క్షేత్రములను వర్ణించినాడు. ఆ వర్ణనముతో బాటు రసికమైన యాతని హృదయమునుగూడ కొంత చవిచూతము గాక! 'చేర'మందు వాన లెక్కువ. ప్రకృతి సంపాదించి యొసగిన యొక మహాభాగ్యము వారికి మలయ పర్వతము. ఆ దేశములోని వానలను కవి యిట్లు వర్ణించును.

"సకలఫలసమృద్ధైః కేరళానాం, ప్రతాపం
7పెరియ, పరశురామ ప్రాజ్ఞయా యత్ర నిత్యం
8కనివోడు మమ9కాలం పార్త10పార్తర్భకానాం
జననిములు11 కొడుప్పానెన్న పోలే వరున్ను.

పరశురాముని యాజ్ఞతో నచ్చట మాటిమాటికిని వర్షాశ్రీ విజృంభించునట! ఆమె దయచే సకల సమృద్ధులను గలుగును. తల్లి శిశువుల యాకలి గమనించి పాలొసగునట్లు—వర్షాదేవి తమ యవసరముల దీర్చుచున్నదని కవి యుత్ప్రేక్షించుచున్నాడు. అనంత క్షేత్రము నిట్లు వర్ణించెను.

"విబుధపురపురంధ్రీ పాణి పద్మార్పితాంభో
రుహ మధురమరంద క్లిన్న పర్యంతభాగం
సుకృత సులభమో12రో సుందరీ మందహాస
ద్యుతి శిశిర మనంత క్షేత్ర మాభాతి యస్మిన్."

—పై శ్లోకమున 'ఒరో' అను నొక్క శబ్దము తప్ప—తక్కినదంతయు సంస్కృతమే. భాషాపదములనే మణిప్రవాళమున నెక్కువగ వాడవలెనని 'లీలాతిలక' కారుడు చేర్పరచిన నియమము. కాని యది కాలక్రమమున నంతరించిపోయినది. లలితమైన సంస్కృతమునే మణిప్రవాళ కవులు విరివిగా వాడిరి. ఈ సంస్కృతమును గమనించిన రసికులు లీలాసుకుడు పండించికొన్న లాలిత్యము మణిప్రవాళశైలీ ఫలమే యనుట గమనింపక పోరని తలతును.

'తృచ్ఛంబరము' ఒక కృష్ణక్షేత్రము. అది కవికిట్లు భాసించినది.

"హరిమురళి నినాదం కోమళం కేట్టు 13జ్రం
14మలియు మఖిల పాషాణాంబు జంబాళితాంతం
ఉచితమమృత మష్టాం గోకులానంద హంభా
రవముఖరిత హర్మ్యం చెమ్మరం భాతి యస్మిన్."

హరిమురళీ నినాదములతో పాషాణములు కరగి యానీటితో తత్ప్రదేశ మంతయు జంబాలితమైనదట! పదలాలిత్య మీ కావ్యమున నెక్కడ పట్టినను

3. అందముగల. 4. ఒకటిగా చేరి. 5. తెలియును. 6. తేనెలు గురియు నొక కదంబపు దండవలె.
7. పెరిగిన 8. ప్రీతిలో 9. వానకాలము 10. చూచి చూచి. 11. స్తన్యము నిచ్చుటకువలె వచ్చును. 12. ఒక్కొక్క.
13. విని. 14. కరగునట్టి.

కనుపించును. దీనిలోనే గాదు. మణి ప్రవాళశైలికి యది యొక లక్షణము. మేదినీచంద్రిక తల్లియైన మణి సంస్కృత సాహిత్యమును చక్కగా జదువు కొన్నది.15 ఆమె శాకుంతలమును, మాళవికాగ్ని మిత్రమును, అద్భుత బంధహృద్యమైన కాదంబరిని, భావ మధురమైన మణిప్రవాళమును నేర్చినట! ఆమె కచ మాలావాహిని యొకతె యున్నది. అది గూడ 'దేశీకవిత్వములలో' మేటి యనుచున్నాడు. తల్లి వలెనే మేదినీ చంద్రికయు మణి ప్రవాళమందును, తక్కిన దేశికవితలలోను నిష్ణాతురాలు.16 వినిని చదివి నపుడు రాయలన్న "భాషకృతి చెప్ప వలదు లప్పద్మ ముఖులు" అనుట హృదయమును తాకుటలో నాశ్చర్యమేమున్నది?

తెలుగు వారమగు మనకు క్రొత్త లనిపించు కొన్ని యపూర్వమైన యలంకారములు—వస్తువులు, వక్రోక్తి విశేషములు, మలయాళ కవులలో దండిగా గన్పించును. ఏ భాషలోనైన నది స్వభావమే గదా! సంస్కృత ప్రసిద్ధములైన కావ్య విశేషములు గూడ నొక భాషలో ప్రసిద్ధమైనవి మరియొక దానికి క్రొత్తగా నుండును. అట్టివాని నీక్రింద కొన్ని చూపుదును. 'మతీదేవి' 'వాతావఘూర్ణిత నవకుంకుమ వల్లరి' వలె నున్నదట! ఈ యుపమానము సంస్కృత కవులది కావచ్చును. తెలుగులో నిది ప్రసిద్ధికి రాలేదు. అట్లే, యామె కేశపాశము 'తిమిర శ్రీ వల్లరీ పల్లవాభము' అనునది గూడ. అలిక తిలము 'శీతకాంతర్ధలాభ'మట. శీతకాంతర్ధలాభ మగు—'కలిదాసు' చిలువగవు మాత్రమే మనకు బరిచితము. అనిష అఱచేతు లెఱ్ఱగా నున్నవి. అవి బింబఫల గర్వము నణచునట!17 కోకిల రుతములు రతినాథ చాప క్రేంకారము లనుచున్నాడు. మేదినీ చంద్రిక కాంతిప్రభాపటల కస్తూరికాంగ వల్లియట! భట్టబాణుని కవిత్వము 'భ్రాంతీ బాహువల్లీ ముఖగీతిమణివీణ'యట! మేదినీ చంద్రిక యొక్క నాసిక మన్మథుని సేవ కుపయోగపడు బంగారు కాళాంజివలె నున్నది.18 ఇట్టి నూత్నములైన వస్తువు లెన్నియైనను చూపవచ్చును. కొన్ని యలంకారములు తెలుగువారివివలెనే యుండును. అనగా సంప్రదాయ సిద్ధములన్నమాట! ఈ క్రింది వట్టివి.

"తుషారధామా నిశి నిర్మలాని
మరందవాహాం వదనాని పశ్యన్
మణిస్థలీషు ప్రతిమాచ్ఛలేన
పాద ప్రణామం వితనోతి యస్మిన్".

ఇది సంధ్యాకాలవర్ణనము:

"అపరజలధివీతే హంతి! దంతీ కణక్క
దివస కరకరాళీ పాటలాభూన్మనోజ్ఞే
కనల్ నమువిల్ విశ్లాం విద్రుమ శ్రీ మయూఖా
వలి, విలుతి విలక్షే ప్రాక్షి నిల్కున్న పోలే!"

పశ్చిమ సముద్రముపై సూర్యబింబము నిలిచి నది. అతని కిరణములు కెంధీగలవలె నెఱ్ఱగానైనవి. సముద్ర మధ్యమున నున్న ప్రవాళవల్లుల కాంతు లాకాశమునకు మిట్టించిన ట్లున్నవట! వినగ దమృతమై క్రొత్తగా యుదయించిన చంద్రబింబము మేదినీ చంద్రిక యొక్క 'పూర్ణ సౌభాగ్యదీక్షా కలశము'వలె నున్నదని కవియుత్ప్రేక్ష. కాని ప్రబంధ కవిత్వమును రుచిచూచిన తెలుగువారియెదుట నివి యన్నియు కుప్పిగంతులు. కల్పనా ప్రపంచమున నాంధ్రప్రబంధ కవులు పోయిన పోకలు సంస్కృత కవులే పోలే దట! మరి యితరు లేమి లెక్క? కాని యా యలంకారములలో నా దేశ సంప్రదాయమును బట్టి, మనకు క్రొత్తవనిపించు కొన్ని భావనలుగూడ నుండకపోవు. ఈ క్రింది యుత్ప్రేక్షాలంకార మట్టిది.

"చరమశిఖరిపీఠే పాటలం నారికేళం
ద్యుమణి వలయరూపం విచ్చ19 విచ్ఛిన్న ధారం
జగతికు20గుతి తర్పి తృప్తి21 డివాన్ చూడో22షిప్రా
నఖిల భువనభాజా మం23తిమాం మంత్రవాది."

మధ్యాహ్నపు టెండలలో జనులు తపించి పోయినారు. జ్వరము వచ్చినట్లైనది. దానిని పోగొట్టు

15. శాకుంతళం తదను మాళవికాగ్ని మిత్రం
కాదంబరీ చరిత మద్భుత బంధహృద్యం.
కుట్టం మరంద మెంళి వైకిన కూకుదారా
కుత్రాగ భావమనుసరంత మణిప్రవాళం.
16. భాషావిశేష మెందుప తీసవుంపడిచ్చా
శయ్యాండివే కుసుమ సాయక కేతుమాలా.
17. 'బింబోకసంబ
ప్రశమనమతియుద్ధం కై తలం బద్దలీలం.
18. 'రతిసహచర పొన్నిన్ కేళికాళాంజనాసా.'
19. ఉంచి, 20. ఒలితో, 21. తృప్తిపఱచెను.
22. ఉష్ణమును తగ్గించుటకు 23. సంధ్య యాసెను.

టకు సాయంకాలమున మంత్రవాది పూనుకొన్నాడు. పశ్చిమ పర్వతమను పీఠముపై సూర్యబింబమును టెంకాయనుంచి యరుణాయమానమైన సంధ్యా కాంతియను వసంతమును దిగదుడిచి వేసినాడట! సూర్యబింబమును నారికేళముతో పోల్చుట మన కొక వింత. అట్లే సంధ్యాదేవి పురుషు డగుటయు.

శ్రీ మంగలసౌధమందు మేదినీ చంద్రిక చెలికత్తెలతో చంద్రోత్సవమెట్లు చేయవలెనని విచారమును సాగించినది. ఆమె చెలికత్తెల పేర్లు చాల వింతవైనవి. 'మానవి మేనక', 'మారచేమంతిక', 'కనకావలి', 'తెన్నాత్తవి', 'ఉణ్ణనీలి' మొదలైనవి. ఈ 'యుణ్ణనీలి' ఆకాలమున నొక ప్రసిద్ధురాలైన నాయిక. ఈమెను గూర్చి "ఉణ్ణనీలీ సందేశ"మను నొక కావ్యమే యున్నది. మానవి మేనక ఆ కొలువున కూర్చున్న 'తోజ'ను కవి యిట్లు వర్ణించెను:

"అథోపధానే పునరంకసంస్థే
విచిత్రవర్ణే వినివేశితేన
కరేణ నానా భరణోజ్జ్వలేన
24మురద్భ్య దంతాంబర మంబుజాక్షీ.
"తాంబూల పీఠీం శశికల్ప కల్పా
రాజీ దినీం దాతు మనుప్రవృత్తాం
అప్తాం వధూటీ 25మరికే నివర్ణాం
నివార్యకై 26కాంచలసేన గూఢం
"మనోభిరామేణ మృగుస్మితేన
క్షీరాంబురాశిం పునరుక్తయంతీ
అమ్యాత్మవతీ మేనకా మానసియ
ముపాదదే వాక్యం మనర్ఘశీలా"

—'మారచేమంతిక' వాక్యములు "మనోజ్ఞవర్ణములై" "సువిచిత్ర బంధములై" యుండెను. "నిరస్తదోషములు", "సగుణార్థ పుష్టము"లైన యాపలుకులు నవోకవి వాక్కులవలె సుప్రసన్నములుగా నున్నవని కవి యిచ్చిన 'తాకీదు'. చంద్రోత్సవము శాస్త్రవిహితము కాదనియు కవు లొనర్చిన కల్పనమాత్రమేనని కొందరందురు. ఈ వాక్యమంత యాదరణీయముగ దోచుటలేదు. సంస్కృత గ్రంథములందే గాక ద్రావిడ గ్రంథములందును దీని విషయ మక్కడక్కడ వర్ణింపబడినది. 'శిలప్పదికారము'లో చంద్రోత్సవము వర్ణితమైనది. కామ వసంతోత్సవములుగూడ పేర్కొనబడినవి. మన్మథోత్సవము ఫాల్గుణమునను, వసంతోత్సవము చైత్రమాసమునందును, చేయుచుండిరి. చంద్రోత్సవము శరత్కాలములో సాధారణముగ కార్తికమాసమున నొనర్తురు. ముద్రారాక్షసమందు "అహో! శరత్సమయ సంభృతశోభానాం దిశా మతిరమణీయతా" అని చంద్రగుప్తుడు శరత్తును వర్ణించి, కౌముదీ మహోత్సవము నొనర్పవలెనని యాజ్ఞాపించును. దానిని చాణక్యుడు నిలుపును.

"సాకం స్త్రీభి ర్భజంతే వర మఖిలషితం
పార్వణం పౌరముఖ్యాః"

అనెడు ముద్రారాక్షస శ్లోకమునకు దుండిరాజు యిట్లు వ్యాఖ్యానమొనర్చెను.

"పర్వణి కార్తిక్యాం పౌర్ణమాస్యాం భవం క్రీడావిధిం." "కౌముదీ కార్తికోత్సవః సతు కార్తిక పూర్ణిమాయాం కర్తవ్యః." అని త్రికాండశేష వ్యాఖ్య. మల్లినాథుమాత్ర మిదియొక దీపోత్సవ విశేషమని చెప్పెను. పై వ్యాఖ్యలనుబట్టి కౌముదీ మహోత్సవమే చంద్రికోత్సవమని మనము తీర్మానింపవచ్చును. ఈ కావ్యమందును, చంద్రోత్సవము శరత్కాలమందే చేయబడినది. కవి శరత్కాలము నిట్లు వర్ణించినాడు.

"అథ నిలా27వు మణి28క్ష మలాంబరా
నళినమెన్ను 29 ముపాయన ధారిణీ
శర దసీవతి మేదిని వణ్ణిలా 30
వినె మనోభవ మోహన పింఛికా."

పూర్వకాలమున చంద్రోత్సవమును స్త్రీపురుషు లిద్దరును నొనర్చుచువారు. క్రమముగా నది స్త్రీలకు మాత్రమే చెందిన వేడుకయైనది.

మేదినీ చంద్రిక తమ చంద్రోత్సవమున కాచార్యునిగా "వరకప్పిళ్ళి నంబూద్రి" నెన్నుకొన్నదట! అతని మాటలనుబట్టి మనకు మరికొన్ని చంద్రోత్సవ విశేషములు తెలియును. అవి యీ క్రిందివి.

"శరత్కాలమందలి శుక్లపక్ష ఏకాదశి మొదలు పున్నమవరకును చంద్రోత్సవము నొనర్పవలెను. కామదేవుని రైదు బాణములతో చంద్రుని పూజింపవలెను. ఉత్సవ దినములకు వరుసగా నా శరముల పేరు పెట్టవలెను. ప్రతిదినమును రాత్రులలో నైదుసారులు చంద్రునకు పుష్పాంజలిని సమర్పింపవలెను! ఐదుప్పరిగలుగల మేడలో నీ వ్రతము ననుష్ఠింపవలెను. మొదటి

---

24. అవ్వగించి. 25. సమీపమున. 26. చేతితో.
27. చంద్రుడు 28. ధరించి 29. అనెడు
30. మేదినీచంద్రికను.

దినమున మొదటి యుప్పరిగలో పూజ నారంభించి, క్రమముగా నైదవ దినమున నైదవ యుప్పరిగలో పూజను ముగింపవలెనట! దీపములు మొదలైనవిగూడ నైదైదు రకములుగ నుండవలెనని నంబూద్రి యాజ్ఞ. ఈ తంత్రము "ప్రయోగసారా" దిగ్రంథములో నున్నదట! 'మారచేమంతిక' చంద్రోత్సవమునుగూర్చి కొన్ని విశేషములు చెప్పుచున్నది. ఆమె వాక్యము లివి. "స్త్రీలు చంద్రోత్సవము చేయవలెను. రాజుల కింద్రోత్సవము విధి విహితము. ఈ రెంటికిని ఫలము లోకోత్తరత్వము. వీనిని నిష్ఠతో నిర్వహించినవారు "చంద్రార్క వత్యోజవతిరైన త్రిలోకి"ని పాలింతురు. ఇదియొక యుత్ప్రేక్ష. ఇంద్రోత్సవముతో వసుధాధిపులకు బ్రహ్మాండమైన సంసారభోగములు లభించును. స్త్రీలకు సౌభాగ్యమే ఫలము. ఇంద్రోత్సవము మను ప్రణీతము. రెండవది ముని ప్రణీతము. మారచేమంతిక తన సిద్ధాంతము నిట్లు తేల్చి వేసినది.

"కేశాంగనా వృత్తి రియం వికీర్ణా
విరాజతే సంప్రతి కేరళేషు."

మేదినీ చంద్రిక యొనర్చిన యుత్సవములకు స్వయముగా—"కంపెన్ కోదరాజు" వచ్చినాడు. అంతే మాత్రమే గాదు. పదునెనిమిది సంఘములకు చెందిన పండితులు వచ్చిరట వీరిలో నారుసంఘములవారు వైయ్యాకరణులు. తక్కిన యారుసంఘములవారు ప్రాభాకరులు. మిగిలినవారు భాట్టులు. కొన్ని నాడుల నుండి యవ్వనమునకు, రూపమునకు పేరుపోయిన యువతులుగూడ నరుదెంచిరి. వీరే గాక శృంగార రసమున వందవేసిన నాయికలను కొందరిని నామ నిర్దేశములతో కవి పేర్కొనెను. వారితోపాటు కొందరు కవులును వచ్చిరి. "కేనాపి కేరళ వధూహృదయారవింద బాలాతపేన కవినా కలితాపదానా" అని కవి యొకతెను వర్ణించెను. ఈ శ్లోకమున సూచింపబడినవాడు శంకర కవి.

"మధురమధురభాషా పద్యకోలాహలం కొం[31]
డులక ఖిలములిక్కుం వల్కవీంద్రానుయాతా"

పై చరణమున చంద్రోత్సవ కాంతుడు వేరొకతెను వర్ణించెను. ఇందు సూచింపబడినవాడు పూనం నంబూద్రి. ఇంతమాత్రమే గాదు. ఇంకను చిన్న పెద్ద కవులెందరో వచ్చిరట! వారు పూజావసానమందు చక్కని పరిమళముగల భాషాపద్యబంధములతో రాకాసుధాంశుని పొగడిరి. ఆ పొగడింతలు రోమోద్గమమును గలిగించుచుండెనట! ఆంధ్ర కవుల కంటెను మలయాళ కవులు శృంగార రసపోషణలో నూరాకు లెక్కువ చదివినవారు. జీవితములలోగూడ నంతే. కొన్ని రచనలు వినుట కసహ్యముగనున్నను గొన్నిట వారు జూపిన ప్రతిభ యనన్యసామాన్యమైనది.

తాను వర్ణింపబోవు కథకు దగినట్లుగా కవి శివశిరస్సునందున్న చంద్రరేఖను వర్ణించుచు, కావ్యము నారంభించినాడు. అట్లే కడపట నిఖిల భువనసాక్షియైన బాలశీతాంశుమాలిని స్మరించెను. శివార్పణ మొనర్చుట శైవాచార సంపన్నుడైన నంబూద్రి కెంతయును దగినదిగదా!

చంద్రోత్సవ కావ్యములోని కొన్ని మరచి పోదమన్నను మరపునకురాని శ్లోకము లున్నవి. అట్టి వానిలో నీ క్రింది దొకటి:

"లోకత్రయీ విజయ దీక్షిత మారవీర
సామ్రాజ్యమంగల మణీధ్వజవైజయంతీ
వత్సా దురోద విధురాంగలతాచికేణ
శ్రీమన్ముకుందమురళీ మధురస్వరేణ!"

పదసన్నివేశమెంతో కోమలముగా నున్నది. చంద్రోత్సవ కావ్యములో ముఖ్యముగ గనుపడున దీ సుగుణమే! కాని, మేదిని చంద్రికయే స్వ "శ్రీమన్ముకుందమురళీ మధురస్వర" మనునప్పుడు మాత్రము మనకు నవ్వు రాకతప్పదు. నవోఢయైన పార్వతీదేవి కవిచే నిట్లు వర్ణితమైనది.

"పరమశివముఖాంభోజాతలోకేనపి నే
మిషేః శిలవన్రమం, విస్మృత శ్రీకపర్దే
కుతుకి శశికలాయా మత్ప్రికంపం భుజంగే
జయతి తిరువిషిత్తైల్లద్రి రాజాత్మజాయాః."

మలయాళభాషలో చంద్రోత్సవ మొక యపూర్వమైన కావ్యము. తెలుగువారమగు మనకు దాని యితివృత్త మెంత క్రొత్తదో యాపదలాలిత్యముగూడ నంతే యపూర్వమైనది. ఆ కావ్యము చదివినవా డెవ్వడును దానిని "బాగున్న"దని చెప్పక మానలేడు.

---

81. భాషాపద్య కోలాహలములో ప్రపంచము నూగించెడువట్టి.

# నేటి సాహిత్య విమర్శ

జ్వలతి చలితేంధనోఽగ్నిః
విప్రకృతః పన్నగః ఫణాం కురుతే,
ప్రాయః స్వం మహిమానం
క్షోభాత్ ప్రతిపద్యతే హి జనః.

కొరువులు కదిలిస్తే అగ్ని భగ్గుమంటుంది. పాకిస్తే పాము పడగ విప్పుతుంది. కలవరం పుట్టిస్తే మానవుడు స్వస్వభావాన్ని చిక్కబట్టుకుంటాడు — అన్నాడు కాళిదాసు; ప్రకరణాంతరంలో. ఈ సూక్తిని మనం సాహిత్యరంగానికి సమన్వయించుకుందాం, ప్రస్తుతం.

ఆత్మవిమర్శలాగే ప్రతి విమర్శా అవసరం. సానబట్టినే కాని వాసిపుట్టదు కదా మరి? అందులోను వ్యష్టి సమష్టుల భూతభవిష్యద్వర్తమానాలతో పెనవేసుకొన్న సాహిత్యానికి విమర్శ పరామర్శాలు మరీ అవసరాలు. మానవుడు ఏవేవో కలలుగంటాడు, ఊహిస్తాడు. వాటిని మొదట సాహిత్యంలో సాక్షాత్కరింపచేసుకుంటాడు; వాటి సాధ్యతాసాధ్యతల వివక్షగాక జీవితంలోను వాటిని సాధించడానికి పూనుకుంటాడు; కొంత సాధిస్తాడు; మరికొంత సాహిత్యంలో మిగుల్చుకుంటాడు. మరలా కలలూ, కలం, కార్యసిద్ధి — ఈ శృంఖలిక నిరంతర. కనుక సాహిత్యరంగంలో విమర్శ విధాయకమన్నది దర్శిత దర్పణం.

విమర్శనంటే గుణదోషాల సాకల్య సమీక్ష కాని, గుమ్మెత్తిపోవటం కాదు. అప్పుడే అది సద్విమర్శ మౌతుంది. కాని మన విమర్శదృష్టి గతాన్ని చొచ్చుకుపోయినంత తీవ్రంగా వర్తమానంలో చొరదు. సమకాల విషయంలో ఏవో జంకు గొంకులూ, దాక్షిణ్యదూషితబుద్ధులూ బయలుదేరుతాయి. అందుకోసమే "ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!" అన్నారు చేమకూర వేంకటకవి.

కాని, నిజానికి సమకాలిక విమర్శ ఉద్ధృతంగా ఉండక తప్పదేమో! ప్రతి యుగానికీ కొన్ని స్థిరమైన సంప్రదాయాలు ఏర్పడి ఉంటాయి. ఏదైనా గ్రంథం వెలువడితే అది విమర్శకు యోగ్యమా, కాదా అన్న ప్రశ్న ఉదయిస్తుంది. కాదన్నప్పుడు ఉపేక్షితమై కాలగర్భంలో లీనమౌతుంది. యోగ్యమన్నప్పుడు ఆ రచన కొంత వ్యక్తిత్వం కలదై ఉండక తప్పదు. ఆ వ్యక్తిత్వం కళాత్మకంగా ఉంటుందనడం చెప్పనక్కరలేదు. అది సమకాలిక సంప్రదాయాలకు, అభిరుచులకూ అనుగుణంగా — సన్నిహితంగా — ఉండటం కష్టం. కొంచెం ముందూ వెనుకలుగా ఉంటుంది. కనుక విమర్శకునికి సంతృప్తి కలిగించకపోవచ్చు; అతని మనఃప్రవృత్తి భిన్నమైనప్పుడు సంతృప్తిని కలిగించనూవచ్చు. ఏ దృష్టితో చూచినా, పొగడ్త అయినా, తెగడ్తయినా తీవ్రంగా ఉండటం — సహజం. విమర్శకుడు వెనుక చూపు కలిగిన సమకాలిక సంప్రదాయవాది అయితే అభినివేశంతో ప్రశంసిస్తాడు; కొంత ముందుచూపు కలవాడైతే తీవ్రంగా అభిశంసిస్తాడు.

విదేశాల్లో సమకాలిక విమర్శ తీవ్రంగాను, నిష్పాక్షికంగాను, ఒకప్పుడు ప్రమాదకరంగానూ ఉంటుంది. మూడు నాలుగు దశాబ్దాలక్రితం సుప్రసిద్ధ మనస్తత్వశాస్త్రజ్ఞులు ఫ్రాయిడ్, ఎల్లిస్‌లకు జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలు పరికిస్తే చాలు సమకాలిక విమర్శ ఎంత తీవ్రమో తెలుస్తుంది. కీట్స్ 'బ్లాక్ వుడ్స్' పత్రికలో తన రచనలపై వెలువడిన విమర్శలకు గుండె పగిలి అకాల కాలధర్మం చెందాడంటారు. వర్డ్స్‌వర్త్ మహాకవి ఎంతో తీవ్ర విమర్శకు తట్టుకోవలసి వచ్చింది.

విదేశాలవరకు ఎందుకు? మనదేశంలోని ప్రాచీన విమర్శ సంప్రదాయం ఎంత తీవ్రమైంది! దానికి నిలువదొక్కుకోగల రచనే నిలుస్తుంది కొంతకాలమూ, కలకాలమూను. సమకాలపు అభిరుచులకు సరిపడేవాటి విషయంలో స్థాలీపులాకన్యాయం పర్యాప్తమౌతుంది కాని, కొంచెం ముందూ వెనుకగా ఉన్న రచన విషయంలో సముద్ర మథనం తప్పని సరి.

మన విమర్శన పద్ధతికి నికషం వ్యాఖ్యానపద్ధతి. మహావ్యాఖ్యాత మల్లినాథసూరి చప్పున మనకు జ్ఞాపకం వస్తాడు వ్యాఖ్యానం అనగానే.

"పదచ్ఛేదః పదార్థోక్తిః
విగ్రహో వాక్యయోజనా,

ఆక్షేపస్య సమాధానం
వ్యాఖ్యానం పంచలక్షణం"

అన్న నిర్వచనంలో సంగృహీతమైంది మన విమర్శనమంతా. దీనిలో వ్యాఖ్యాత వివిధ శాస్త్రాది పాండిత్యం వ్యక్తమైంది. మల్లినాథుని వ్యాఖ్యానం చూస్తూ ఉంటే మూలకారుడే మరల ఆ రూపంలో అవతరించి వ్యాఖ్యానిస్తున్నాడా?—అన్నట్టు ఉంటుంది, ఒకో కప్పుడు.

ఆలంకారికుల విమర్శపద్ధతి మనమందరికీ తెలిసిందే. దాని పర్యవసానమే భామహాలంకారం మొదలు అలంకారమణిహారం దాక ఉన్న వివిధ చర్చా గ్రంథాలు.

రాజాస్థానాల సంగతి మరింత రంజకం. ఆ ఆస్థానాలలో దిగ్గజాల వంటివారు—కొన్ని పుష్కరాలపాటు శాస్త్రాలు అవలోడించినవారు—ఉండేవారు. సాహిత్య గోష్ఠులకు, శాస్త్రవాక్యార్థాలకు అధ్యక్షత వహించే రాజుకో, అభిమానికో అన్ని విషయాలూ ఎంతో కొంత తెలిసి, గుణదోష వివేకం ఉండేది. ప్రతిదాన్నీ 'స్తనకల్య' పరీక్ష చేసేవారు పండితులు. ఒక శ్లోకం చదివితే దాని అన్వయాకాంక్షలు మొదలు, అంతరార్థాల వరకూ చర్చ హోరాహోరీగా సాగేది. ఒకో కప్పుడు కొంటె సమాధానాలు, కుంటి ప్రశ్నలూ చెలరేగేవి.

రాయలవారి ఆస్థానంలో జరిగినట్టు చెప్పే కథలు కొన్ని మనం విన్నవే. రామరాజభూషణుడు వసుచరిత్రను ఆస్థానంలో చదివి వినిపించడానికి ఉపక్రమించి "శ్రీ భూపుత్రి వివాహ వేళ" అని ప్రారంభించగా, రామలింగడు లేచి 'శ్రీభూ' అని పూత్కారంతో చదివి దీపం ఆర్పివేసి, ప్రారంభంలో అనిష్టసూచకాక్షరాలు పడ్డాయని ఆక్షేపించాడట. అలాగే పెద్దన "ఇంతలు కన్నులుండ తెరువెవ్వరి వేడెదు భూసురేంద్ర" అని చదివినప్పుడు "ఇంతలు అంటే ఎంతలు?" అని ఆక్షేపించి చిటికెపట్టి, చూపుడు వ్రేలిని కొంచెం ముందుకు పోనిచ్చి "ఇంతలా?" అని ప్రశ్నించాడట. పెద్దన చేరెడు పట్టి చూపుతూ "ఇంతలు" అన్నాడట. ఇలా వివిధాలుగా సాగేవి విమర్శలు.

ఇక పండిత పరిషత్తుల సంగతి వేరుగా వివరించనక్కరలేదు. వాక్యార్థ ధోరణి అతి తీవ్రంగా, యుద్ధోన్మాదంగా, సంహారకాండగా ఉండేది. కాని, అదంతా వాదంవరకే, వైయక్తికంగా రాగద్వేషాలు లేవు. రచన, శాస్త్రవిషయం క్షుణ్ణంగా చర్చితమై నిగ్గుదేరాలన్నదే పరిషత్తు పరమార్థం. వాదతీవ్రతలో వైయక్తిక దూషణ తిరస్కారాలు కూడా లేకపోలేదు క్వచిత్తుగా. పరస్పరం శపించుకోవడం, న్యాయస్థానకు ఎక్కడం కూడా కద్దు. అయినా, అదంతా పాండిత్య ప్రకర్ష ప్రఖ్యాపనకే; వ్యక్తిగత సౌశీల్య దౌశ్శీల్యాల ప్రసక్తితో కాదు.

రచయిత తన రచనను చదివి వినిపించడం, ఎవరో ఒకరు ఆక్షేపించడం, మరొకరు సమాధానం చెప్పడం, దానిపై మరొకరి కోటి, దానిని ఇంకొకరు పూర్వపక్షం చేయడం, రచయిత అభిప్రాయం తెలుసుకోవడం, సిద్ధాంతీకరించడం—ఇలాటి ప్రాచీన సంప్రదాయాన్ని ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు చాలకాలం పాటించేవారు.

మన ప్రాచీన సాహిత్య పత్రిక "అముద్రిత గ్రంథ చింతామణి" సాగించిన సమకాలిక విమర్శలు కూడా నిష్పాక్షికంగానూ, ధీరోత్తంగానూ ఉండేవే. "ఈ నరమాంస విక్రయము మన కన్యాశుల్కము ముఖ్యముగ నింగ్లీషు వాసన తెలియని వారిలో నిపుడు జరుగుచున్నది. దాని నాపవలయునని గ్రంథకర్తగారి యుద్దేశము. అట్టివారికి స్పష్టముగ తెలియుటకై గ్రామ్యోక్తు లిందు చేర్పబడినవనుటకై మే మూహించితిమి. ఇట్టి గ్రంథములకు సలక్షణమగు గ్రాంథికభాష నిరుపయోగము గాన 'శశిరేఖ' యభిప్రాయముతో, మే మేకీభవింపము గాని యింగ్లీషుపదములు విశేషముగ చేర్చినందులకై మాత్రము కొంచె మాలోచించుచున్నారము. గ్రంథకర్త యభిప్రాయానుసారముగ నీ కాలమునందలి తెలుగు సంభాషణలలో నింగ్లీషు పదములు చేరుచున్న వనుట నిజమే. అయిన నరియందరకు వాడుకగా నుండు పైపు కాలువ, మిటికి లేమన్...అనునట్టి సర్వసాధారణ పదములవలెగాక సింప్లిసిటీ, లవ్ సిగ్నల్స్, ఇన్సిన్సిరిటీ, కంపారిజన్, డ్రెడ్ఫుల్లీ ఇన్ లవ్—లోనగు నపూర్వపదము లింగిలీషు రానివారి కెట్లు బోధపడునో తెలియదు. సర్వసాధారణముగు సంభాషణ కానందున గ్రంథకర్తగారి యుద్దేశమునకు భంగము కలిగినదని సంశయించుచున్నారము. నాటకరంగమున నిట్టిమాట లుచ్ఛరించుటయు వందులకై లోకము నవ్వుటయు నొక ముఖ్యోద్దేశము కాదుగదా! అర్థముగానినాడది బధిర శంఖా

రావమే గాని వేరు గాదు...ఇంగ్లీషు పదములలో వాడుకలో నుండువానిని ప్రయోగించినచో నా భాషా జ్ఞానము లేని వారికి దెలియునని మా వాదము గాని, వాని బొత్తుగా బ్రయోగింప గూడదని కాదు. ప్రాకృతమునకు ఛాయ వ్రాసినట్లుగ నట్టి వాడుక లేని యింగ్లీషు మాటలకు నొక తెలుగర్థముగల ధాతు సంపూర్ణముగ నున్నను గొంత మేలని తోచెడి. ఇది నాటక రంగమునకు నిష్ప్రయోజన మైనను జనులకు గ్రంథము జదువునపు డుపయోగపడునని నమ్ముచున్నాము..." (1899 మార్చి సం-10, సంచి-3) అని ఈపత్రిక గురుజాడవారి కన్యాశుల్కాన్ని విమర్శించింది.

"నలచరిత్రమును దమ యిష్టానుసారముగ గొంత మార్చి, మరికొంత జేర్చి యిందు వ్రాసియున్నారు. పీఠికలో వ్రాయబడిన విధముగ నేది యెట్లున్నను నల దమయంతులకు బరస్పరానురాగము గలిగించిన హంస ప్రచార మిందు లేకుండుట కథకు లోపము గలిగించుచున్నదని మా యాశయము. సంస్కృతాంధ్ర నైషధ గ్రంథములయందును హంస ప్రస్తావ మున్నది గదా! ఇట్లెవరికి వారిష్టానుసారముగ గ్రొత్త గ్రొత్త యుక్తుల గల్పించి వ్రాసినచో గొంతకాలమునకు నలుని చరిత్రలో ననేక భేదము లగపడి వాస్తవము మరుగు పడుచున్నది. ఇంకను గొన్ని నూతన కల్పనలు వ్రాయబడియున్నవి. మూలానుసరణముగ వ్రాయవలయునని మా యిష్టము. అప్పుడెట్టి శంకయుం బుట్టదు గదా!" (1895 మే. సం-8, సంచి-5.) అని చిత్రనళీయాన్ని విమర్శించింది. విమర్శ ఎంత ఉదాత్తంగాను, సంయమ సంయుతంగాను ఉందో పాఠకులకు విదితమే.

కవులు తమ కావ్యం ప్రజల సొమ్ము అనుకున్నప్పుడు, విమర్శకుడు తన విధి సంఘసేవ అనుకున్నప్పుడు, ఈలాంటి సద్విమర్శ సాధ్యం. అప్పుడు సంయమం, సహృదయత వాటంతటవే అగుపడుతాయి. అయితే, కవి తన రచన ప్రజల దనుకోడం, విమర్శకుడు తన పని సంఘసేవ అనుకోడం—ఈ రెంటికీ యౌగపద్యం కూడా అవసరం. ఈ రెండిటిలో ఏ ఒక్కటి ఉన్నా ప్రయోజనం విపరీతమే. కవి తన రచన—తన సృష్టి కనుక—గొప్పదనుకుని మురిసిపోతాడు. అందువల్ల ఏలాటి విమర్శనూ సహించలేడు. ఈ అసహనం చూచి విమర్శకుడు మరీ మరీ రెచ్చగొడుతాడు. కనుక విమర్శ అభివృద్ధికి—వాదోపవాదాల అర్భటి ఎలాంటిదైనా సుఖాంతమైన—సహనం మూలబంధం కావాలి.

ఈ సహనం మనలో ఇతరజాతుల అభ్యుదయం చూచైనా అభివృద్ధి కావలసింది; స్వాతంత్ర్యానంతరం, పొంగి పొర్లవలసింది; పరాయి పాలనవల్ల కలిగిన అసహనం, అసంతృప్తి కూకటివేళ్ళతో కూలిపోయాయి గనుక. కాని ఎందుకో అలా జరుగలేదు. పరాయివాడు మెందుతూ ఉన్నప్పుడే మనలో మనం సహనంతో మెలిగేవారమో నన్న అభిప్రాయమూ పాతుకుంటూంది కొన్ని రంగాల పరిణామ విపర్యాసం చూస్తే. స్వాతంత్ర్య సముపార్జనతో సమసిపోవలసిన కులమత తత్త్వం—విశృంఖలత కారణంగానో ఏమో మరింత సత్తువ చేకూర్చుకుని సాహిత్యరంగంలో తిష్ఠ వేసింది. పదవులు, ప్రాపకాలు, ఎన్నో దాక్షిణ్యాలు—వీటితో విలువలకే విచిత్ర పరిస్థితులు ఏర్పడ్డాయి. సహన సురభిలమైన కవిహృదయమూ, చిత్తశుద్ధి చిందులాడే విమర్శకుని మనస్సూ ఈ విపరీత పరిస్థితిలో తమస్థాయిని నిలుపుకోడం ఎలా? రాజకీయ రంగంలోని కుక్కమూతి పిందెలు సాహిత్యరంగంలోను పుట్టుకు వచ్చినప్పుడు, దానిలోని ముఠా మనస్సు ఇక్కడా ముందుకు వచ్చినప్పుడు సద్విమర్శ—విమర్శ వికాసం—ఎలా సాధ్యం? వక్తలోను, స్వీకర్తలోను సహృదయతతోపాటు సంయమం అవసరమని ఇదివరకే గుర్తించాము. ఇప్పటి విద్యా విధానం అలాటి సిసృక్షాశక్తిని కాని, సంయమాన్ని కాని, మనస్సును కాని పెంచిందా—అంటే వీరా మేషాలు లెక్క పెట్టవలసిందే. కనుకనే విమర్శకుని దృష్టి కామిలా దూషితం కావడం, రచయిత దృష్టి అహంపూరితం కావడం సంభవించింది.

సద్విమర్శ రావడానికి కావ్యం—చిన్నదైనా, పెద్దదైనా—విశిష్టత ఉండాలి. దాని కొక ప్రతీక స్థాయి ఏర్పడాలి. దాన్ని గుర్తించడానికి కొంతకాలం పడుతుంది. ఇప్పుడు వస్తున్న రచనలలో చాలవాటిలో సాంఘిక దృష్టితో పరిశీలించినా, శాస్త్రీయదృష్టితో తరచినా పరిణతి చాలదు; కనుక పండిత విమర్శకుల దృష్టికి ఆగడంలేదు; ఆగేవి కొన్ని ఉన్నా, వాటి రచయితలు విమర్శనను సహించరు.

కొందరు స్వాతంత్ర్యోద్యమం పుణ్యమా అని ప్రబోధకావ్యాలు వ్రాసి పెద్దవారయారు. వారిని కళాదృష్టితో కాని, విషయైక దృష్టితోగాని విమర్శించడం సాధ్యం కావడంలేదు. అలాగే కొన్ని కవితా ప్రస్థానాలకు మూర్ధాభిషిక్తులై ముడుముడు

కూర్చున్నవారూ ఉన్నారు. వర్తమాన స్థితిగతుల్లో ఆ ప్రస్తావాలనుగాని, కవిత్వాన్నిగాని, సూటిగా, సునిశితంగా విమర్శించడం విద్వేషం కోరి తెచ్చుకోడమే; పగ పెంచుకోడమే. అలాంటప్పుడు విమర్శకుడు రచయితతోనో, రచయితృవర్గం (ముఠా)తోనో సామానాధికరణ్యం గల అంతా లే ఏరుకొని శ్వేతాంబర సంయములలాగా చూచి చూచి, తడివి తడివి అంగలు వేయవలసి వస్తుంది; వేస్తున్నాడు. "ఇదేమిటండీ మీరు పరోక్షంలో అలా అన్నారు; ప్రత్యక్షంలో ఇలా అంటున్నారు. అంతరంగంలో అలా అన్నారు; బహిరంగంలో ఇలా అంటున్నారు!" అని ప్రశ్నిస్తే, "ఎవరికి కావాలండీ గిల్లి కజ్జాలు వారితో? కొరివితో తల గోక్కుంటారా?" అని ఎదురు ప్రశ్నలు వేస్తాడు. "మరి మీ చిత్తశుద్ధి, నిష్పాక్షికబుద్ధి, రససిద్ధి ఏమయాయండీ?" అని అంటే, "అనుకూలపరిస్థితి, సహనంతో వినేవాడూ ఉన్నప్పుడు అవన్నీని. కానప్పుడు నా నోసటనే పొద్దు పొడిచిందా? నా తోపాటు సంఘం—కనీసం ఆ రచయితా—పెరగనివ్వండి. నేను నోరు తెరవక పోతే శబ్దజాలమే నశించిపోదు కదా?" అంటాడు.

ఈ వైరస్యానికి కారణ మేమిటి? మన మనస్సు-ముఖ్యంగా రచయితల మనస్సు పెరగకపోవడమే. ప్రతివారూ, పెరవారిని విమర్శించినప్పుడు సంబర పడుతారుగాని తమవరకు వస్తే గింజుకుంటారు; గుంజుకుంటారు.

అబ్బ! సభల్లో విమర్శాసహనం, స్తోత్ర ప్రీతిత్వం మితిమీరిపోతూయంటే అతిశయోక్తికాదు. నేడు నేల నాలుగు చెరగులూ ఏకమౌతున్నాయి; వివిధ సంస్కృతుల సమ్మేళనం కారణాన. నవీనులలో ఆ సంస్కృతి సమ్మేళన దీధితులు ప్రసరించనే ప్రసరించాయి. ఆ వెలుగుతో తమ లోవెలుగును వారు మిళాయించడం లేదు. అనధికార నిర్యలకు పూనుకుంటారు. అర్హులెవరైనా ఆక్షేపిస్తే కస్సుమంటారు; అర్హతా, అంతరంగ పారిశుద్ధ్యం సంతరించుకోవడానికి మారు. వ్యక్తిగత పరాభవంగా గ్రహించి కసి పెంచుకుని, మనసులో నే కుమిలికుమిలి మసి అవుతారు. తమ కెంతో భవితవ్య ముంది కదా? మనస్సు పొదలో సామరస్యపు నీరుతో సహనపు పైరును పెంచుకోవద్దూ!

ఈ పరిస్థితులలో ఎవరు పూర్వులలాగ 'వజ్రాయుధం' ఎత్తుతారు? ఎవరు 'ఉదయిని'తో జ్ఞానం ఉదయింపజేస్తారు? ఎవరు 'పరశువు'తో ప్రత్యక్షమౌతారు? ఎవరు 'చింతామణి'తో దోషాముగాలు నివారిస్తారు? కనుక నే చిత్తశుద్ధి శూన్యమై పోతూంది రచయితల్లో.

మరి అయితే, రాబోయే విమర్శలు ఎలా ఉంటాయి? ఎలా రూపు దిద్దుకుంటాయి? వ్యంగ్య ప్రధానంగా, ఉత్ప్రేక్ష రచనల రూపంగా వస్తాయేమో! ఈ పద్ధతి అభిలషణీయం కాదు. మనకు పేటికే ఒరవడి పడమటి గడ్డే కదా? అక్కడి ఉత్తమ స్థాయి సాహిత్య పత్రికలు తిరగవేస్తే తెలుస్తుంది; విమర్శలు ఎంత వీరవిహారం చేస్తాయో? సాహిత్యంలో అభిప్రాయభేదాలు వైయక్తిక స్నేహగౌరవాలకు అడ్డురావనే సత్యం ఎలా వెదజల్లుతూ ఉంటాయో?

సంఘంలో అలాటి స్థితిని—సహృదయ సుందరమైనస్థితిని, సహనబంధురమైనస్థితిని—కల్పించడానికి, తద్వారా సాహిత్యంలో అలాటి ఉన్నతిని సృష్టించడానికి మన మందరం పాటుపడవద్దూ? మనం ప్రతి దానికీ పంచవర్ష ప్రణాళికలు సిద్ధపరుచుకుంటున్నాము. విమర్శ వికాసానికీ ఒక పంచవర్ష ప్రణాళికనో, పంచాదశవర్ష ప్రణాళికనో సిద్ధపరచుకుందామా?

ప్రతిరంగంలోను విమర్శ అభివృద్ధికి చిహ్నం కదా!

"హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ
విశుద్ధిః శ్యామికాపి వా."

తా. రా.

# వేశ్యాకులం యెందుకోసం పుట్టిందీ?

## శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

ఇదోక జిజ్ఞాస యిప్పుడు.

కులాల యేర్పాటెప్పుడు జరిగిందో ఆ కాలం విషయమై విభిన్నుల సిద్ధాంతమే వొప్పుకున్నా కొన్ని వేల సంవత్సరాలుగా ఆ వేశ్యాకులంవారికి కలిగని జిజ్ఞాస యిది.

"నీకు మాత్రం యెందుకూ?" అంటే, ప్రాతిపదికలు తెలుసుకోడాని కెవరి కేమి అభ్యంతరమూ?

ధార్మికవిప్లవమున్నూ ప్రారంభం అయిపోయింది గదా, సత్యం తెలుసుకోడం యెవరి కయినా అగత్యమే కదా?

కాకపోయినా, మూసిపెట్టుకుంటే లాభం లేదు. మన మహర్షులు నిర్ణయించిన ధర్మప్రణాళిక శిథిలశిథిలం అయిపోయే వుందిప్పుడు.

సమశక్తి సంఘటించుకుని, ప్రపంచంలో — సకల జాతుల మధ్యనా, "నేమున్నా" మంటూ మళ్ళీ మనజాతి మహామేరువులాగ నిలబడగలగాలంటే, మనకు ధర్మనిర్ణయం మళ్ళీ జరగవలసిన్నీ వుంది. సందేహం లేదు.

ఇప్పుడు శిథిలావస్థలో వున్న మన ధార్మిక సూత్రాలు ఇలాగే యింతక్రితం ధర్మవిప్లవం తటస్థించినప్పుడు అప్పటి పెద్దలు చేసిన సవరణలు కాని స్వయంభువులు కావు.

ఎంత దృఢంగా నిబంధించిన ధర్మాలయినా, అలసులయిన జనుల అనాదర తిరస్కారాలతో కాలక్రమాన శిథిలం అవుతాయి; తప్పదు.

సకలమతాల్లోనూ వున్నదే యిది.

అందుచేతనే "ధర్మానికి గ్లాని సంభవించినప్పుడు-అధర్మమున్నూ పెచ్చుపెరిగినప్పుడున్నూ నే నవతరిస్తా" నని శ్రీకృష్ణుడు చెప్పవలసివచ్చింది.

సామయాచారికాలయిన ధర్మాలు వ్యాఖ్యానం చెయ్యడానికి ఆపస్తంబుడున్నూ పూనుకోవలసి వచ్చింది.

అయితే జాతిమొత్తానికి అజ్ఞానమూ, దానితోడు కేవల భౌతికదృష్టీ, పులిమీద పుట్రలాగ పరధర్మవ్యామోహమూ ప్రబలివున్న దినాలివి.

మన కొత్త రాజ్యాంగం — మనవారే రూపకల్పన చేసిన రాజనీతి, భావదాస్యం వదులుకోడానికి బదులు, మతప్రాధాన్యం పనికిరాదని తిరస్కరించి అసంస్కృతమానసిక ప్రవృత్తులకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలిచ్చేసింది కూడా.

దీంతో, సంప్రదాయం లెక్కకురాకుండా పోయింది.

తాత్వికదృష్టి అంతరించింది.

ఆధ్యాత్మికతకు నిలవనీడే లేకుండాపోయింది.

ఇంతే కాదు, జాతీయత అంటూ వొక కొత్త పద్ధతి ప్రారంభం అయింది, విజాతీయత ప్రవాదిగ.

కాగా "ప్రతీకులమూ వొక విశిష్టధర్మం నిర్వర్తించడానికే పుట్టిం" దంటే యెవరికీ సమ్మతం కావడం లేదిప్పుడు.

"వ్యభిచారంకూడా వొక విశిష్టధర్మమేనా?" అన్న యెదురువాదం కూడా బయలుదేరింది, బహూకటువుగా.

ఈ విషయమై వేశ్యాకులంవారి కగలిగివున్న అసంతృప్తి అంతా యింతా కాదిప్పుడు.

అవును మరి, ఒకరు నిర్ణయించిన కులధర్మం పురస్కరించుకుని, తమలాగే సత్యం గుర్తించలేని యితరులతో కలిసిమెలిసి నడుచుకోడంలో నిరసనభావమూ, తిరస్కారవాక్కులూ పడుతున్నది వారు.

నిజానికి, విద్యలకు విలువవుండినా లేకపోయినా, పోనీ అంటే ఆ విద్య లంటినా అంటకపోయినా జాతిరత్నాలవంటి ఆ కులం ఆడపిల్లలను పడుపు వృత్తిలో దింపడమే గా యిప్పుడు జరుగుతున్నది?

బతికివుండేగా, ఆ పిల్లలకు, మగవాళ్లు కావడానికి మరి అవకాశాల్లేవుగా?

ఇంతే కనపడుతోం దిప్పు డెవరి కయినా.

మనదేశంలోకంటేకూడా వ్యభిచారం ఘోరాతిఘోరంగానే వుండినా, ఇతరదేశాలలో — ముఖ్యంగా యితరఖండాల్లో యెవరూ వ్యభిచారం కులవృత్తిగా అవలంబించడం లేదు.

ఇవన్నీ వ్యగ్రత కలిగిస్తోంది, అందరికీ.

అయితే, ఆ యితర దేశాల్లోనూ, ఆ యితర ఖండాల్లోనూ కులాల యేర్పాట్లూ, వర్ణవ్యవస్థా వున్నాయా మరి?

ఇదెవరికీ అక్కర్లేదు.

సత్యం తెలుసుకుందామన్న ఆస్థా కనపడదు, తరతరాలుగా పూర్వు లవలంబించిన ధర్మాన్ని అన్న సంప్రదాయగౌరవభావనా కనపడదు. సాంఘికాలయిన నిమ్నోన్నతాలు ప్రపంచం అంతటా వుండనే వున్నాయన్న జ్ఞానమూ లేదు మొత్తంమీద.

పూర్వుల నిర్ణయాలు నిర్దాక్షిణ్యంగా తూర్పారబట్టడమూ, సవ్యమైన దృక్పథం సాధించుకోకుండా దిద్దుబాటు ప్రారంభించడమూ—ఇదొక ఫాషనయిపోయిం దిప్పుడు.

జాతీయమైన సంస్కారమూ, వైయక్తికమైన జ్ఞానమూ విసంవాదాలు కావడంవల్ల వచ్చిన పుట్టిమునక యిది.

"కులాలన్నీ వుండాలి, ఏ కులాని కాకులం వనకటి ప్రాకారాలన్నీ గట్టిపరుచుకోవాలి, కులధర్మాలు మాత్రం మార్చుకోవాలి"—ఇదీ యిప్పటి ఎన్నో కులాల వారి చూపు.

ఇలాంటి చూపుతో, చిరసంచితమైన సంప్రదాయమూ, నాగరకతకు విశిష్టమైన కులధర్మమూ మార్చుకోవాలని, యివాళ, వేశ్యాకులంవారు తీవ్ర ప్రయత్నాలు సాగించుకుంటున్నారు.

కులం పేరు మార్చుకోవాలనిన్నీ వారు ప్రయత్నిస్తున్నారు.

"ఇదివరకే పశుప్రవృత్తిలో దిగివుండిన యువతులు తమ గంధర్వులతో 'స్థిరీకరణం' చేసుకోవా"లని ప్రచారమూ ఆచరణా కూడా జరుగుతున్నాయి.

ఇందుకోసం, వారు, సంగీతమూ నృత్యమూ అభినయమూ, ఇలాంటి తమ కులవిద్యలనే—లలిత కళలనే ద్వేషించుకుంటున్నారు.

విడిచిపెట్టేసుకుంటున్నారు కూడా.

మిక్కిలీ దయనీయమైన స్థితి యిది.

"నటులనూ గాయకులనూ పంక్తిబాహ్యులని నిర్దేశించిన వైదికధర్మం మా తాతగారి ముల్లె" అంటూ విప్రులే విరివిగా వైదికబ్రాహ్మలే పోటాపోటీలుపడి యీ విద్యలు సాధించుకుంటున్నప్పుడు — నిండుసభల్లో ప్రదర్శనాలున్నూ సాగిస్తున్నప్పుడు—వోహో అని పించుకోడానికిన్నీ తాపత్రయ పడుతున్నప్పుడు—వేశ్యాకులంవా రిలా సాహసించడం వింతగానే వుంది.

అయితే, యిందుకు మూలమైన కారణం మాత్రం మిక్కిలీ బలీయమైనదే కాదనడానికి వీల్లేదు.

అదేమి టంటే?

ఆ కులానికి చెందిన పురుషుల్లో—స్త్రీలలో కూడా ఇంగ్లీషువిద్య బాగా వ్యాపించివుం దిప్పుడు.

ఇంకా యింకా వ్యాపిస్తూనూ వుంది.

వారి విద్వత్తికూడా ఉన్నతోన్నతశిఖరాలే అందుకుంటోంది.

ఆశ్చర్య మేమిటి?

అవకాశాలే వుండాలి గాని శ్రద్ధచేస్తే విద్యలు రానివా రెవరుమాత్రం వున్నారూ పృథివిమీద.

లలితకళలే కులవిద్యలు కదా, ఆ కులంవారికి ప్రతిభాప్రాగల్భ్యాల కేం లోటెలావస్తుంది?

కాగా,—పెద్దపెద్ద వుద్యోగాలు చేస్తూ, వారిలో అనేకులు విలక్షణా లయిన ఆదరగౌరవా లందుకుంటున్నారు.

స్వతంత్రవృత్తుల్లోనూ బాగా రాణిస్తున్నారు.

దీంతో, వారి దృక్పథం పూర్తిగా మారిపోయింది.

ఈస్థితిలో, వ్యభిచారం తమ కులధర్మం అయివుండడం వారు సహించలేకపోవడంలో వింత యేమిటే?

తప్పు మాత్రం యేం వుందీ?

పైగా,—

చదువులు నేర్చి మంచి మంచి—గొప్ప గొప్ప పదవులు నిర్వహించుకుంటున్నవారే కాక, నృత్య గానాభినయాల్లో పేరుమోసిన ఆ కులస్త్రీలున్నూ నేటి సభల్లో గజ్జె కట్టడానికి రోతపడుతున్నారు.

ఆ రోత, వారికన్నీ కులవిద్యలయెడల వైముఖ్యం కలిగిస్తోంది.

సంఘసంస్కారంయెడల అభిముఖ్యమున్నూ బలపరుస్తోంది.

దీనికి సాయం, ఆ కులంవారి ప్రయత్నా లెవరూ ప్రతిఘటించడంలేదు.

బలపరుస్తున్నారుకూడా విశేషవంతులయినవారు.

కాకేం, సంస్కారం గలవా రెవరూ కూడా వ్యభిచారం ప్రోత్సహించలేరు గా?

అంచేత, వారి ప్రయత్నాలు ఫలోన్ముఖా లవుతున్నాయి.

ఫలసిద్ధిన్నీ పొందుతున్నాయి.

శాసనసభల్లో నే వారి కనుకూలనిర్ణయాలు జరిగి పోతున్నాయి.

ఈ ప్రవాదులమీద, ఆ కులంలో, వివాహితల సంఖ్య నాటికి నూరుపాళ్లూ అయిపోతోంది, శీఘ్ర వేగాన.

కొద్దికాలంలోనే—మన కళ్లయెదటే—భోగం మేళాలు, అదృశ్యం అయిపోతాయి.

వేశ్య అనే మాట నిఘంటు వేద్యం అయి పోతుంది.

వీరసంస్కర్తలు బయలుదేరి, జాతీయసంస్కారం యేమిటో ముక్కు మొగమూ యెరగని శాసన సభ్యులున్నూ పూనుకుని నిఘంటువుల్లోనుంచిన్నీ ఆమాట తీయించివెయ్యడానికి పూనుకోవచ్చు, పవ ధర్మంవారి ప్రోద్బలప్రోత్సాహాలతో.

వితావతా,—

ఈ సంస్కారదృష్టి వేశ్యాకులంవారికి స్వయం భువా?

కాదు కాదు, పరోపదిష్టం.

అగ్రకులాలకు చెందిన ఆంగ్లవిద్యావిశారదులు కలిగించారు వారి కది!

వారి కుపదేశించడానికి ముందు, ఆ అగ్రకులా లకు చెందిన ఆంగ్లవిద్యావిశారదులు వేశ్యలను— ముఖ్యంగా, మేజువాణీలను తామే బహిష్కరించ సాగారు.

ఈవిధంగా అగ్రకులాలవారి ప్రవృత్తి యిలా మారాకే వేశ్యాకులంవారిలో సంచలనం ప్రారంభం అయింది.

దీనికి సాధనం, ఈ వుపదేశాలతో పాటు ఆ కులంవారిలో అప్పుడే ప్రవేశించిం దింగ్లీషు.

వారి దృక్పథమున్నూ పూర్తిగా మార్చేట్టు చేసిం దది.

ధర్మమే,—మంచివన్నది అవగాహన కావ డమూ, అది ఆచరణకు రావడమూ మంచిదే.

అది బలపరచడమున్నూ అందరికీ ధర్మమే.

కానీ, ఆదిలో, వేశ్యలకూ, వేశ్యాకులం స్వాములకూ లేని వైముఖ్యం ఆ అగ్రకులాలవారి కెందుకు పుట్టుకువచ్చిందీ?

వారి కులధర్మం సుస్థితిలో వుందా?

వారి వసతి మాత్రం బాగుందా మహా?

ఉన్నదల్లా యేమి టంటే?

ఇంగ్లీషే మార్చింది అగ్రకులాలవారిని మొదట.

వానిప్రవృత్తికి తోడు, పెద్దలయినవారు, ఆ యింగ్లీషు చదివినవారికి తమ జాతీయసంస్కారం అలవర్చక పోవడంవల్ల—వారి వసతి యెప్పటి కప్పుడు సరిదిద్దుతూ వుండక పోవడంవల్ల—వారిని గాలికి విడిచి పెట్టడంవల్ల—నే వారిని ఇంగ్లీషు మార్చగలిగింది.

అయితే, నే నింగ్లీషుని నిందించడం లేదు.

ప్రపంచం అంతా నమ్ముకుని వున్న భాష అది.

ప్రపంచం అంతా నోకచోటికి తెస్తున్న భాష అది.

ప్రపంచంలో వుంటున్న సకల సంస్కార సామగ్రీ గర్భీకరించుకుని వున్న వాఙ్మయం దానిది.

అన్నివిధాలా సమగ్రం అనిపించుకోతగ్గ భాష అది.

పైగా, మన కధికారభాష అది చేసున్నా.

ఎలాంటివాళ్ల మీదా కూడా తన ముద్ర వేసుకో గల శక్తి కల భాష కూడా అది.

నిజం చెప్పుకోవలసివస్తే, మనలో, పశువు లయివున్నవారిని మనుష్యులుగానూ, మనుష్యులే అయివున్నవారిని పసువులుగానూ, మార్చిన భాష అది.

ఆంగ్లేయులయినా తమ కొక్కవలసిన సుమాస్తా లనూ, పనివారినీ, తయారుచేసుకోడానికి మాత్రమే వుద్దేశించి దానొక్క హద్దులో నే వుంచారు మొదట.

మనవాళ్ళే సర్వానికీ అదే కావాలన్నారు.

అదే చేసుకున్నారు.

కానీ అంటే, విద్యాభ్యాసం జరగవలసినచోటు నొక్క పాఠశాలే అనుకున్నారు కూడా మనవారు.

ఈ వుసులుబాటు చూసుకుని దృఢంగావున్న భాష కనక, అది తన విశ్వరూపం చూపించింది మనకి.

ఆ యింగ్లీషు నేర్చిన మన అగ్రకులాలవారు, మన సాహిత్యంలో ప్రవేశం లేక మన కళల పరిజ్ఞాన మున్నూ లేక—మన కావ్యార్థాలు అనుభూతాలు కాక—కనీసం "మనం ఆంగ్లేయులం కాము, తద్భి న్నులం" అన్న ప్రాతిపదికజ్ఞానం అయినా లేక, ఆంగ్లేయుల మానసికప్రవృత్తికి అలవడ్డారు.

ఉద్యోగప్రాబల్యంతో యిక్కడ రాచకీవి అను భవించే ఆంగ్లేయులను చూసి, ఇంగ్లండులో కూడా

ఆంగ్లేయు లందరూ అలాగే వుంటా రనుకున్నారు వారు.

దాంతో, వారి కా యింగ్లీషు సంఘం ఆదర్శం అయిపోయింది.

వెంటనే వారి కీ జాగుప్స బయలు దేరింది, ఇలి చవులుమరిగినవాడికి ధర్మపత్నిమీద వెగటుపుట్టేటట్టు.

మనసంఘం కుళ్ళి కంపెత్తిపోతున్నట్టున్నా కనపడింది, దానిమొదట.

వెంటనే అది దిద్దాలన్న సంకల్పమున్నూ కలిగిపోయిం దా వరవడిని బట్టి.

"ప్రపంచకం యెక్కడ చూసినా, మనదేశంలో తప్ప, మరెక్కడా కూడా, వ్యభిచారంకోసం అంటూ వొకకులం లేదు, కేటాయింపుగా. అలాంటిది, మన దేశంలో—ముఖ్యంగా మన సంఘంలో వుండడం మన కవమానకరం" – ఇదీ వారి ధోరణి.

"పాశ్చాత్యదేశాల్లో యిలాంటి వొక తెగ అంటూ లేకపోతే లేకపోయింది, పోనీ, యీ తెగవారి వృత్తి అవలంబించే వారున్నారా లేరా? వ్యభిచారం కట్టుదిట్టంగా నిర్వహించుకోడానికి వారికోసం పెద్ద పెద్ద సంస్థలే యేర్పడివున్నాయా లేదా? ఆ వ్యభిచార సంస్థలకు వారి రాజ్యాంగంలో యెన్నెన్నో వ్యవస్థలున్నూ యేర్పడివున్నాయా లేదా? మరి, అదేమిటికి?" అని పర్యాలోచించుకోలేదు వారు.

అసలీ జిజ్ఞాసే కలగలేదు వారికి.

"ఆ సంస్థల్లో చేరి, వ్యభిచారం నిరాఘాటంగా సాగించుకుని, కొందరు పశువులు కొన్నాళ్ళకు పెళ్ళిళ్ళకు సిద్ధపడతారే, వారిని పెళ్లి చేసుకోడం యెవరికీ తప్పు కాదే, అప్పుడు ఆ పశువులకూ తక్కిన యిల్లాళ్ళకూ సంఘంలో గౌరవమూ మర్యాదలూ సమంగానే జరుగుతాయే, అది బాగుందా మరి?" అనయినా వారు చూసుకోలేదు.

"ఏ సంఘం అయినా, యితరసంఘాలవారికిన్నీ నిర్దుష్టంగానూ సర్వాంగసుందరంగానూ కనపడేది పృథివిమీద ఎక్కడయినా వుంటుందా అసలు?" అని కూడా వారు చర్చించుకోలేదు.

వారిది వొక్కటే చూపు.

ఒక్కటే నిశ్చయమున్నూ.

"ఇది—మన సంఘంలో పశుప్రవృత్తికి ప్రత్యేకంగా వొక కులం యేర్పడి వుండడం అనేది అసభ్యతకు గుర్తు. అభివృద్ధికి చెదపురుగు. పశుప్రవృత్తికి పర్యాయం. మానవత్వానికే ప్రతికూలం"

"కనక, దిద్దుకోవలసిందే."

"ఇలాంటి ఉద్రేకంతో బయలుదేరిం దీ వుద్యమం."

ఇలాంటి పరప్రత్యయనేయబుద్ధితో ప్రారంభం అయిం దీ ప్రచారమున్నూ.

అయినా, సంతోషమే.

ఇది యెక్కడ, యెంచేత, యెలా ప్రారంభం అయినా, దేశంలో వ్యభిచారం అనేది లేకుండా చేస్తే, అథవా తగ్గించేస్తే, మనుష్యబుద్ధికి ఘనమైన విజయం అంతకంటే మరొకటి లేదు కనక, అందుకు మొదటి ప్రశంస నాది.

వేశ్యాకులంలో గార్హస్థ్యం ప్రబలితే, వ్యభిచారం—పశుప్రవృత్తి నిశ్శేషం అయితే, అందుకున్నూ మొదటి ధన్యవాదం నాది.

"అయితే, యీ చర్చ అంతా యెందుకూ మరి?" అంటే?

"వేశ్యాకులానికి వ్యభిచారమే నిర్దిష్టమూ ఉద్దిష్టమూ అయిన ధర్మం కాకపోతే ఆ కులం యెందుకోసం పుట్టింది?"

ఇదిగో, యిదీ నా జిజ్ఞాస.

ఇది తెలుసుకుందా మని యీ ప్రయత్నం.

అయితే, యింతదూరం వచ్చినా యిది యిలాగే వుండిపోయింది అమంబితంగా.

"అంత విచారణ యెందుకూ? చూస్తేరాదూ?" అంటే, చూస్తే, నిజంగా మంచిస్థితిలో వున్న కులమే కాదు, వర్ణం మాత్రం యేమి వుందీ మనలో?

సత్యానికి దూరం అయి, సభ్యతకు వెలిఅయి, ధర్మానికి తప్పిపోయి, హాస్యాస్పదం కూడా అయిపోయి, లజ్జాస్పదం కాకుండా వున్న దేం వుందీ మనలో?

"నిజమే" అని ఒప్పుకుంటే చాలదు, అందుకు కారణం?

ఈ సంగతి యోచించేవారు కనపడరు.

వెనకటి ఘనత వరించుకుంటూ, గుడ్డిగా, యింకా యింకా కిందికి దిగిపోయేవారే అందరూ.

ఏం?

ఎందు కిలా జరుగుతోంది?

మన ధర్మానికి—మన వర్ణాశ్రమాచారాలకు రాజావలంబనం లేదు.

మనకు స్వధర్మనిరతీ లేదు.

శాస్త్రమే కాని, శాస్త లేని సంఘం అయిపోయింది మనది.

ఓరగాలిలో పెట్టిన దీపమున్నూ అయిపోయింది.

కాగా,—

"పూర్వు లేర్పరిచిన కులధర్మాలు మంచివా చెడ్డవా ?" అన్న విచారణదాకా వెళ్ళవక్కరలేదు, యథాతథంగా ఆచరణలో లేవవి యిప్పుడెక్కడా.

అనేక కారణాలవల్ల—అనేకవిధాల ఖిలాలున్నూ అయిపోయాయివి.

ఇది బహిరంగ రహస్యం.

పోతే, అంతరంగరహస్యం కూడా వొకటుందిక్కడ.

అది "యివి యిలా అయిపోయాయే"అన్న ఆవేదన లేకపోవడం యెవరికీ.

పండితులకు—ధర్మపరులం అని చెప్పుకునేవారిక్కూడా అది లేకపోవడం.

పైపెచ్చు,—

పామరుల్లోకంటే, పండితుల్లోనే— శిష్టులం అని చెప్పుకునేవారిలోనే పంక్తిబాహ్యు లెక్కువగా వుండడమున్నూ.

కాని, పూర్వు లేర్పరిచిన వేర్పరిచినట్టూ లేక, నవనాగరకత ననుకూలంగానూ లేకపోతే, కుక్షింభరులైనవారు మానీమానక ట్టూరుకున్నా, ధర్మచింత గలవా రూరుకోలేరు.

కనక, సాహసించి, వారిలో కొందరు దిద్దుబాటు ప్రారంభించారు తమ అనర్హత గుర్తించుకోకుండా.

అంతమాత్రంతో తృప్తిపడలేక, మరికొందరు, అంతకంటే ఘనులు, అపునాదిమీద అంతకంటేనూ సాహసించి తిరుగబాటే ప్రారంభించారు.

ఎవరినీ, ఎందుకూ గూడా, ఏమనగలవారూ కూడా లేకపోయారు.

ఇది గుర్తించి, జనులు, యెవరి కెప్పటి కెలా వీలయితే అలా ప్రవర్తించసాగారు.

ఇలాగ యిది ధర్మవిప్లవం అయిందే గాని సంస్కారపరాయణు లాశించినట్టు ధర్మసంస్కారం కాలేకపోయింది.

ధర్మనిర్ణయం అసలే కాలేకపోయింది.

ఇది యింతటితో ఆగలేదు.

"మనపూర్వులు, అజ్ఞానులు—మూర్ఖులు—సభ్యత యెరగనివారు—అడవిమనుష్యులు"అని నిందించడం ప్రారంభించారు సంస్కారపరాయణులు.

అదయినా స్వబుద్ధితో కాదు, పరోపదేశంతో. ఇంతకంటే దౌర్భాగ్యం మరేమి వుందీ!

ఏమంటే ?

కాలదైర్ఘ్యంలో పతితావస్థకు జారిపోయివుండిన యిప్పటి సంఘం చూసి-యిప్పటి జనుల నడవడి చూసి. "పూర్వుల యేర్పాట్లిలాగే వున్నా" యనుకోడం వివేకమా ?

నిరసించడమున్నూ తగునా ?

వాటి నిజస్వరూపం తెలుసుకోవద్దూ, నచ్చినా నచ్చకేపోయినా ?

వాటి ఆంతర్యం తెలుసుకోవద్దూ, యిష్టమయినా కాకపోయినా?

ఇదేమీ లేదు.

ఒట్టి శుకానువాదం చెయ్యడం, యెంతెంత పెద్దలున్నూ.

తమ తాహతూ, తమ యోగ్యతా తెలుసుకోకుండా వేశ్యాకులం వ్యభిచారంకోసం పుట్టిందనడం దౌర్జన్యం.

మన పూర్వులకు చెంపపెట్టది.

అలా అనేవారి మౌఢ్యానికీ మౌర్ఖ్యానికీ మాయని గుర్తు.

నిజం గ్రహించగలిగితే, వేశ్యాకులం మిక్కిలీ గణనీయమైనది.

ఎంచేతనంటే?

దానికి కేటాయింపయిన ధర్మం, నాగరకతకు నికషం.

ప్రతిభకు పరమావధి.

ఆచార్యత్వానికి విశిష్టమైన నిదర్శనం.

ఒక్కమాటలో చెప్పాలంటే, సంగీతమూ, నృత్యమూ, అభినయమూ—వీటికి పట్టుగొమ్మ ఆ ధర్మం.

బానిసబుద్ధికి ఆకళలిప్పుడు లోటుగా కనపడవచ్చు కాని ప్రపంచం అంతటా వాటికెంతో పూజ్యత వుంది.

ప్రోత్సాహం వుంది.

పోషణ వుంది.

ఆదరగౌరవాలున్నాయి.

జపానులో. చైనాలో, రష్యాలో, జర్మనీలో, ఫ్రాన్సులో, ఆస్ట్రేలియాలో, ఇటలీలో, గ్రీసులో,

అమెరికాలో, కెనడాలో—ఇప్పటికీ మన శేడి వరకట్లో ఆ బ్రిటనులో కూడా వాటికి అగ్రపీఠం భుక్తం అవుతోంది.

ఆ దేశాల సభ్యజాతులవారే కాదు, ఏవాదులు-చెంచులు—కోయలు—నీగ్రోలు—ఎస్కిమోలున్నూ నెత్తిమీద పెట్టుకుంటున్నారు వాటిని.

స్త్రీలకు—అంతఃపురాల్లో కూడా బురకాలు తగిలించే వుంచే నిత్యశంకితులు కూడా వాటియెడల ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపిస్తున్నారు.

వాటిలో అలాంటి మహిమ వుంది.

అలాంటి సత్తా వుంది.

అలాంటి జీవం వుంది.

అలాంటి సభ్యత వుంది.

అవి కళల్లో లలితాలు.

లలితాలంటే చాలదు, లలితలలితాలు.

అయితే?

ఆధారాధేయాలకు పొందిక వుండాలి.

కనుక?

ఆ కళలు నేర్చుకోడానికీ ప్రదర్శించడానికీ స్త్రీలకే అర్హత.

ఇంతే కాదు, అవి మగవాళ్ళ కుపాదేయాలు కావు.

మన మహర్షు లిలా నిర్ణయించారు.

పరిస్థితులు నిశితంగా పరిశీలించే—బాగా ఆలోచించే—దూరదృష్టితోనే వారిలా నిర్ధారణ చేశారు.

అంచేత, ఆ విద్యలకోసం, మన సంఘంలో కొందరు స్త్రీలు అవివాహితలుగా వుండిపోవలసి వచ్చింది.

అయితే, యిందులోనూ గట్టిచిక్కే వచ్చింది.

బతికివుండినంతకాలమూ స్త్రీ అవివాహితగా వుండిపోడానికి మన సంఘం సుతరామూ వొప్పదు.

ఒక్క పురుషులకే వుంది ఆ హక్కు యావత్తూ.

స్త్రీ పెళ్ళిచేసుకు తీరాలి.

కామతృప్తి ఇక్కడ ప్రధానం కాదు.

నిసర్గరత్నాలవంటి బిడ్డలను కని జాతిని బలపరచడానికి స్త్రీ పెళ్లి చేసుకుతీరాలి.

ఒక పురుషునకు గార్హస్థ్యం నిర్వహించుకునే అర్హత సిద్ధించడానికిన్నీ స్త్రీ పెళ్లి చేసుకుతీరాలి.

పెళ్లి చేసుకోని స్త్రీ పతితురాలు.

ఆమె తాకరానిది.

చెప్పరానిది.

చూడరానిది.

వినరానిది.

స్మరించరానిదిన్నీ.

అవివాహితకీ కర్మభూమిలో స్థానం లేదు.

కాగా,—

ఇలాగ యీవిధిసూత్రానికీ విధాయకసూత్రానికీ విసంవాదం యేర్పడింది.

అతిబలీయాలైన యీసూత్రాలు వొకటిలాగ యేటికీడిస్తే వొకటి కోటికి లాగింది.

కాదంటే, రెండూ జవదాటరానివే అయిపోయాయి.

రెండూ శిరోధార్యాలూ అయిపోయాయి.

మరి గతి?

కులధర్మాలు నిర్ధారణచేసిన మహర్షుల కిదొక గడ్డుసమస్య అయిపోయింది.

అయితే అయింద ని, యిప్పుడు మనలాగ, వారప్పుడు, అటు ధర్మమూ వుల్లంఘించలేక పోయారు—ఇటు—విద్యలూ చంపుకోలేకపోయారు.

ధర్మమే.

వేత్తృతకు నికషమైన ధర్మనిర్ణయం అది.

సభ్యతకు పరమావధి అయిన కృత్యవిభాగం అది.

విద్యలంటే, బుద్ధికీ ప్రతిభకూ పరమావధులు కదా, బుద్ధివుండినవా రెవరైనా అవి చంపుకుంటారా?

ధర్మం అంటే, మానవజాతికి దైవత్వం ప్రతిపాదించే కీలకం కదా, మనుష్యులైనవా రెవరైనా అది మాత్రం వదులుకుంటారా?

మన సంస్కర్తల కాదర్శభూతులైన పాశ్చాత్యులనే చూడండి, పోనీ.

వారిలో, వందలువందలుగా స్త్రీపురుషులు, జంటలుజంటలుగా కలిసి రాత్రికి రాత్రంతా నృత్యం చేస్తారు.

కలిసి అంటే, వొక స్త్రీతో మరొక స్త్రీ, వొక పురుషునితో మరొక పురుషుడూ కాదు, వొకపురుషునితో వొక స్త్రీ, వొక స్త్రీతో వొక పురుషుడూనూ ఆ కలియటం.

చెట్టాపట్టాలు వేసుకొని—వొకరి నొకరు కౌగిలించుకుని మరీ చేస్తారు వారా నృత్యం.

అలా చెయ్యడంలో అతివ్యాప్తీ అవ్యాప్తీ కలక్కుండా చాలా చాలా నిబంధనలు చేసుకున్నారు వారు, చాలా నిక్కచ్చిగా.

ఎలాంటివారూ కూడా, వొకమాటు తనతో నృత్యం చేసిన స్త్రీతో ఆపురుషుడూ, పురుషునితో

ఆ స్త్రీ, ఆ రాత్రి మరోమాటు నృత్యం చెయ్యకూడదు.

ఎవడిపెళ్లాంతో వాడసలే నృత్యం చెయ్యకూడదు.

అంటే—వారొకరాత్రి నృత్యం ఏర్పాటుచేసుకున్నా రంటే ప్రతీ స్త్రీ, తన భర్త కళ్ల యెదుటే వొకడితరవాత మరొకణ్ణిగా పరపురుషులనే కౌగిలించుకుని నృత్యం చేస్తుంది.

పురుషుడున్నూ తన భార్య చూస్తూ వుండగానే, మరొకళ్ల భార్యలను కౌగిలించుకుని నృత్యం చేస్తారు.

రాజుకీ రాణికీ కూడా మినహాయింపు లేదక్కడ.

మరో విశేషం కూడా వుందక్కడ.

భార్యాభర్తలు కలిసి వెళ్ళా లని లేదు నృత్యానికి.

పెళ్లి కాని కన్యలూ, భర్త లేనివారూ కూడా, నృత్యం చెయ్యవచ్చు.

అయినా, వారు నృత్యవిద్యను దంపుకో లేరు.

చంపుకో లేదని కాదు, చంపుకోలేక పోయారు.

తప్పనిసరిగా కాకుండా, మిక్కిలి ప్రీతిగా వారా విద్యను ఆరాధించుకుంటారు.

శ్రద్ధగా నేర్చుకుంటా రది.

అందులో చాతుర్యం సంపాదించుకోవడం జీవిత పరమావధిగా భావించుకుంటారు.

అది నేర్చుకోనివాళ్లకు వారిలో ఆదరగౌరవా లుండవు.

పెళ్ళి కాదు.

అన్నమే పుట్టదు.

తరుచుగా నృత్యం యేర్పాటు చేసుకుంటారు వారు, ఏ సంవత్సరాని కొకమాటో కాదు.

నృత్యం యేర్పా టయిందంటే. స్త్రీ పురుషులూ కూడా చక్కగా అలంకరించుకుని ఉత్సాహతరంగాలమీద తేలిపోతూ వెళతారు హాలుకి.

ఏం?

జీవనమాధుర్యం గుర్తించుకున్న వారు వారు.

జీవనమాధుర్యం అనుభవించగలవారు వారు.

జీవనమాధుర్యం విడిచిపెట్టుకో లేనివారు వారు. కనక ?

లలితమూ, నాగరకతకు నికషమూ అయిన నృత్యవిద్యకోసం తమ సంఘాచారాలే అలా సరిదిద్దుకున్నారు వారు.

మన మహర్షులు చేసిందీ యింతే గుర్తించుకో గలిగితే.

వర్ణాశ్రమాచారాల యిరుసుమీద తిరుగుతోంది మన జాతిమత.

ఈ భిన్నమార్గాలకు సమన్వయం సాధించుకో వలసిన పరిస్థితు లేర్పడగా, మన జాతిమత కనుగుణంగా విశేషవిధులు కల్పించు వి నృత్యాభినయాల కోసం వొక కులమే కల్పించారు వారు.

ఆ కులమే వేశ్యాకులం.

దీంతో, అటు వైవాహికధర్మసూత్రమూ నిర్బంధం అయింది, యిటు భరతవిద్యా అప్రతిహతం అయింది.

అయితే, యీసందర్భంలో యితర్ల దృక్పథం మంచిదా, మన దృక్పథం మంచిదా ?

స్పష్టంగా—నిక్కచ్చిగా చెప్పా లంటే, యిందులో వొకటి మాత్రమే మంచిది.

కేవలం మంచిది మాత్రమే కాదు, బహూ మంచిది.

రెండోది మిక్కిలీ చెడ్డది కూడాను.

అయితే, ఆ చెడ్డ దేది ?

వారి దృష్టిలో మనది.

మరి, మన దృష్టిలో ?

ఇదిగో, యిక్కడ, బానిసప్రవృత్తి చూపించుకుంటున్నారు మనవాళ్ళు నిర్లజ్జంగా.

ధార్మికమైన సత్తా నాశనం చేసుకోవడంవల్ల వచ్చిన పాట్లివి.

హేతువాదానికి సిద్ధపడలేక మనవారు, పాశ్చాత్యులు, నేను నాది అన్న అహంకార మమకారాలు విడిచిపెట్టుకున్నారా ?

మరి, మనవా ళ్ళెందుకు విడిచిపెట్టుకోవాలీ ?

పాశ్చాత్యుల దేశాలు బహూశీతలాలు.

వారు తమ సాంఘికజీవితం అందు కనుగుణంగా సరిదిద్దుకున్నారు.

వారి చిత్తవృత్తులున్నూ అందు కనుగుణంగా నేతమూ రయినాయి.

మన పరిస్థితులు వారి కర్థం కావు.

మన ఆచారాలు వారికి నచ్చవు.

నచ్చినా వా రవి అవలంబించరు.

అవలంబించి బతకనూ లేరు.

మరి, మనం మాత్రం యెందు కవలంబించాలీ వారి ఆచారాలు?

అవలంబించి బతగ్గలమా మనం మాత్రం?

పోనీ, వేశ్యలు వ్యభిచరిస్తారు కనక, వారు పేజావాణీ చేస్తే ఆ సభలో కూచోడాని కిష్టపడని మన సంస్కర్తలు, తమ సజాతీయుల్లో యితరుల భార్యల నాలింగనం చేసుకుని నృత్యం చేస్తారా?

గట్టిగా నిలదీస్తే వారందుకు సిద్ధపడనే వచ్చు, మరి, తమ భార్యలను మరొకళ్ల పరిరంభాల కందిస్తారా, నృత్యంకోసమే?

విద్యల స్వరూపమూ, తెలియదు వారికి.
విద్యల అంతర్యమూ, అవగాహన కాదు వారికి.
విద్యల పరమార్థమూ, గోచరం కాదు వారికి,
విద్యల అనుభవమూ, అందనే అందదు వారికి.
అదిగో, వారూ మన కిప్పుడుపదేష్టలు.
వారూ, మన కిప్పుడు నాయకులు.
వారూ, మన కిప్పుడు శాస్తలు.

జటిలాలైన కార్యకారణసంబంధా లిలాంటి పరప్రత్యయనేయబుద్ధుల కందవు.

పోతే, సభ్యతకు నికషాలయిన యీ లలితకళల కాలంబనం కావడంవల్ల వేశ్యాకులానికి తటస్థించినది, అసమాధమస్థితి కాదు. అధమస్థితిన్నీ కాదు, విశేషించి మహోన్నతస్థితి.

ఇందువల్ల, వేశ్యలకు, దేవస్థానాల్లో నిరుపహతమైన పదవి లభించింది.

వేశ్యలు దేవదాసీ లయినారు.

స్వర్గంలో—మహేంద్రసభలో అప్సరసలు అగ్రతాంబూలం పొందితే, యీ భూలోకంలో, రాజాస్థానాల్లో, ఈ వేశ్యలు అగ్రతాంబూలం సంపాదించుకున్నారు.

గార్హస్థ్యజీవితానికి అంతరువులూ, సోపానాలూ అయిన శుభకార్యాల్లో, యీ వేశ్యలు, మంగళ దేవతలున్నూ అయినారు.

అప్పుడూ యిప్పుడూ కూడా—యిక్కడా మరెక్కడా కూడా మంత్రవశంగా మాత్రమే జరిగి పోడంలేదు, వివాహాలు.

వైదికమంత్రాలకంటే లౌక్యతంత్రమే యెక్కువ వివాహాల్లో, యేమతంలో నైనా.

వైదికమంత్రాలు వివాహసిద్ధికి మాత్రమే—దాంపత్యనిర్ధారణకు మాత్రమే—లౌక్యతంత్రం, గార్హస్థ్యం ఉత్సాహోల్లాసాలతో రసబంధురం కావడానికీ, ప్రవృత్తిమార్గం సుగమం కావడానికిన్నీ.

ఆ లౌక్యతంత్రానికి కొలికిపూస భోగంమేళం.

పెళ్లి చేసుకోవడం, వధూవరులకు, సర్వమూ విడిచి, సన్యసించడానిక్కాదు, ధర్మప్రజాసంపత్తి సాధింకోడానికి.

పెళ్ళిళ్ళలో భోగంమేళాలు పెట్టడమున్నూ, పెళ్లికి వచ్చిన పురుషులను తిప్పడానికి మళ్ళించడానిక్కాదు, ధర్మప్రజాసంపత్తి సాధించుకోడానికి దీక్షాకంకణం తాల్చివున్న వధూవరులకు ఉదాత్తలలిత శృంగారవీథులు పరిచయం చెయ్యడానికి.

ఈ విశిష్టత వుండడంవల్లనే యెంతెంతలేసి మహామహులూ కూడా నేనంటే నేనంటూ నిండుసభల్లో వేశ్యలను పెట్టుకొంటుంటారు; గాని యెంత అందగత్తె లయినా, లోపాయికారీగా తమకు ప్రియురాళ్ళయినా కులటలను పెట్టుకుని అలా కూచోగలరా?

లలితలలితాలైన నృత్యాభినయాల మాధుర్యం అనుభవిస్తూ, వాటికి జంగమమూర్తు లయిన వేశ్యలను నెత్తిమీద పెట్టుకోడం కాదూ అది?

ఈ రహస్యం అవగాహన అయి వుండడంవల్లనే,—

దుష్టశిక్షణ శిష్టరక్షణరూపంగా మన ప్రభువు లవక్రపరాక్రమంగా ప్రజాపాలనం చేసినంత కాలమూ,—

కవుల నారాధించారు, జనులు.
గాయకుల నాదరించారు.
శిల్పులను గౌరవించారు.
వేశ్యలనూ సత్కరించారు, ఆ అంతస్థులోనే.

నాటి మనవారు, ఇలాగ లలితకళలు వికసింపజేసుకుని, మానవత్వంలోనే దేవతల అంతస్థు అందుకున్నారు సులభంగా.

కాగా,—

కవిత్వం లేకపోతే—గానం లేకపోతే—చిత్రకళ లేకపోతే—శిల్పం లేకపోతే—నృత్యాభినయాలున్నూ లేకపోతే, మానవసమాజం కాదది, పశువుల మంద.

ఇంగ్లీషు చదవడంవల్ల యెక్కువ కావలసిన యీపరిజ్ఞానం, మనలో చాలామందికి వెర్రితలలు వేసింది.

ఇంతకీ,—

లలితకళలు నేర్చిన వేశ్య అంటే, మన మహర్షుల భావన మిక్కిలీ ఉదాత్తమైనది.

ముఖ్యంగా, వేశ్య సభలో వోక నృత్యభంగిమ చూపిస్తోం దంటే,—

రమ్యాతిరమ్యమైన చిత్రకళ అంకితం అయి వుంటుం దామెలో.

మహితమహితమైన శిల్పం మూర్తీభవించి వుంటుం దామెలో.

లలితలలితమైన గానం ఆలపితం అవుతూ వుంటుం దామెలో.

మధురమధురమైన కవిత్వం ధ్వనిస్తూ వుంటుం దామెలో.

అప్పు డామె వేశ్య కాదు.

మానవే కాదు.

సాక్షాత్తుగా సరస్వతే ఆమె.

బుద్ధివున్నవాడి కెవడికీ—మనిషి అయినవాడి కెవడికీ మరో భావన కలగ దామెయెడల.

వేశ్యనిజస్వరూపం అదిగో, అది.

వేశ్యకు మన మహర్షులు నిర్దేశించిన అంతస్థున్నూ అది.

మన పూర్వులు—మన సంఘాచారాలు దిద్ది తీర్చిన మన మహర్షులు, వేశ్యాకులానికి నిర్దేశించిన విశిష్టధర్మం యీవిధంగా కళావేత్తృతా, కళాప్రదర్శనమూ, కళాజీవికా, కళామయతా మాత్రమే గాని వ్యభిచారం యెంతమాత్రమూ కాదు.

ఏవం చ.

వ్యభిచారం అంటే యేమి టసలు?

కామతృప్తి ప్రాణికోటి కంతకూ విధివిహితమే.

చలిచీమ మొదలు బ్రహ్మపర్యంతమూ రకంలో భిన్నమే గాని, రాశిలో వొకటే యీ విషయమై.

అంచేత, స్త్రీకీ పురుషునికీ కూడా కామోద్రేకం నిషిద్ధం కాదు.

నాలుగు పురుషార్థాల్లోనూ వొకటి, కామం.

క్రమోత్తరంగా చూస్తే, ధర్మార్థకామాల్లో కామం ఉత్తమం కూడా.

అది మోక్షానికి చివరి మెట్టు.

లేక వెనక మెట్టు.

అయితే, భార్యాభర్త లయివున్న వారికే ఉపాదేయం అది.

పెళ్లి కాని యువకుడూ, పెళ్ళి కాని యువతీ దాని పూసి యెత్తుకోకూడదు.

ఎత్తుకోడం, గార్హస్థ్యానికే విఘాతమే కాదని, మిక్కిలి గర్హ్యమున్నూ.

అదీ వ్యభిచారం.

మన మహర్షులు బహువిధాల నిషేధించా రది.

ఆ వివరా లన్నీ శాస్త్రాలు విశదపరుస్తాయి.

మన సారస్వతం అంతా వివరిస్తుంది.

అది—వ్యభిచారం సంఘవ్యవస్థకు చీడపురుగు.

సభ్యతకు తోకచుక్క.

పగలకు—ద్వేషాలకు—కసికీ—కలహాలకు—కల్లోలాలకు—హత్యలకు—యుద్ధాలకున్నూ మూలం.

మానవజాతి మనుగడకే అపాయకరం.

ఏ దేశంవారిలోనూ, యే ఖండంవారిలోనూ యే మతంవారిలోనూ, యే సంఘంవారిలోనూ కూడా, సభ్యత వుందీ, యీసిద్ధాంతమూ వుందన్న మాటే.

ముఖ్యంగా, మన సంఘంలో, దొడ్డిదారిన ప్రవేశమే కాని దానికి స్థానం లేదు.

ఆదరగౌరవా ల్లేవు.

దానికొక వ్యవస్థ లేదు.

రాజ్యాంగంలో రక్షణలు లేవు.

పరోక్షంలో యేమయినా, ప్రత్యక్షంలో, జారులూ కులటలూ కూడా మంచిది కాదనే అంటా రది.

దుమ్మెత్తిపోస్తారు.

ముఖ్యంగా, కులటలు, తమ దౌర్భాగ్యానికి మన్నూ గర్హించుకుంటారు, కుమిలి పోతూ.

కాగా,—

మనలో యెవరూ కూడా వ్యభిచారం సమర్థించ లేరు.

ప్రతిఘటిస్తారు కూడా, సర్వవిధాలా.

అయినా, స్త్రీ చూపు పరపురుషుడిమీద పడిందా, మంగళసూత్రం అడ్డుకోలే దది.

ఆభిజాత్యం మళ్లించలేదు.

భర్త పిడికిలి భయపెట్టలేదు.

అత్తమామల కోపాలా ఆటంక పెట్టలేదు.

బంధువుల ఆడిపోతలు నిషేధించలేవు.

రాజ్యాంగంవారి చతురంగబలాలున్నూ అడ్డం తిర పెట్టలేవు.

అలాగే,—పురుషులకున్నూ బుద్ధి చలించిందా, శాస్త్రాలు నిషేధించలేవు.

వేదాలు ప్రతిఘటించలేవు.

చివరికి, మృత్యువున్నూ యేమీ చెయ్యలేదు.

కానీ అంటే, కామప్రవృత్తి విషయమై సృష్ట్యాదినుంచీ వుంది మతిచాంచల్యం, స్త్రీపురుషులకు.

ఇది ప్రపంచం అంతటా వుంది.

ఆ వుండడంలోనూ మళ్ళీ సభ్యజాతుల్లో నే యెక్కువగా వుంది.

దాపరికం అక్కర్లేదు, మనలోనూ వుంది.

భార్యాభర్త లయినవారికే వినియోగపడా లని కామప్రవృత్తికి విధిమాత్రాలే గాని, విధాయక మాత్రా ల్లేవు.

దీని కంతం అంటూ లేదు.

మానవసంఘం వుంటినంత కాలమూ వుంటుంది.

అప్రతిహతంగానూ సాగిపోతుంది.

అడ్డకట్టలు వేస్తే, కొత్తదారులు తొక్కుతుం దే గాని ఆగిపో దెంతమాత్రమూ.

పురుషు డింకు కెవడ్డాడా, చాటునా మాటునా మాత్రమే నిందించి వూరుకుంటుంది సంఘం.

స్త్రీని మాత్రం వెలబెట్టి రాసేస్తుంది.

సంప్రదాయ సాంకర్యభయంకంటె బలమైనవే వున్నా యందుకు కారణాలు చాలా; కాని మొత్తం మీద, స్త్రీకి పురుషునికే కూడా ప్రకృతిధర్మం అయిపోయింది వ్యభిచారం

ఇందులో కూడా వొక విశేషం.

వేదాలు చెప్పండి, శాస్త్రాలు తెగనండి, స్త్రీల శీలం కాపాడ్డానికి ఇప్పుడున్నన్ని కట్టుబాట్లు లేవు, వెనక వెనక.

స్త్రీల కప్పు డున్నంత స్వేచ్ఛ యిప్పుడు లేదు, మనలో.

ఎందుకు చెప్పానంటే?

కామప్రవృత్తి తీర్చుకోవాలంటే, పురుషులకు పరస్త్రీలూ, స్త్రీలకు పరపురుషులూ అతిసులభంగా చిక్కేవా రారోజుల్లో.

అందుకోసం — వ్యభిచారంకోసం వొక కులం యేర్పాటు చెయ్యవలసిన అగత్యం లేదేలే దప్పుడు.

కావచ్చు ననుకుందాం.

అయితే, వేశ్యలు నృత్యాభినయాలతో మనికట్టు తొక్కుతుంటున్నారా?

వ్యభిచరించడం లేదూ?

లేకేం?

వేశ్యలూ వ్యభిచరిస్తున్నారు.

వివాహం పేరిట, పురుషులను కొంగున ముడివేసుకునివుండిన సంసారిణులే కొందరు విచ్చలవిడిగా వ్యభిచరిస్తున్నప్పుడు, నిత్యకన్యలు వేశ్యలు వ్యభిచరించడంలో వింత యేముందీ?

అంటే, వేశ్యలకు భర్త ల్లేరు కనక — ఉండడానికి వీలు లేదు కనక — వారి శరీరాలు ఇనుము కరిగి పోసినవిన్నీ కావు కనక — వ్యభిచారం వేశ్యలకు దైహికధర్మమే; కాని కులధర్మం కాదు.

బాగా పరిశీలించగలవా రుంటే, సంసారిణుల్లో వ్యభిచరించేవా రుండినట్టే, వేశ్యల్లో శుద్ధపతివ్రతలూ కనపడతారు, తప్పకుండా.

ఇంకో రహస్యమున్నూ వుంది

దాన్నిప్పుడు చెబుతున్నాను వినండి.

అతనికి ప్రాచీనులూ అర్వాచీనులూ అయినవారూ కూడా ఘోషిస్తున్నా రాలకించండి.

కళలు నేర్చారా?

స్త్రీలు శీలం నిలుపుకోలేరు.

పురుషులున్నూ శీలభ్రష్టులు కాకుండా వుండలేరు.

ఎక్కడయినా దీని కపవాద(మినహాయింపు)లు ఉండవని కాదు, మొత్తాని కిది తిరుగులేని సిద్ధాంతం.

ఏమంటే?

కళ లన్నీ, పామరాన్న లయినా లలితా లయినా హార్దికాలు గాని, మానసికాలు కావు.

హృదయం స్నిగ్ధం కాని, రూక్షం కాదు,

అది స్పందనశీలమున్నూ కాని, నల్లరాతిలాగ నిశ్చలం కాదు.

మధురమైన భావం తోచిందా — మంజులమైన నాదం వినబడిందా — రమ్యమైన రూపం కన కనబడిందా — స్పందించేస్తుంది, అప్రయత్నంగా అది.

మొత్తానికి మానవమాత్రుల విషయం యిది.

వారిలో కళాప్రవీణు లయినవారి సంగతి వేరు.

వారి హృదయం రసజగత్తులోనే తాండవం చేస్తూ వుంటుం దెప్పుడూ.

వారి ప్రపంచం వేరు.

వారి రూపు వేరు.

వారి ఆశ వేరు.

వారి అనుభవాలు వేరు.

వారి జీవనసరళి వేరు.

వారి జీవితపరమావధిన్నీ వేరే, సర్వాత్మనా.

ఎంచేత నంటే?

సత్యనిష్ఠ వారిది.

సౌందర్యదిదృక్షు వారిది.

రసతృష్ణ వారిది.

యాతనాబహుళమైన యీ సంసారం రసకుండిలం చెయ్యడమే వారి పరాకాష్ఠ.

కళలే ఇది సాధించగలవు.

కళలోనే వారికి అస్తిత్వం.

కళలోనే వారికి ప్రవృత్తి.

కళలోనే వారికి ముక్తిన్నీ.

ఇక్కడ ఒక వింత సంగతి యేమిటంటే?

కామతంత్రమున్నూ వొక కళే కావడం.

సామాన్యమైనది కాదు మరి. మన సంస్కర్తల కాదర్శభూతులైన ఆంగ్లేయులున్నూ ఆరాధించే కళ అది.

ఏవొక కళ అయినా నేర్చివుంచినవారికే అందులో ప్రవేశార్హత.

అసలు కళావేత్తలయినవారి కామమే పురుషార్థాల్లో చేరుతుంది.

తక్కినవారిది లాంపట్యం.

ఒట్టి పశుప్రవృత్తిన్నీ.

అన్ని సంఘాల్లోనూ, అన్ని మతాల్లోనూ, అన్ని దేశాల్లోనూ వేత్తలయినవారందరూ అంగీకరించే శుద్ధ సత్యం యిది.

కాగా,—

అటు కళావేత్తృతా ఇటు తారుణ్యమూ కారణంగా వేశ్యలకున్నూ పురుషవాంఛ పుట్టవచ్చు, తప్పనిసరిగా.

ఇక తరవాతి సంగతి?

ధనికులయిన తక్కిన కులాల యువకుల దాష్యత.

వారంతా శ్రీరామచంద్రులు కారు.

రావణులే వున్నారు వారిలో చాలామంది.

రావణుణ్ణి మించినవారున్నూ వున్నారేమో.

విలాసవతి అయిందా—కనీసం చక్కనిదయిందా—మొగమెత్తి పరపురుషుణ్ణి చూసిన మగవాలినే బతకనివ్వరు వారు.

స్త్రీల నాకర్షించడానికి వారు కనబరచని విలాసాల్లేవు.

వారు పన్నని యుక్తుల్లేవు.

వారు తొక్కని పెడదారుల్లేవు.

వారు చెయ్యని కుట్రల్లేవు.

వారూహించని ద్రోహాల్లేవు.

వారు పట్టని కాళ్లు లేవు

వారు సిద్ధపడని నైచ్యం లేదు.

వారు పాల్పడని పాపాల్లేవు.

వారు కరవని గడ్డి లేదు.

విద్య అక్కరలేదు వారికి.

ప్రేమ అక్కరలేదు వారికి.

కులం అక్కరలేదు వారికి.

ప్రాణం కూడా అక్కర్లేదు వారికి.

స్త్రీ శరీరం మాత్రమే కావాలి వారికి.

వేశ్యఅంటే వళ్లేరుమాది బండినసకే వారికి.

కాక,—

వేశ్యల్లో ధనతృష్ణా వుండవచ్చు, కొంచెమో గొప్పో.

విరుచుకుపడే యీ ధనికయువకులను శీవచ్ఛ వాలు చేసి పారేద్దామన్న కసీ వుండవచ్చు, కొందరికయినా.

ఏమయినా వేశ్యలకు పురుషసాంగత్యం అనివార్యం కావడం అసహజం కాదు.

కాని అది కులధర్మం మాత్రం కాదెంత మాత్రమూ.

మన మహర్షులలాంటి దుష్టనిర్ణయం ఎందులోనూ చెయ్యలేదు.

నిజంగా వేశ్యాకులం స్తవనీయం.

గణనీయం.

ఆదరణీయమున్నూ.

మన సంస్కర్తలు జాతీయ సంస్కారదూరులు కనక యీసత్యం గుర్తించలేకపోయారు.

అంతే కాదు.

మనలో కొత్త దురాచారాలే ప్రవేశపెట్టారు వారెన్నో. వేశ్యాకులంలో సామాన్యసంఖ్య తగ్గిపోయింది. మగనాళ్ల సంఖ్య బాగా పెరిగిపోయింది. చాలా సంతోషమే.

కాని, సంసారిణుల్లో అతి దారుణంగా పెరిగిపోయిందే వ్యభిచారం, దాని కేమి విరుగుళ్లు కల్పించారూ యీ సంస్కర్తలు?

అదొక ఫేషనుగా తయారయిపోయిందే, దానికిన్నీ యేమి చెబుతారూ?

"సంస్కర్త" అంటే సరిదిద్దేవాడని అర్థం.

కాని మనధర్మం ప్రాతిపదిక లేమిటో మన సంస్కర్తలకు తెలియవు.

మన ధర్మానికి మన మహర్షులు రూపు దిద్దిన స్వస్వరూపం యేమిటో వారికి తెలియదు.

మన ధర్మం తనకుతాను ప్రవర్తిల్లిన తీరు తెన్నులున్నూ వారికి తెలియవు.

అదెందుకు చెడిందో వారికి తెలియదు.

ఎలా చెడిందోకూడా వారికి తెలియదు.

జర్జరితాలైన పునాదులు పునాదుల్లాగే వుంచి పైపై నిర్మాణాల్లో మార్పులూ, కూర్పులూ, చేర్పులూ చేస్తే, చివరి కవి యెలా పరిణమిస్తాయో వారు గుర్తించలేదు.

ఇంకోటి కూడా వుందిక్కడ.

తమ సంస్కారం పూర్తిగా విడిచిపెట్టలేదు వారిని.

ఖండాంతరాలనుంచి దిగుమతి అయిన సంస్కారం వొంటబట్టలేదు వారికి, కావలసినంత.

దీనికి సాక్ష్యం, మన ధర్మానికి "ఏ"మని అడిగే రక్షణ కూడా లేకపోయింది.

ఈ స్థితిలో, పరప్రభువుల శాసనాధికారం అండగా, విజాతీయుల అంగబలం ఆధారంగా మన ధర్మం దిద్దడానికి పూనుకున్నారు వారు.

ఇప్పటికీ యిదేస్థితి మనలో.

అపాయకరమైన సన్నివేశం యిది.

లజ్జావహమైన పరిస్థితి యిది.

ఏఖండంలో నయినా, యేదేశంలో నయినా, యేమతంవారిలో నయినా—సాంఘిక వ్యవస్థ లెన్ని రకాలున్నా వుండినా, ఎలాంటి సందర్భాల్లో నూ కూడా ధర్మనిర్ణయమూ, ధర్మసంస్కారమూ చెయ్యడాని కొక్క మహర్షులకే అధికారం.

ఇతరుల్లో—యితరభావల్లో అలాంటివారి పేర్లు మరోవిధంగావుంటే వుండవచ్చు, మనలో—మన జాతీయభావలో మహర్షు లన్నదే వారికి నిర్దేశం.

రాగద్వేషరహితులు కనక—స్వపరభేదభావం వుండడాని కవకాశం లేనివారు కనక—సమష్టి క్షేమమే సాధించేవారున్నా కనకనే వారికా అధికారం.

ఇంగ్లీషు చదివినా, వేదశాస్త్రాలే చదివినా గృహస్థు అయివుండినవాడికి మహర్షులు నిర్ణయించిన ధర్మం ఆచరించడానికి మాత్రమే అధికారం.

కాని, మన కిప్పుడలాంటి మహర్షు ల్లేకపోవడం మన దురదృష్టం.

ఇంగ్లీషు నేర్చినవారి సంగతి యేమయినా, సనాతనవిద్యలు నేర్చి, సనాతనధర్మపరాయణులం అని చెప్పకుంటూ, సనాతనధర్మం భ్రష్టం అయిపోతోం దని గోలపెట్టే వైదికుల్లో నయినా అందుకు తగ్గ సత్తా వుండినవారు లేకపోవడం మరీ దురదృష్టం.

ఏకులాని కాకులంవారే—ఏశాఖకున్నా ఆశాఖ వారే సర్వానికీ కర్తృత్వం వహిస్తున్నా రిప్పుడు.

దీనివల్ల ఘర్షణ యేర్పడుతుంది.

జాతి యేకత భంగపడిపోతుంది, దీంతో.

ధర్మం భ్రష్టం కావడంతోపాటు మన కొక కొత్త ముప్పిది.

మన కొక్కటే మార్గం యిప్పుడు.

వర్ణాశ్రమపద్ధతి అవలంబించి నడుచుకోవడమా, అంతా వొకటే అయిపోవడమా?

ఏమయినా వొకటే నాకు.

వలువలతోపాటువాణ్ణే నేను.

అయితే, కులధర్మాలు మార్చుకోడమూ, సవరించుకోడమూ పెట్టుకుంటే, వర్ణాల పద్ధతీ, కులాల పద్ధతీ వొప్పుకోడమే అవుతుంది, తెలుసుకోగలిగితే.

ఈ వర్ణాలకూ యీ కులాలకూ సామరస్యం కలిగిస్తూ జాతిని వొక్క తాటిమీద నడిపే ప్రాజాపత్యం వొక్కరి కివ్వడానికిన్నీ అంగీకరించడమే అవుతుంది.

కాదంటారా?

వర్ణాలూ కులాలూ—ఈ పద్ధతే వదులుకుందాం.

వర్ణాశ్రమధర్మమూ, కులధర్మమూ అన్న వలయాలు పోయి, అప్పుడు జాతిధర్మం వొక్కటే రూపొందుతుంది.

వ్యక్తులకు స్వాతంత్ర్యమూ పారతంత్ర్యమూ కూడా సమానమే అవుతా యప్పుడు.

మరి, ప్రకృతం.

ఏమయినా, వేశ్యాకులంవారు తమ కులధర్మం మాత్రమే మార్చుకుని, తాము తాముగానే వుండిపోతా మంటారా?

ఎవ రడ్డుకుంటారూ?

ఎవ రడ్డుకోగలరూ?

అడ్డుకోవలసిన అగత్యం మాత్రం యెవరికీ?

కాని, వొక్కటి మాత్రం చెబుతాను.

కులధర్మం మార్చుకుని కులంమట్టుకి అట్టేపెట్టు కోవడం అపాయకరం.

రకం మారుతుందే గాని, వెనకటికి మనమహర్షులు చేసిందే యిది.

కులాలమొదల తారతమ్యవిచారం అప్పుడూ వుండనే వుండిపోతుంది.

కులాలను పురస్కరించుకుని మనలో కొందరిప్పుడు ప్రబలం చేస్తున్న స్పర్థలూ, ద్వేషాలూ, అనుమానాలూ, ఆరోపణలూ, పగలూ, కల్లోలాలూ అప్పుడున్నా వుండనే వుండిపోతాయి.

ముందు వెనకలూ, హెచ్చుతక్కువలూ తప్పనివే అయిపోతాయి.

పైగా, సంఘంలో అత్యవసరాలయిన కొన్ని పనులు జరగడాని కవకాశాల్లేక కల్లోలం యేర్పడుతుంది.

జాతి అంతా గందరగోళం అయిపోతుంది.

దేశం ఛిన్నాభిన్నం అయిపోతుంది.

అభివృద్ధి నిరోధకులు విజృంభిస్తారు.

పగలు మీద పడతారు.

హాహాకార, సర్వమూ సర్వనాశం అయిపోతుంది.

అయినా సరే అంటారా?

అయితే సరే.

# కలగూరగంప

## కల్క శబ్దవిచారం

తపో నకల్కోఽధ్యయనం నకల్కః
  స్వాభావికో వేదవిధి ర్నకల్కః,
ప్రసహ్య విత్తాహరణం న కల్కః
  తా న్యేవ భావోపహతాని కల్కః.

భారతం 1-1-210.

'భావోపహితాని కల్కః' అని మైథిలీపాఠం. తపస్సుమాత్రమే కల్కంకాదు. శాస్త్రాధ్యయనం మాత్రమే కల్కంకాదు. సహజమైన (సంప్రదాయ సిద్ధమైన) వేదవిహిత కర్మలు కల్కంకాదు. అంతా ఇచ్చివేయడం కల్కంకాదు. ఇవన్నీ సమీచీన భావంతో కూడితేనే కల్కమౌతుంది.

ఇక్కడ 'కల్కః' అనే పదం సిద్ధిఅనే అర్థంలో ప్రయుక్తమైంది. కల్కమంటే హరించేది (పాపాన్ని) అని అర్థం. ఆయుర్వేదంలో కల్కమంటే ఒక ఔషధప్రక్రియ—నూరిచేసిన ముద్ద. 'కల్'ధాతువునుంచి పుట్టిందీ పదం. దీనికి సిద్ధించు, పూర్ణమగు అనే అర్థాలూ ఉన్నాయి.

అనాదిగా రూపొందిన భారతీయ సంస్కృతిలో 'ధర్మ'మంటే ఏమిటో ఈ శ్లోకంలోని ఉదాత్త భావం తెలుపుతున్నది. కల్కశబ్దం ఆకాలంలో ఆచారవ్యవహారాలను, తత్త్వవిద్యను తెలుపడానికి తరచు ప్రయోగించేవారేమో! తర్వాత క్రమంగా ఈ నిర్దిష్టార్థం పోయిఉంటుంది.

దశావతారాలలో కడపటిది కల్క్యవతారం. ఈ కల్కిపదం వ్యుత్పత్తికూడా 'కల్'ధాతువునుంచే. ఈ కల్కిపదానికి ఇంతవరకూ ఎవరూ సరైన అర్థం చెప్పడంలేదు. పై శ్లోకంలోని కల్కశబ్దం ఈ కల్కిపదాన్ని సరిగా అర్థంచేసుకోవడానికి తోడ్పడగలదని భావిస్తున్నాను. కల్కి అంటే కల్కంపొందినవాడు-కల్కం సాధించినవాడు.

ఈ శ్లోకంలోని భావమే భారతంలో మరికొన్నిచోట్లా చెప్పబడింది :—

"ఇజ్యా ధ్యయన దానాని
  తపః సత్యం క్షమా దమః,
అలోభ ఇతి మార్గోయం
  ధర్మ స్యాష్టవిధః స్మృతః.
తత్ర పూర్వః చతుర్వర్గః
  పితృయానపథే స్థితః,
క ర్తవ్య మితి యత్కార్యం
  నాభిమానా త్సమాచరేత్.
ఉ త్తరో దేవయానస్తు
  సద్భి రాచరిత స్సదా,
అష్టాంగే నైవ మార్గేణ
  విశుద్ధాత్మా సమాచరేత్."

అరణ్య. 2-71, 72, 78.

"యజ్ఞో దాన మాధ్యయనం తపశ్చ
  చత్వా ర్యేతా న్యన్వయేతాని సద్భిః,
దమ స్సత్య మార్జవ మానృశంస్యం
  చత్వా ర్యేతా న్యన్వవయంతి సంతః."

ఉద్యోగ. 35-48.

"వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
  దానేషు య త్పుణ్యపదం ప్రదిష్టం,
అత్యేతి త త్సర్వ మిదం విదిత్వా
  యోగీ పరం స్థాన ముపైతి చాద్యం."

భీష్మపర్వ-30-28, భగవద్గీత. 8-28.

"యస్య వాఙ్మనసీ గుప్తే
  సమ్య క్ప్రణిహితే సదా,
వేదా స్తపశ్చ త్యాగశ్చ
  స ఇదం సర్వ మాప్నుయాత్."

శాంతి 288-24. భీష్మ 33-48.

భారతంలో ఆదిపర్వంలో ఈ కల్కశబ్దం ప్రయోగించిన సందర్భాన్ని బట్టి, దీని అర్థం సిద్ధి అయి ఉంటుందనడం స్పష్టం.

ఆదిపర్వం శ్లోకంలోని భావాన్నే మనువూ చెప్పినట్లు తోస్తుంది. ఈ రెండు శ్లోకాలను పోల్చి చూడండి:

"వేదా స్త్యాగశ్చ యజ్ఞశ్చ
  నియమాశ్చ తపాంసిచ,
న విప్రదుష్టభావస్య
  సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్." 2-97.

మనువు భారత శ్లోకభావాన్నే ప్రకారాంతరేణ చెప్పాడనడం స్పష్టం. కనుక కల్మమంటే సిద్ధి అన్న అర్థమే సహేతుకమని తోస్తుంది.

కల్మ పదానికి ఈ అర్థంలో మరెక్కడైనా ప్రయోగాలు లభిస్తే భారతీయ సంస్కృతి ప్రధాన సిద్ధాంత పరిణామగతిని తెలుసుకోవడానికి తోడ్పడు తుంది.

(బరోడా యూనివర్సిటీ ఓరియంటల్ ఇన్స్టిట్యూట్ జర్నల్‌లో శ్రీ ఉపేంద్రరాయి జె. సండేసర వ్రాసిన వ్యాసం నుంచి.)

## భుజ్‌లో లభించిన అపూర్వ కాంస్య విగ్రహం

భుజ్ (కచ్) లోని ఫెర్గూసన్ మ్యూజియంలో ఉన్న భిన్నమైన విగ్రహాలను ఇటీవల పరిశీలించగా, ఒక అపూర్వ బౌద్ధవిగ్రహం కంచుది కనిపించింది. ఈ విగ్రహం పాదపీఠంపైని ఉన్న బ్రాహ్మీశాసనాన్నిబట్టి ఇది 7 వ శతాబ్ద ప్రారంభంది అయి ఉంటుందని తోస్తుంది.

ఈ విగ్రహం ఎత్తు - పాదపీఠం ఎత్తు మూడంగుళాలతో సహా - ఎనిమిది అంగుళాలు. బుద్ధమూర్తి సమభంగముద్రలో నిలబడి ఉన్నట్లు చెక్కి ఉంది. చుట్టూ దీర్ఘ వృత్తాకారంగా ఉన్న ప్రభావళిలో వామభాగం విరిగిపోయింది. బుద్ధుడు పద్మపీఠంపై నిలబడి ఉన్నాడు. కుడిచేతిలో అభయముద్ర, ఎడమచేత వస్త్రం పట్టుకొని ఉన్నట్లు చెక్కబడి ఉంటుందేమో! కాని ఎడమచేయి విరిగిపోయింది. ముఖంపై సహజమైన మందహాసం, దివ్యభావన తాండవ మాడుతున్నాయి.

ఈ విగ్రహం నేపాల్ రాజధాని ఖాట్మండూ లోని మచ్ఛందర్ వాహాల్ లో ఉన్న అవలోకితేశ్వరుని 108 రూపాలలో ఒకదానిని పోలుతున్నది.

ఈ విగ్రహం అచలకేతు అవలోకితేశ్వర విగ్రహాన్ని కూడా పోలి ఉంది. (అచలకేతు స్వరూపం కుడిచేత్తో అభయముద్ర, ఎడమచేత్తో పిండపాత్ర.) ఈవిగ్రహం ఎడమచేయి విరిగింది గనుక దానిలో ఏమున్నదీ చెప్పలేము. అయినా, ఇది అవలోకితేశ్వరుని అవతారాలలో ఒకటి కావచ్చు.

పాద పీఠంపైన ఉన్నశాసనంలో ఎదుట ఉన్న పంక్తి ఇలా ఉంది:

(1) [దే] య ధర్మోయం నాగసిఘ భిక్షో : తస్య భిక్షునికా సమా :

ఎడమవైపు పంక్తి ఇలా ఉంది:

(2) మాతృభి:...త దవస్య [కీ] ర్తి: స్థా [పి] తా.

ఈ విగ్రహం నాగసింహ భిక్షువు తన తల్లి దేవకీర్తి జ్ఞాపకార్థం స్థాపించాడు. ఈమె భిక్షుణులలో చేరింది. అని ఈ రెండు పంక్తుల అర్థం కావచ్చు.

హూయెన్ త్సాంగ్ భారతయాత్ర చేసినప్పుడు వలభీపురం రాజధానిగా పశ్చిమ భారతాన్ని మైత్రక వంశరాజులు పాలించేవారు. అప్పుడు పశ్చిమ భారతావనిలో బౌద్ధం వ్యాపించింది. ఈ విగ్రహం ఆ కాలంది అయిఉంటుందని తోస్తుంది. హూయెన్ త్సాంగ్ క్రీస్తుశకం 641 లో వలభీపట్టణానికి వచ్చాడు.

ఈ విగ్రహ నిర్మాణం శైలిలో బరోడా దగ్గరి అకోటా విగ్రహ సముదాయంలో లభించిన జైనవిగ్రహాలను, వలభీపురంలో లభించిన కాంస్యవిగ్రహాలను పోలి ఉంది.

(బరోడా ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ జర్నల్ సంపుటి 8, సంచిక 3 లోని శ్రీ ఎం. ఆర్. మజుందార్ వ్యాసంనుంచి.)

## శ్రీ రాయల గయ శాసనము

### శ్రీ కె. సుబ్బరామప్ప

పై శీర్షిక క్రింద 1959 ఫిబ్రవరి "భారతి"లో డాక్టర్ నేలటూరి వేంకట రమణయ్యగారు వ్రాసిన వ్యాసము చదివితిని. శ్రీ కె. హెచ్. వి. శర్మగారు 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక'లో వ్రాసిన వ్యాసముపై డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు విమర్శాత్మకముగ వ్యాఖ్యానముచేసి శ్రీ కృష్ణదేవ రాయలవారు గయాక్షేత్రమున కవి ముక్కు తిమ్మనచే వేయించిన శాసనము ఆతని దిగ్విజయమును సూచించుచున్నదనియు, శ్రీ శర్మగారు వ్రాసినట్లు ఆ శాసనము ముక్కు తిమ్మన రాయలవారి పరముగ గయాశ్రాద్ధాదికములను చేయించినట్లు సూచించదనియు విమర్శించి సిద్ధాంతీకరించియున్నారు.

నేను ఈ జూన్ నెల 1, 2 తేదీలు స్వంతపని మీద ఉదకమండలము పోయియుండి అచ్చటి ఇండియా ప్రభుత్వమువారి ఎపిగ్రాఫిస్టు ఆఫీసును సందర్శించితిని. అచ్చటి శాసన ప్రదర్శనశాలలో ఎపిగ్రాఫిస్టు డాక్టర్ డి. సి. సర్కార్ గారు ఇటీవల గయాక్షేత్రమున సేకరించిన శ్రీ కృష్ణదేవరాయల శాసనముతోపాటు ఒకటవ కాకతీయ ప్రతాపరుద్ర (I), మూడవ హొయసళ నరసింహ (III), విజయనగర

అచ్యుతరాయలు—వీరుకూడా గయాక్షేత్రమున వేయించిన శాసనములను సేకరించి తెచ్చి వాని పూర్తిపాఠములను ప్రదర్శించియున్నారు. వాని వివరములను "ఎపిగ్రాఫికా ఇండికా"లో ఫోటో బ్లాకులతో పాటు ప్రచురించనున్నామని డాక్టరు సర్కార్ గారు నాతో చెప్పిరి. అదే ఆఫీసులో నే తెలుగు సంస్కృతభాషల అసిస్టెంటుగా పనిచేయుచున్న శ్రీ కె. హెచ్. వి. శర్మగారితోకూడా పై శాసనముల విషయమై చర్చించితిని.

పై శాసనములను, వాని పాఠములను పరిశీలించినచో ఆయా రాజులు వారి ప్రతినిధులను ఆచారప్రకారము పంపించి గయాక్షేత్రమున శ్రాద్ధాదికములను చేయించిన పిమ్మట వేయించిన శాసనములనియే తెలియుచున్నవి. డాక్టర్ వేటూరి వారన్నట్లు కృష్ణదేవరాయల గయాశాసనము ఆ సార్వభౌముని విజయమునే చాటినటయిన పైని చెప్పిన కాకతి ప్రతాపరుద్రుడు, హొయసళ నరసింహుడు, అచ్యుతరాయలు కూడా గయను జయించినట్లే భావించవలెనుకదా!

శ్రీ కృష్ణదేవరాయలుగానీ మరి పైని చెప్పిన రాజులుగాని దాదాపు గయవరకు విజయయాత్రలు చేసినట్లు ప్రసిద్ధ చరిత్రకారు లెవ్వరును వ్రాయలేదు. కనీసము డాక్టరు వేటూరి వారున్ను, ప్రొఫెసర్ కె. ఎ. నీలకంఠశాస్త్రి గారున్ను వ్రాసిన విజయనగర చరిత్రలోకూడ కృష్ణదేవరాయలు దాదాపు గయవరకు పోయిన సూచనలే లేవు. కాబట్టి శ్రీ కృష్ణదేవరాయల తరపున ముక్కతిమ్మన వేయించిన శాసనము ఆ సార్వభౌముని విజయమునెంత మాత్రమును చాటుటలేదు. అది కేవలము శ్రాద్ధాది కర్మలను వాడుక ప్రకారము చేయించుటను చాటును. రాజమర్యాదలను సూచించునట్లు అందలి వాక్యములు పదములు రచియింపబడినవే కాని అవి విజయమును చాటునట్లు తోపదని నా అభిప్రాయము.

(శ్రీ కె. హెచ్. వి. శర్మగారి వ్యాసముకూడా ఈ సంచికలోనే ప్రచురితమైనది. —సంపాదకుడు.)

# పల్లవులు

## శ్రీ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి

ఏప్రిలు నెల భారతిలో పల్లవుల నైజమును నిర్ణయించడానికి పల్లవశిల్పము ఇచ్చే సాక్ష్యాన్ని గురించి చెపుతూ మూడు వింత శిల్పాలను పేర్కొన్నాను. ఒకటి గంగావతరణ చిత్రములో జటామకుటధారి అరచేతిలో (నిల్పిన) లేడిబొమ్మవంటి పాత్ర. రెండు: పల్లవసింహముల రింగుల జూలు (ఆ సింహాల తలలు గుండ్రముగా ఉండడముకూడా విచిత్రమే). మూడు: గణేశరథముమీది రాజు తలకున్న కొమ్ముల కిరీటము. మే నెల భారతిలో శ్రీ ఆమంచర్ల గోపాలరావు గారు నా 'సాహాసాలను' విమర్శిస్తూ ఫోటోలుకూడా ఏవో యిచ్చారు. వారు సంగ్రహానివృత్తికోసము మహాబలిపురము వెళ్ళి చూచివచ్చినారట కూడాను. అయితే నేను మహాబలిపురమును ఇన్నిసార్లు చూచానని వాదించబోను.

నాది ఒకటే మనవి. తక్కిన ఫోటోలు ఏవేవో ఇవ్వడముకంటె నేను పేర్కొన్న మూడు ఉదాహరణల ఫోటోలూ—వివిధ కోణాలలో తీసినవి—ఇచ్చేస్తే చదువరులే నిర్ణయించుకుంటారు. వారు తీసివుంటారు ఆ ఫోటోలు. అవి దయచేసి ప్రచురించమని కోరుతున్నాను. వస్త్రాన్ని లంబముగా పట్టుకొని పిండడమూ, అరచేతిలో నిలబెట్టడమూ, పిండే వస్త్రము దిగువన లావుగానూ పైకి పోనుపోనూ సన్నముగానూ వుండడమూ, పై పిడికిలి పైనవున్న వస్త్రముకూడా సన్నముగా కొసదేరడమూ నే నెరుగను. నిందుశిల్పములో "లేకులను" మొదటిలో లావుగానూ పోనుపోనూ సన్నముగానూ చెక్కడమూ ఎరగను. గణేశరథముమీది తలనూ, వారు ఇచ్చిన అహిచ్ఛత్రపు బొమ్మనూకూడా చేర్చియిస్తే పాఠకులు కొంచెము చూస్తారు కొమ్ములేవో, లేకులేవో. అలాగే అమరావతి సింహానికి పక్కన పల్లవ సింహమునూ ఇమ్మని కోరుతున్నాను.

పల్లవులు ఆశ్వత్థామ వంశమువారని ఒక వాదము. అయితే వారి పేరులు 'వర్మ' లెట్లు? గౌతమీపుత్రుని తల్లి! పల్లవులను యవనశకాది విదేశీయులతో చేర్చినదే. ఆమెకు వారు ఈ దేశమువారని తెలియదా? "పల్లవుల"ను పేరునకు అన్వయమెట్లు?...ఇలాంటి సందేహాలు చాలా వున్నాయి. వీటికితోడు పల్లవ విగ్రహాల నెత్తిన దొరటోపీలాటి బరువు కిరీటమూ, పల్లవులు శాతవాహనులూ, ఇక్ష్వాకులూవలె పాలరాతితో కాక రేవపురాతిని మలచడమూ, పల్లవనాగినుల కర్ణాభరణ అసామరస్యమూ వీరు ఆంధ్రజాతివారు కాదేమో ననిపిస్తుంది. నేను పేర్కొన్న శిల్పాలు కూడా విచిత్రములే నా దృష్టికి; వారు కాదన్నారు. దయచేసి బొమ్మలివ్వండి. నా దగ్గర బొమ్మలు లేవు. నేను మద్రాసుకు చేరువగా లేను.

# మోటిఫ్ భావనాంకురం ఎలా అయ్యాని?

సంస్కృతంలో ఒక సామెత వుంది. "నీవి మోచన వేళాయాం, వస్త్రమూల్యవిచారకాః" అని. ఇప్పుడు "భావనాంకురం" తగాదా అచ్చు పైసామెతలోవలెగా సాగుతోంది. ఇటువంటి తగాదాలో

వేలు పెట్టి, ఒకటి రెండు మాటలు, ప్రాధాన్యమున్న భాగం వాటికి కల్గడం, అదృష్టమో, దురదృష్టమో తెలియకుండా వుంది.

ఫ్రెంచిభాషలోని Motif ఇంగ్లీషులో Motive అయిందని అంటున్నారు. నిజానికి ఈ రెండు మాటలు Motivum, Motivus, Motus, అనే లాటిను శబ్దాల్లోంచి ఉద్భవించాయి. Motivum అంటే Moving cause అని అర్థం. Motivus అంటే Serving to move అని అర్థం. Motus అంటే moved అని అర్థం. ఈ మాటల్లోంచి Motif ను సాధించి ఫ్రెంచి లాక్షణికులు దానికి ఇతివృత్తం లేక ఇతివస్తుకము అని (a subject or a theme for development or treatment), విశిష్ట లక్షణ లక్షితమైన చిత్రకవిశేషమని (a distinctive figure in a design), ప్రధాన ప్రత్యయము లేక లక్షణము అని (a dominent idea or feature) అర్థాలు చెప్పుకున్నారు. కాని శ్రీ ఆ మంచర్ల గోపాలరావుగారు—వారు శిల్పశాస్త్ర పారంగతులు— Motif ను "భావనాంకురం" అని తర్జుమా చేస్తూ లంటున్నారు. అందుకు గాను Sheldon Cheney గార్ని కూడా ఈ అర్థవాదంలోకి దొర్లించుకువచ్చి, ఆయన అన్న Motivating fragments కు భావనాంకురాలని తర్జుమా చేస్తే అర్థం కుదురుతుందంటున్నారు.

అయితే సంస్కృతంలో "భావన" "అంకురం" అన్న మాటలను ఇక్కడ వాడితే, ఆ Cheney చెప్పిన అర్థం వస్తుందా? భావన అనే శబ్దానికి ఎన్నో అర్థాలు వున్నాయి. ఊహ, కల్పన, తలపు, ఆలోచన, మననము—మొదలైనవి. ఇందులో ఏ మాటకు గాని Motive అనే ఇంగ్లీషు పదంలో వున్న అర్థానికి దగ్గరగా పోయేది లేదు. 'అంకురం' అంటే మొలక, నీరు, రక్తం, మొదలైన అర్థాలు వున్నాయి. అంతే గాని "Fragments" అని Cheney అన్న మాటకు అర్థం చెప్పే శక్తి దానికి లేదు. Fragment అంటే శకలం అని కదా అర్థం? అది అంకురం అని ఎట్లా అవుతుంది? అదీ కాక సంస్కృతంలో సంధులు, సమాసాల గోల కొంత వుంది. భావన, అంకురం అనే రెండు మాటలు కలసి, సవర్ణదీర్ఘ సంధిగా భావనాంకురం అనే మాట ఏర్పడింది. అర్థం చెప్పుకునే నిమిత్తం దాన్ని ఏ తత్పురుష సమాసంగానో, రూపక సమాసంగానో, బహువ్రీహిగానో చేసుకోవాలి. తత్పురుషం అయితే భావన యొక్క అంకురం అని అర్థం కుదురుతుంది. రూపకం అయితే భావన అనే అంకురం అవుతుంది. ఇట్లా చెప్పుకుంటే గోపాలరావుగారు తమ మనస్సులో Motif కు పెట్టుకున్న అర్థం కుదరదు. భావననుండి అంకురించింది - అని చెప్పుకుని సరిపెట్టుకుందామంటే పొసగదు. ఎందుచేతనంటే అప్పుడు భావనాంకురాన్ని భావనాంకురితము చేయవలసివుంటుంది. ఇంతకీ "భావనకు సయితము పూర్వమైన ప్రకృతియందలి చిత్రకారుని ఆకర్షించి, అతని మననమునకు పాత్రమైన బీజరూపము" అనే అర్థాన్ని ఇచ్చేశక్తి, ఈ భావనాంకురాన్ని, ఏ విధంగా మార్చి ఏ విధంగా అర్థం చెప్పుకున్నా, దీనికి లభించడం లేదు. అందువల్ల "భావనాంకురం" అనే మాట Motif కు సరియైన తర్జుమా కాదని తేలుతోంది.

తమ యీ భావనాంకురం వాదాన్ని వివరిస్తూ గోపాలరావుగారు "శూన్యతా బీజతో" మంత్రం తెచ్చిపెట్టుకున్నారు. ఇది బౌద్ధుల మంత్రయానశాఖకు సంబంధించిన శ్లోకం. వైదికు లెవరూ మూలశక్తిని శూన్యం అనరు. శూన్యంలోంచి బీజాలు, బింబాలు, బిందువులు, న్యాసాలు, విన్యాసాలు వచ్చేది బౌద్ధులకి; వైదికులకు సర్వ అధిష్ఠానమూ బ్రహ్మ పదార్థం. అదే రసం; రసోవై సః; ఇవి ఈ దేశంలో రెండు సంప్రదాయాలు. ఇది తెలియకపోవడం మనస్సుయొక్క అవికసస్థితిని చెబుతుంది. పైగా ఈ దేశంలో ఏ ఆలంకారికుడూ, ఏ లక్షణవేత్తా కవిని గాని, శిల్పిని గాని యోగి అనలేదు; ఋషి అన్నారు. "నా నృషిః కురుతే కావ్యం" కవి, శిల్పి ఒకే తెగవాళ్లు గనుక, ప్రతిభచేత జీవించేవాళ్లు గనుక, ద్రష్టలుగనుక, క్రాంతిదర్శులు గనుక, ఋషులైనారు. యోగులు ఒక మెట్టు తక్కువ వాళ్లు. వాళ్ళు వట్టి సాధకులు.

ఒక శిల్పి శిల్పించాలన్నా, కవి కావ్యం చెప్పాలన్నా, ఒక వాగ్గేయకారుడు ఒక కృతిని, కీర్తనను, పదాన్ని రచించాలన్నా వస్తువు వుండాలి. వస్తువు శూన్యంలోంచి పుట్టదు. జగత్తు దానికి ఆధారం. జగత్తునుంచి ఆ వస్తువును గ్రహించినవాడై శిల్పి దాన్ని ఒక ఉద్దేశం పెట్టుకుని శిల్పిస్తాడు. ఒక అభిప్రాయం పట్టుకు రచన సాగిస్తాడు. ఆ అభిప్రాయాన్ని ఉద్దేశాన్ని Motive అంటారు. వస్తువులేని చోట Motive వుండదు. అవి ఆధారాధేయభావం కల్గినటువంటివి. ఉదాహరణకు: బుద్ధుణ్ణి చెయ్యాలని ఒక శిల్పి అనుకున్నాడు. బౌద్ధశిల్ప ప్రారంభదశలో బుద్ధుణ్ణి బొమ్మగా చేసేవాళ్ళు కాదు. తన నిర్వాణం తర్వాత తనను ఆరాధించవద్దని హీనమైన (కర్మకాండ లేని) యానమే తనదని, కనుక శిల్పాలు, పూజలు మానవలసిందని బుద్ధుడు ఉపదేశించాడే మరి? అక్కడ బుద్ధుడు వున్నాడని సూచించడం ఎట్లా? అందుకు శిల్పులు కొన్ని పద్ధతులు పెట్టుకున్నారు. బుద్ధుని బొమ్మ వుండవలసినచోట ఏమీ చెక్కకుండా, పైన యత్తులను, దళ మృగరాజాలను, బ్రహ్మ మొదలైన

దేవతలను చేసేవాళ్ళు. ఇది అంతా చూచి అక్కడ ఖాళీగా వున్న చోట బుద్ధుడు వున్నాడని మనం అనుకోవాలి. తర్వాత బుద్ధుని పాదాలస్థానంలో అరవిచ్చిన కమలం, పిదప పాదపీఠం తర్వాత పాదాలు మాత్రం వేయడం, బోధివృక్షం వెయ్యడం, బోధిక్రింద పడగవిప్పిన ముచిలిందసర్పాన్ని వెయ్యడం మొదలు పెట్టారు. ఇదంతా ఎందుకంటే, శిల్ప వస్తువుగా గ్రహించింది బుద్ధుణ్ణి. ఆ బుద్ధుణ్ణి బొమ్మగా వేసేందుకు, ఆ తొలి తొలి రోజుల్లో వీలులేదు గనుక, ఇటువంటి భావ సామగ్రిచేత, బుద్ధుడు అక్కడ వున్నట్లు అవభాసింప చేస్తున్నాడు. అట్లా చేస్తున్నాడన్న విషయంలో వున్న సంప్రదాయం తెలిస్తేగాని, ఈ శిల్పార్థం తెలియదు. ఇట్లా ఈ సంగతిని తెలియ చెప్పడానికి శిల్పి పెట్టుకున్న సర్వసామగ్రి కలిసి, సమాహారంగా Motive అవుతోంది. బౌద్ధులలో "సేకం" అని ఒక తంతు వుంది. ఆ "సేకం" ఎందుకు జరుగుతుందో, ఎట్లా జరుగుతుందో చెప్పడానికి గ్రంథాలు వున్నాయి. "సేకోద్దేశం" వాటిల్లో ఒకటి. దానిమీద ఒక టీక వుంది. దానిపేరు సేకోద్దేశం టీక. ఇప్పుడు Motive అనే మాటకు "ఉద్దేశం" అన్నది సరియైన తర్జుమా అవుతుందేమోనని నామతం. లేదా "కల్పనాధాతువు" అనవచ్చు. "కల్పనా ధాతువు" అనే మాటలో గోపాలరావుగారు భావించిన "అతని మననమునకు పాత్రమైన బీజ రూపము" అనే అర్థం కొంతవరకు సిద్ధం అవుతుంది. ప్రధాన భావన, మూలభావన, అనేవి కూడా కొంత వరకు ఆ అర్థాన్ని ధ్వనింపజేస్తాయి. అంతే గాని 'భావనాంకురం' అనే మాటకు ఎన్ని విధాలుగా చూచినా, ఆ అర్థం మృగ్యం. అదీగాక గోపాలరావు గారు Motif కు దఖలుచేయించిన అర్థం ఈ భావనాంకురంవల్ల ప్రతీతంకాదు.

అసలు ఈ పారిభాషిక పదాలు ఎట్లా పుడతాయి? ఒక లాక్షణికుడు ఒక విషయాన్ని, ఒక సంగతిని, ఒక అర్థాన్ని చెప్పదలచుకొని, ఆ అర్థాన్ని ఇచ్చేమాటలను, సాధ్యమైతే లోకంలో వాడుకలో వున్నదాన్ని, లేకపోతే, ఆ అర్థాన్ని ఇచ్చే ధాతువును చూచుకొని, అందులోంచి, తనకు కావలసిన మాటను సృష్టించుకుంటాడు. సర్వశాస్త్రాలలో ఇది ఇట్లాగే జరుగుతుంది. ప్రాచ్య దేశాలలో నేమి, పాశ్చాత్యదేశాలలో నేమి, లాక్షణికులు, శాస్త్రవేత్తలు అంతా ఇట్లాగే చేశారు. ఒక లాక్షణికుడు, ఒక శాస్త్రవేత్త, ఒక మాటకు ఒక అర్థాన్ని కుదిర్చి, దాన్ని, అందుకోసం ప్రయోగించగా, తర్వాతివాళ్ళు, దాన్ని గ్రహించి, అదే అర్థంలో ఉపయోగించుకుంటారు. ఆ మాటకు వున్న ఆ అర్థం సమగ్రం కాదని తోచినప్పుడు, తమకు కావలసిన అర్థాన్ని అందులో వివక్షచేసి వాడుకుంటారు. ఇది మనం చూస్తున్న ఆచారం. ఇట్లా ఈ ఆచారం పెరిగి, ఇది నాటక పరిభాష, ఇది శిల్పపరిభాష, ఇది శాస్త్ర పరిభాష అని ఏర్పడతాయి. ఇప్పుడు Motive అన్నమాట వున్నదనుకోండి, ఇది తర్కశాస్త్రంలో కూడా వస్తుంది. అక్కడ కూడా, ఈ మాటకు హేతువు తన్నులతో, ఇతరత్రా, దానికి వున్న అర్థంతోనే వున్నట్లే కన్పిస్తుంది. పైగా కవికి, శిల్పికి, అంతగా తేడా చెప్పుకోవలసిన అవసరం లేదు గనుక వారి తాలూకు పరిభాషల్లో కూడా అట్టే తేడాను పాటించుకోవలసిన అవసరం లేదు. అందుచేతనే ఈ Motif అనేమాటకు అర్థం వ్రాయవలసివచ్చిన చోట పాశ్చాత్య నిఘంటుకారులందరూ, In art, literature and Music, అని చెప్పి, దానికి వున్న అర్థాన్ని వివరిస్తూ వుంటారు. మన దేశంలో చూస్తే, మన ఆలంకారికులు, వేదాంత పరిభాషనే, దాదాపుగా తమ పరిభాషగా మార్చుకున్నట్లు కన్పిస్తుంది. ఇప్పుడు Spantaneous అనే మాట వున్నది. ఈ మాట ఇంగ్లీషులో ఏ అర్థంలో వున్నదో, అదే రకమైన అర్థాన్ని ప్రతీయమానం చెయ్యడానికి ఆనందవర్ధనుడు 'అవశం' అన్నమాటను వాడి వున్నాడు. ఇప్పుడు మనం spantaneous అన్న దాన్ని తర్జుమా చేయవలసి వచ్చినప్పుడు ఈ 'అవశా'న్ని తెచ్చుకొని వాడుకుంటే తప్పు లేదు. అట్లాగే, ఇతర శబ్దాల విషయంలో కూడాను.

"భావనకు సంయితము పూర్వమైన ప్రకృతియందలి చిత్రకారుని ఆకర్షించి, అతని మననమునకు పాత్రమైన బీజరూపము" (గోపాలరావు గారి మాటలు) Motif గనుక, దాన్ని బీజభావం అంటే భావనాంకురంకన్నా బాగుంటుంది. లేదా మూలబీజము, మూల సంకల్పము అనుకోవచ్చు అప్పుడు Cheney గారి Motivating Fragments కు కూడా మంచి తర్జుమా కుదురుతుంది. బీజ భావనా శకలములు అని చేసుకోవచ్చు. Motivating, Motive, అనే మాటల్లో అర్థతారతమ్యం ఉన్నది గనుక, Motivating Fagments చోదనాబీజ శకలము, లేకపోతే చోదనాబీజ భావనాశకలములు అని తర్జుమా చేసుకోవచ్చు. ఇదిభావన అన్నదాన్ని వదిలి పెట్టుకో కూడదనుకుంటే మాట. వదిలి పెట్టుకునే పక్షంలో బీజంతో సరిపెట్టుకోవచ్చు. లేదా ఆదిపురుషుడు అన్న పద్ధతిలో ఆది భావన, ఆదిబీజము అని ఈ motif ను తెచ్చుకోవచ్చు. అంతేగాని భావనాంకురం అనుకుంటే, బలవంతంచేత తప్ప, ఇంకోవిధంగా దానికి ఆ అర్థం పుట్టదు.

హ. శి.

# గ్రంథవిమర్శనము

## రవీంద్ర గీతాంజలి

[శ్రీ 'చలం'. మైత్రీగ్రంథమాల–విజయవాడ–2.]

రవీంద్రునికి నోబెల్ బహూకృతి సంపాదించిన సంకలనం ఆంగ్ల గీతాంజలి. వంగభాషలోని ఖేయా, నైవేద్య, గీతికా సంపుటాలలోని గేయాలు కొన్ని గద్యపద్యాలుగా అనువదించి రవీంద్రుడే ఆంగ్ల గీతాంజలి రూపొందించాడు.

భారతీయ భాషలలో పరమేశ్వర పరమైన కృతులు కోకొల్లలు. అయితే రవీంద్రుడు తన రచనలలో ఆ సంప్రదాయ మార్గాలేవీ అనుసరించలేదు. గీతాంజలిలో మన కట్టెదుట సాక్షాత్కరించే జగదీశ్వరు 'పురాణ' భగవానుడు కాడు. ఆయా ప్రాచీనావతారాల ప్రసక్తిగాని రాక్షస సంహారాది లీలలుగాని ఆంగ్ల గీతాంజలిలో గోచరించవు. అయితే రవీంద్రుని గీతికలన్నీ కేవల కవితామయమైన చల్లని సెలయేళ్ళుగా మన హృదయాలలో ప్రతిధ్వనిస్తాయి. ఇవి చదువుతూంటే మనలో కవితా మహేంద్రజాల మేదో జరిగినంత మహానందానుభూతి కలుగుతుంది. రవీంద్రకవి ఈశ్వర సాక్షాత్కారం పొందిన మహాతపస్వి కాకపోవచ్చును. కాని అటువంటి తపోధనులు పాడిన పాటలకన్న గీతాంజలి గేయాలే మన కెంతో సన్నిహితంగా ఆత్మీయంగా వినిపిస్తాయి.

'గీతాంజలిని అర్థం చేసుకోడానికి ముఖ్యమైన అభ్యంతరాలు అద్వైత వేదాంతము, సైన్సూ' అని తమ పీఠికలో పేర్కొంటున్నారు శ్రీ చలంగారు. అద్వైత వేదాంత ప్రవక్త శ్రీ శంకర భగవత్పాదులు 'సౌందర్యలహరి'వంటి భక్తికృతు లెన్నో రచించారు. నిజానికి అద్వైత వేదాంత దృక్పథమే పరిపూర్ణ భక్తిని ప్రేరేపించగలదేమో! శ్రీ రామకృష్ణ పరమహంస వంటివారి జీవనలీలలు దీనికి తార్కాణాలు. ఇలాగే నిశితమైన శాస్త్రీయదృక్పథంకూడా భక్తిభావానికి ప్రతిబంధకం కానక్కరలేదు. గొప్ప శాస్త్రవేత్తలు కొందరు పరమేశ్వర విశ్వాసంకల మనీషులు. కాని ఇటువంటి సునిశితమైన శాస్త్రీయ దృక్పథంఅవలంబించగల ధీరులు చాలా అరుదుగా కనిపిస్తారు.

శ్రీ చలంగారి దొక బలమైన వ్యక్తిత్వముద్రగల గద్యరచన. పూర్వపు రోజుల్లో చలంగారిమీద దుమ్మెత్తిపోసే పురాణా మనుషులే ఆయన రచన లెక్కువగా చదివేవారు. శ్రీ చలం నిశితమయిన నిజాయితీతో 'పెద్దమనుషు'లందరు కలిసి కట్టుకున్న సంఘాని కెదురు తిరిగిన మహావ్యక్తి. సాహిత్యంలోను జీవితంలోను సత్యాన్వేషణ సాగించిన అచంచల విప్లవకారులు. సామాన్యంగా వ్యావహారిక రచనలో అందరు పాటించే వ్యాకరణ నియమాలుకూడా ఆయన పాటించరు.

అయినా ఆయన గీతాంజలి మొదలుపెడితే ముగించేదాకా విడిచిపెట్టలేము.

"శిశువు కళ్ళపైన తాకిపోయే నిద్ర ఎక్కడనించి వొస్తోందో ఎవరికయినా తెలుసా?

కరిగిపోయే శరన్మేఘాంచలాన్ని అర్ధ చంద్ర రేఖా నవనవళ కిరణ మొక్కటి తాకినదట!

అతుషారస్నాత ప్రభాత స్వప్నంలో ఈ చిరునవ్వు ప్రథమ జననమని వదంతి. నిద్రించే శిశువు పెదవులపై దోబూచులాడే ఆ చిరునవ్వుకి!

శిశువు శరీరంపైన మెరిసే మధురమైన మృదుస్నిగ్ధనవ్యత ఇంతకాలం ఎక్కడ దాక్కొనిఉందో తెలుసా?

అవును తల్లి బాల్యదశలో మాటరాని అర్థంకాని లేత ప్రేమావ్యక్తతలో ఆమె హృదయాన్ని ఆవరించి నిద్రపోతో వుంది శిశువు దేహంపైన వికసించిన మధురస్నిగ్ధ కోమలత్వం."

శ్రీ చలంగారి అనువాదాని కొక పీఠిక రచించారు. ఈ రోజుల్లో కవితావగాహనలో బయలుదేరే సమస్యలన్నీ వారిందులో కూలంకషంగా చర్చించారు. మనిషికీ మనిషికీ మధ్య తీవ్రమైన అభిప్రాయభేదాలు ఆవేగాలు ప్రబలుతున్న ఈనాడు ఎలాంటి కవిత మీదయినా వైరస్యం కలగవచ్చును.

ఈ గ్రంథం చివర చేర్చిన 'అనుమేళన'లో సుప్రసిద్ధ కళావిమర్శకులు శ్రీ సంజీవదేవ్ ఠాగూరు వంశీయులనుగురించి, రవీంద్రుని రచనలను గురించి చక్కని సమీక్ష చేశారు.

"శాస్త్రి"

## మహారాణా బాప్పా

నవల. గుజరాతీ మూలం—శ్రీ దేశాయి. అనువాదం—శ్రీ భండారు సదాశివరావు. పుటలు–202 వె॥—మూడు రూపాయలు. ప్రకాశకులు–భారతి—సాహితి, డాబాతోట, విశాఖపట్టణం—4.

కాలచక్ర నేమిక్రమాన్ననుసరించి సమాజంలో మార్పులువస్తూ ఉంటవి. ఎప్పటికప్పుడు అవి కొత్తగా కనుపించడం. తదనుగుణంగా తమ జీవితాలు రూపొందించుకొనడానికి సమాజంలోనివారు ప్రయత్నిస్తూ ఉండడము కద్దు.

ఒకనాడు పతనోన్ముఖమై ఉన్న హిందూసమాజ వ్యవస్థ అరబ్బుల తాకిడికి కూకటివ్రేళ్ళతో కదిలినది. సామాజిక వ్యవస్థ పటిష్ఠమైనది కావచ్చు. ఎప్పటికప్పుడు బలం వృద్ధిచేసుకొంటూ ఉండడం తగు పోషణ అవసరం. లేకపోతే సమాజం క్రమంగా కృశించి జీర్ణించి అంతరించడం తప్పదు. బహిష్కారణాలు దానికితోడు అవుతవి. ఇది ఆ నాటి హిందూ సమాజానికి పూర్తిగా వర్తిస్తుంది.

నాడు మధ్య ఆసియా మహమ్మదీయుల దాడి నుంచి భారతజాతిని, సంస్కృతి ధర్మాలను రక్షించడాలకి కంకణం కట్టుకొని, మహాప్రవాహాన్ని ఎదురొడ్డి చెలియలికట్టగా నిలిచిన మహాపురుషుడే మహారాణా బాప్పా. బాప్పా జీవితం కృషి సఫలమైనది లేనిది చరిత్ర ఏ నాడో నిర్ణయించివున్నది. అలాంటి మహాపురుషుల గాథలు చదువుకొనడం అవసరం. కనుక నే బాప్పా గాథ తెలుగువారికి అందచేసిన ప్రకాశకులు అభినందనీయులు.

బాప్పా మేవాడు రాజ్యస్థాపకుడు. దాని రాజధానిఅయిన చితోడిదుర్గానికి ప్రాచీన నామధేయం చిత్రకూటం. దీనిని పాండవమధ్యముడైన భీముడు నిర్మించాడనే ఐతిహ్యం వుంది. తర్వాత ఇది చిత్తోంగ్—అనే వ్యవహారం పొందింది. 7 వ శతాబ్దంవరకు దీనిని 'మోరి' వంశ రాజులు పాలించేవారు. "మోరి" అన్నది మౌర్యశబ్ద తద్భవమట.

ఈదుర్గం క్రీ. శ. 784 లో బాప్పా హస్తగతమైంది. 1567 వరకు మేవాడుకు రాజధానిగా ఉంది. తర్వాత మేవాడ్‌కు ఉదయపురం రాజధాని అయింది. చితోడ్‌దుర్గం 1303 లో అల్లావుద్దిన్‌ఖిల్జీ వశమైంది. దీనిని 1351 లో మహమ్మద్ బిన్‌తుగ్లక్, 1534 లో బహదూర్ షా (గుజరాత్), 1567 లో అక్బర్ ముట్టడించారు.

ఈ నవల ఇతివృత్తం సంగ్రహంగా ఇది: రాజస్థానంలోని ఇరాదుర్గం అధిపతి మహేంద్ర నరపతి ఆటవికులైన భిల్లుల కోపానికి ఆహుతి అయినాడు. మహేంద్రుని కుమారుడు పసివాడు. అతన్ని కూడా మాతమార్చి రాజవంశాన్ని రూపుమాపాలని భిల్లనాయకుడుకూడా సంకల్పించాడు. ఇలాదుర్గ ధర్మాధికారి, మహేంద్రుని ఆప్తమిత్రుడు అయిన పరాశర సుశర్మ ఆ బాలుని తీసుకొని తన గ్రామానికి వెడలిపోయాడు. భిల్ల నాయకుడు దూదా చేతుల్లో పడకుండా కాపాడి కన్నబిడ్డవలె పెంచాడు. అతడే భోజుడు. పరాశరుని లక్ష్యం భారతజాతిరక్షణ, భారతీయ ధర్మసంస్థాపనము. దానికి భోజుని సాధనం చేసుకొన్నాడా తపస్వి. భోజుడే బాప్పాగా ప్రసిద్ధి చెందాడు. మహారాణా మానసింహుని అనంతరం మేవాడ్ సంస్థానానికి ఆధిపత్యం వహించాడు. మహమ్మదీయుల దాడి ప్రతిఘటించి దేశాన్ని రక్షించ పూనుకొన్నాడు. కడపట సర్వసంగ పరిత్యాగంచేసి ఏకలింగేశ్వరుని సన్నిధిని భౌతిక దేహం విసర్జించినాడా రాజయోగి.

ధర్మ సంరక్షణార్థం భైరాగులనే కదనరంగంలో దింపిన మహాయోగి పరాశరుడు, భర్త ఏర్పరచుకొన్న ఉత్తమ లక్ష్యసిద్ధికి జీవితాన్ని అర్పణ చేసిన ఇల్లాలు శ్రీలేఖ భోజునికి తల్లితండ్రులయినారు. ఆయా పాత్రల చిత్రణం మహోదాత్తమైన ఫక్కీలో ఉన్నది. రచనా విధానం విశిష్టమైనది.

రాజ్యాన్ని భగవదర్పితంచేసి ప్రధాన సేవకులుగా రాజ్యరక్షణ భారం వహించి శక్తి సామర్థ్యాలు ఉడుగకమునుపే సర్వమూ పరిత్యజించి విరాగులై, భగవద్భావంతో తపోనిష్ఠలో జీవితాలు సఫలం చేసుకొన్న మేవాడ్ రాజవంశం వారికి బాప్పాయే మూలపురుషుడు. వారు చరిత్రలో బాప్పారావులుగా ప్రసిద్ధి కెందారు. ఏకలింగేశ్వరుని సన్నిధిని రాజ్యరక్షణ భారం వహించే సంప్రదాయం బాప్పారావులకు విధించినది కూడా ఆ మహాపురుషుడే. బాప్పా జీవితం నిజంగా ధన్యమైనది.

భారతజాతి విశిష్టమైన జీవిత విధానానికి అంకితమైనది. ఉత్కృష్టమైన ధర్మ మార్గానికి కట్టుబడినది ఈజాతికి ఒక మతం లేదు అన్ని మతాలూ ముక్తి సాధనకు అనువైనవే; అనుసరణీయాలే. కనుక నే భారత జాతికి మతంపట్ల ఆవేశం లేదు. ఒకరిని తమలో చేర్చుకోవాలనే పట్టుదల లేదు. వైదికధర్మం ఈ నాటికీ నిలిచి ఉండడానికి కూడా అదే కారణం.

మార్గాలు భిన్నమైనా గమ్యం ఒకటేనని ఉద్ఘోషాలతో చేర్చుకొనే భారతీయులు ఆవేశకావేష్య

లకు లోనుకారు. కనుకనే ఇతర మతాలవారి దాడులకు గురికావడం, తాత్కాలికంగా దాసులు కావడం తటస్థించినవి. ఈలాంటి విపత్తులు సంభవించిన సందర్భాలలో మాత్రమే భారతీయులు కత్తిపట్టారు. అహింస బలవంతుల ఆయుధం. బలహీనులకు హింసామార్గమే శరణ్యం కావచ్చు. హింస సర్వదా వర్జనీయం కాదు. శిష్ట రక్షకుడు అయిన భగవానుడు దుష్ట శిక్షకుడు. కరుణామూర్తి అయిన శంకరుడు విలయ కారకుడు. హింసాహింసల సమన్వయమే శంకరుని మూర్తి. కనుకనే ధర్మ రక్షణార్థం కృపాణం ధరించిన బాప్పాకు ఏకలింగేశ్వరుడు ఆరాధ్య దైవమైనాడు.

సుప్రసిద్ధమైన బాప్పా జీవిత గాథ భారతజాతి ఏకత్వాన్ని కూడా చాటుతున్నది. ప్రతి ఒక్కరు విధిగా చదువదగినది ఈ నవల.

అనువాదం హృదయంగమంగా ఉన్నది. అచ్చు తప్పులు ఉన్నా మలిముద్రణంలో వాటిని సవరించుకోవడం జరుగుతుందని ఆశించవచ్చు.

ఒక్క మాట. మూల గ్రంథ రచయిత గురించిన వివరాలు పాఠకులకు అందజేయడం సముచితంగా ఉండేది. కనీసం రచయిత పూర్తిపేర్లు అయినా ఇచ్చి ఉంటే బాగా ఉండేది. మూలం ప్రసిద్ధమైనది. హిందీ మున్నగు భాషలలోనికి ఇదివరకే అనువదించడం జరిగినది. కేవలం అనువాదమేనని చెప్పుకోవడంవల్ల అనువాదకుల ఘనతకు భంగం వాటిల్లదు. ఈలాంటి నవలను అనువదిస్తూ 'కథాంశాన్ని ఉపయోగించుకొని స్వేచ్ఛా పద్ధతిలో రచించబడినది' అని చెప్పుకోవడం సబబు కాదు. —కామరాజు.

## అభినవాంధ్ర కాదంబరి

[రచయిత : విద్వత్కవిభూషణ, విద్వాన్ శ్రీ శేషము వేంకటకృష్ణశర్మ. పుటలు : 46. వెల : 1-50. ప్రాప్తిస్థానము : ఉషారంజనీ పబ్లిషర్సు, 66, స్వామి పిళ్ళైవీధి, చూళై, మదరాసు-7.]

బాణకృతమైన కాదంబరీ గద్యకావ్యం సుప్రసిద్ధమైంది. దాని కెంతటి ప్రశస్తి ఉందో తెలియడానికి దాని ననుసరించి సంస్కృతంలో వెలువడిన గద్యపద్య సంగ్రహాలను పరిశీలిస్తే స్పష్టమౌతుంది. బాణుని శైలి "ఓజస్సమాసభూయస్త్వ మేతద్గద్యస్య జీవితం" అనే లక్షణ నిర్వచనానికే కారణమైంది. "బాణోచ్ఛిష్ట మిదం జగత్"అని, కాదంబరీ రసజ్ఞానా మాహారోఽపి న రోచతే" అని మొదలుగా పెక్కు ఆభాణకాలే ఏర్పడ్డాయి. ఇట్టి ప్రశస్తిగన్న కాదంబరీ కథ దీర్ఘ సమాస జటిలవర్ణనమయంగాను, క్లిష్టాన్వయ భూయిష్ఠంగాను ఉండడంవల్ల కథామాత్రావగతికి సంగ్రహాలు అవసరమైనవి. ఆ విధంగా పుట్టిన పిల్ల కాలువలలో అభినవ కాదంబరి ఒక్కటి.

దీనిని రచించినవాడు ధుండిరాజకవి. ఈ ధుండి రాజకవి

"వత్సా శ్రీ జగదంబాం
పింగలకులజో ధుండిరాజాఖ్యః,
విచ్ఛ ద్బాణక వే ర్గాం
అభినవ కాదంబరీం దోగ్ధుం"

అని మంగళ మాచరించాడని, గ్రంథాంతంలో

"ఇత్థం త్వభినవ పూర్వా
పింగలకులజేన ధుండిరాజేన,
కాదంబరీ విరచితా
విదుషాం ప్రీత్యై సదా భూయాత్."

అని చెప్పుకున్నాడని అనువాదకులు పీఠికలో తెలిపారు. అభినవ కాదంబరీ కర్త ధుండిరాజ వ్యాసయజ్వ అని, లక్ష్మణ పుత్రుడని, ఇతడు 1718 ప్రాంతంలో ముద్రారాక్షస నాటకానికి టిప్పణి వ్రాశాడని, శహాజీ విలాసమనే సంగీత గ్రంథ మొకటి రచించాడని సంస్కృత సాహిత్య చరిత్రకారులు తెలుపుతున్నారు. ఈ ఇద్దరూ ఒక్కరే కావచ్చు. "పింగల కులజో ధుండిరాజాఖ్యః" అని చెప్పుకోడంవల్ల "ధుండిరాజు ఆంధ్రుడని చెప్పక తప్పదు. దాక్షిణాత్యులలో దక్కన తెగలవారికంటె తెలుగు వారే గృహనామముల కెక్కువ ప్రాధాన్య మిచ్చువారు" అని అనువాదకులు అన్నారు. కాని ఇంటి పేరుకు ప్రాధాన్య మివ్వడం మహారాష్ట్రులలోను ఉన్నది. పింగళి గృహనామం అన్ని కులాలలోను ఉన్నది (పింగళి వెంకటరామా రెడ్డి). మహారాష్ట్రులలోను పింగళి గృహనామం కలవారున్నారు (మోరో పంత్ పింగళే). ఇతడు శహాజీ విలాసం రచించడం, ధుండి నామధేయం మహారాష్ట్రులలో ప్రచురం కావడం మొదలయిన కారణాలనుబట్టి ఇతడు తంజావూరు మహారాష్ట్ర రాజాస్థాని అయిన మహారాష్ట్రుడయి ఉంటాడేమో ననిపిస్తుంది. శహాజీ 1712 లో ఉన్న తంజావూరు రాజు.

ఇక బాణకవి మూలగ్రంథానికి గద్యపద్యాత్మకాలైన ఆంధ్రానువాదాలు అసంఖ్యాకాలు. కాని ఈ అభినవ కాదంబరి నెవరూ అనువదించలేదు. తను బహుళ గ్రంథకర్తృత్వంతో ప్రఖ్యాతులైన శ్రీ శేషము వేంకటకృష్ణశర్మగారు దీనిని తెనుగు చేశారు. ధుండి

రాజు అభినవ కాదంబరిని సరళశైలిలో నడిపింపగా, శ్రీ శర్మగారు సరళతర శైలిలో మూలమునదగినవిధంగా అనువాదం సాగించారు. మూలకారుడు ఆర్యనే వాడగా, అనువాదకులు తదనుగుణంగా కంద గీతాలే వాడారు

పంపా సరస్తటే భూ
న్నజ్జన్మాహం విరక్తితః పిత్రా,
త్యాజ్యసం కదాచి దాగాత్
మృగయుః కశ్చి త్తముద్దేశమ్.
పాకం కీరార్భ్నహాతే
ముక్తాతే తేన దైవతో ముక్తః,
లుంఠ న్నన్యాని మునినా
హారీతే నాహ మాశ్రమం నీతః. (మూలం)

అన పంపాసరసీ తట
మున జనియించితిని దండ్రి పోషింప సుఖం
బున నుంటి నంత నొక దిన
మున వేటరి యొక్కడటకు ముదమున వచ్చెన్.
తక్కిన కీరమ్ములతో
నక్కువనై నాదు జనకు నుక్కడచి వనం
జక్కడపమి విధి వశమున
దిక్కతి నట దిక్కు లేక తపియించు చెడన్.
అతజే వేలకూలి పార
లాడుచు దిక్కడతేయున్న నన్నహా
రీతకమౌని యన్వగుడు
ప్రేమ గనుంగొని జాలి నొందుచున్.
శేరి వహించి యాకలను
నెమ్మది దువ్వుచు శాంతి నీగి నా
కాతర భావముం దలగి
గ్రక్కున నాశ్రమసీమ జేరిచెన్.

కాదంబరీ కథా జిజ్ఞాసువైన ప్రతి సహృదయుడూ చదవవలసిన లఘు కావ్యమిది. రా. చ.

# అమృతాభిషేకము

[గ్రంథకర్త: మధురకవి బెల్లూరి శ్రీనివాస మూర్తిగారు. ప్రకాశకులు: శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల, హిందూపురం, అనంతపురం జిల్లా. వెల రు. 1-25 న. పై.]

పంజవేళ నూగావల్లె కొంచకోనలు చేతనా చేతనములన్నియు ప్రకృతి మార్గమున మెరయుట విని, 'సంధ్యారవము'

"తత్త్వమును మేలుకొల్పి సౌందర్యభావ
గతులు గీల్కొల్పి శాశ్వతస్థితిని దెల్పి
వలయు పరమార్థముల నెల్ల వెలువరించె."

వని కవితాహృదయము నే తమ హృదయముగా సావిష్కరించిన మధురకవి బెల్లూరి శ్రీనివాస మూర్తిగారు; మెత్తగా నూహించి చిత్తమున కొత్తనట్లు లలితముగ చెప్పగలవారు; చాలనాళ్లుగా తెలుగు పాఠకులకు భారతి మొదలగు పత్రికలద్వారా పరిచితులు. ఆయన అప్పుడప్పుడు వ్రాసిన అనేక ఖండికల సంపుటి ఈ 'యమృతాభిషేకము'. ఈ పుస్తకమును గ్రంథకర్తలే ఆంధ్రాభ్యుదయము, వెన్నెల తీగలు, బుతులక్ష్మి అని మూడు భాగములుగా వింగడించినారు.

కవిత చెప్పుట కొక దీక్ష—తనకున్న సర్వప్రతిభను కవిగా లోకోపకారమునకు ధారపోసి యజ్ఞము చేయించునదా దీక్ష. ఇంక, రచనలో ఖండకావ్య రచన చాలకష్టము. దానికి, వర్ణ్యవస్తు తత్త్వదర్శనముతోబాటు భావతీవ్రత శిల్పసౌష్ఠవము ముఖ్యములు. కాగా, ఏదో సభకో సమావేశమో నిమిత్తముగ వ్రాసిన ఖండికలలో ఇవన్నియు సమకూరుట కష్టమే. కనియున్నవా టట్లు వ్రాయక తప్పదనుటగూడ అనుభవసత్యము. కాచినవి పాలే అయినను పాత్రనంటి మజ్జిగ చుక్క ఉన్నచో ఆ పాలు విరిగిపోవును. 'ఆంధ్రాభ్యుదయము'ను మొదటి భాగములోని పదునైదు రచనలలో చాలవాని కిట్టిగతి పట్టినది. ఇందు కల్లూరు సుబ్బారావుగారు, బెజవాడ గోపాలరెడ్డిగారు, రాధాకృష్ణపండితులు, ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారు మొదలగు తెలుగు నాయకులను గూర్చి వ్రాసిన పద్యములున్నవి. 'ఆంధ్రగురుధనము,' 'తెలుగుపతాక' వంటి కీర్తి కలు కొన్ని. వీటన్నిటిలోను ఆయా వానికి న్యాయము జరుగలేదు. సరిగదా కవి తన శక్తియుక్తుల కన్యాయము చేసికొన్నా డనిపించును. 'ఆంధ్ర

శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారి రచనలు

1. శివపూజా రహస్యము 1-12-0, 2. సౌందర్యలహరి 0-12-0, 3. భీమేశ్వరనుతి 0-8-0, 4 దేవీసూక్త పరమార్థము 0-12-0, 5. శ్రీ సత్యనారాయణశర్మ సాధనము 1-8-0, 6. శాస్త్ర సాధనము 0-8-0.

* కొలది ప్రతులు మాత్రమే గలవు.

సాధన గ్రంథమండలి, తెనాలి.

ప్రవాసి' అనే శీర్షిక క్రింది ఈ పద్యము చదివిన చాలు కవి చిత్తవృత్తి చక్కగా తెలియగలదు.

ప్రాచీనాంధ్రుల శౌర్యదీప్తులకు న
వ్యాంధ్ర ప్రశాంత ప్రభా
వీచీమాలకు కేలుమోడ్చెద మనో
భీష్టంబు సిద్ధింప నా
వాచాశక్తుల ధారవోసెద నిటన్
భవ్యాంధ్ర తేజంబు — సం
కోచం బేటికి — ధర్మ నిర్వహణకై
కోరాదు నా జీవముల్.

'వన్నెల తీగ'లను రెండవ భాగములో కవి ఆత్మాశ్రయమార్గమున వ్రాసిన పదిగేయాలు ఉన్నవి. వీనిలో 'కర్షకబురుజులు' 'శివదర్శనము' 'అందుకో లేను' అనునవి ఒక మోస్తరు రచనలు.

"వాన చినుకుల చెలిమి
లోని యాశల కలిమి
ఒక్కసారే మనసు
నుయ్యాల లూగించు"

వంటిచోట్ల అనుభవంలో గలవి అంతో ఇంతో కనబడుతుంది.

'బుడుగులక్ష్మి' అనే మూడవభాగములో మొత్తము 17 శీర్షికలున్నవి. ఒక్కడక్కడ కవి మందాక్రాంత వాడకమునకు చేయివేసినాడు.

'వసూధినీ ప్రవర'మనే శీర్షికలోని యీ చివరి పద్యం ఈ భాగంలోని రచనకు మచ్చుగా చిత్రించింది.

తేనెల్ చిందక పలికి వలలో
దించు నా వన్నెలాడిన్
తేనెల్ చిందక పలికి తలపుల్
త్రిప్పునా పై దివుండున్
నానా దుఃఖప్రకృతి జగతీ
నాటకాంకంబు త్రోవన్
జ్ఞానానందాలయము లలిత
స్థానమెందేని దవ్వో!

కవి యీపద్యములో ఆత్మార్థ మాలోచనలో పడినట్లే — ఏ ఖండికయినా అందలి సర్వభావములు ఏకోన్ముఖముగా నడిచి ఫలానుమేయముగా తీరి నిలువవలెను. ఈ సంపుటిలోని రచనలలో చాలాచోట్ల యిది కనబడదు. 'కథ' కొంతకొ కల్పన చేయబోయినచోట్ల గూడ అది ప్రావేశికి నిష్క్రమికీ ధ్రువాలు వలె చెల్లిపోవడ మంత బాగుగాలేదు.

ఇప్పుడు మనసుకు తట్టునది ఎవరైనను కవి తాను వ్రాసిన కలగూరగంప నంతటిని కుప్పవోసి బయట పెట్టవచ్చునా అనునది. 'నిలుకడ వలయు కృతికి' అన్నారుగదా పెద్దలు. ఆ నిలుకడ దూడుకొనకపోయిన నెట్లు మరి? శ్రీనివాసమూర్తిగారు ముందు ముందు మేలైన రచనలు చేయగలరని ఆశించుట తప్ప చేయగలదేమియును లేదు.

ఎస్. కె.

# గ్రంథస్వీకారము

### ఆంధ్ర పుష్పబాణవిలాసము

రచయిత: శ్రీ అల్లంరాజు లక్ష్మీపతి. పుటలు : 8 మూల్యం : 25 నయాపైసలు. ప్రతులకు : రచయిత, రామారావుపేట, పెద్దాపురం (తూర్పుగోదావరిజిల్లా).

### యుగళ గీతి

పద్యకావ్యం. రచయిత : శ్రీ పరాశరం గోపాల కృష్ణమూర్తి, ఎం. ఏ., పుటలు : 82, వెల : అర్ధ రూపాయ. ప్రతులకు : వేంకటేశ్వర బుక్ డిపో, సిద్ధిపేట, మెదకుజిల్లా.

### బాలకృష్ణశతకము

రచయిత : ఆయుర్వేదవైద్య పెద్దింటి సూర్యనారాయణమూర్తి. పుటలు : 20. అమూల్యము. ప్రతులకు : రచయిత, ఆలమూరు, తూర్పుగోదావరిజిల్లా.

### పరమహంస దివ్యకథాసుధ

పద్యకావ్యం : రచయిత : కావ్య శ్రీ సుందాబత్తుల నారాయణరావు, పుటలు : 50 వెల: తెలియదు. ప్రాప్తిస్థానం : తెలియదు.

"ద్రావిడభాషా సామ్యములు"
అను గ్రంథము కళాప్రపూర్ణ వఝల చినసీతారామస్వామిశాస్త్రి గారిచే విరచితము. వెల రు. 2-50.
గ్రంథకర్త చిరునామా :
వఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు
కోడుగంటివారి వీధి :: విజయనగరము.

### శ్రీ తులసీ మహిమామృతము

తులసీ మహిమ తెలిపే ఏకాదశ ప్రకాశాలుగల శ్రీ శ్రీ సీతారామదాస ఓంకారనాథజీ గారి హిందీ మూలానికి శ్రీ దాసశేషుడుగారి అనువాదం. పుటలు : 126. వెల : 1-8-0. ప్రాప్తిస్థానం : సాధన గ్రంథ మండలి, తెనాలి.

### మహాకవి పోతన భాగవతము

ఇది భాషాభూషణ శ్రీ బూదూరు రామానుజులు రెడ్డిగారు (తిరుత్తని) ప్రొద్దుటూరులో ఈ సంవత్సరం జరిగిన రాయలసీమ సాహిత్య పరిషత్సమావేశంలో చదివిన ప్రసంగం. పుటలు : 24. వెల: 25 నయా పైసలు. ప్రాప్తిస్థానం : రచయిత, తిరుత్తని, చిత్తూరు జిల్లా.

### విజ్ఞాన శతకము

రచయిత : శ్రీ బొగ్గవరపు వీరశేఖరశాస్త్రి, పుటలు : 56. వెల: ఒక రూపాయి. ప్రాప్తిస్థానం : రచయిత, శిల్పకళా సామ్రాజ్యం, బళ్లారి.

### శ్రీ సాయీ మననము

మూడు సర్గల కావ్యం. రచయిత : శ్రీ బాపట్ల హనుమంతరావు. పుటలు : 130. వెల : ఒక రూపాయి. ప్రతులకు : రచయిత, శ్రీ సాయీ కుటీరం, చిన్న గంజాం, గుంటూరుజిల్లా.

### ఆపదుద్ధారక శతకము

రచయిత : శ్రీ బాపట్ల హనుమంతరావు, పుటలు : 28, వెల : ఎనిమిదణాలు. ప్రాప్తిస్థానం : రచయిత, శ్రీ సాయీ కుటీరం, చిన్నగంజాం, గుంటూరుజిల్లా.

### మేఘసందేశము

ఆంధ్రానువాదకుడు : శ్రీ శ్రీపాద శ్రీరామమూర్తి కవి. పుటలు : 22. వెల : 1-50. ప్రతులకు : రచయిత, మునగపాక, నరసాపురం తాలూకా, పశ్చిమగోదావరిజిల్లా.

### భక్తిగీతములు

రచయిత్రి : శ్రీమతి యర్రగుంట్ల సీతాలక్ష్మమ్మ. పుటలు : 44. గీతాలు : 46. వెల : 0-8-0 ప్రతులకు : రచయిత్రి, C/o శ్రీ వై. సుబ్బయ్య, 2/128, రెండవ రోడ్డు, జార్జి పేట, అనంతపురం.

### యజుర్వేదభాష్యము

పంచమాధ్యాయము. మహర్షి దయానంద సరస్వతీ కృత సంస్కృతభాష్య, భాషాభాష్యాలకు ఆంధ్రానువాదము. అనువాదకులు : శ్రీ పాలడుగు శేషాచలాచార్య, శ్రీ అన్నే కేశవార్యశాస్త్రి. పుటలు: రాయల్ సైజు 302 నుంచి 368. వెల: 2-0-0.

తృతీయాధ్యాయము, అనువాదకులు పైన పేర్కొనబడినవారే. పుటలు : 154 నుంచి 244. వెల : 2-0-0.

షష్ఠాధ్యాయము. అనువాదకులు పైన పేర్కొన్న వారే. పుటలు : రాయల్ సైజు 369 నుండి 4-18. వెల : 2-0-0.

### భగవచ్చింతన : భగవత్ప్రాప్తి

మూలం : శ్రీ దయానంద సరస్వతి. అనువాదం శ్రీ అన్నే కేశవార్యశాస్త్రి. పుటలు : 64. వెల : 37 నయా పైసలు.

### మహర్షి దయానంద సరస్వతి

గ్రంథకర్త : శ్రీ పాలడుగు శేషాచలాచార్యులు. పుటలు : 80. వెల : 50 నయా పైసలు.

### ఆర్యసమాజమనగా నేమి?

'ఆర్యసమాజ్ క్యాహై ?' అనే మహాత్మా నారాయణస్వామిగారి హిందీ పుస్తకానికి శ్రీ రాజరత్నాచార్యులుగారి అనువాదం. పుటలు: 120. వెల: 0-10-0.

### యజ్ఞోపవీత రహస్యము

రచయిత : శ్రీ పాలడుగు శేషాచార్యులు. పుటలు : 32. వెల : 0-3-0. ఈ గ్రంథాల ప్రాప్తిస్థానం : ఆర్యసమాజము, సికిందరాబాదు, ఆర్యసమాజము, సీతాఫల్ మండి.

# సాహితీ సుగతుని స్వాగతం

మానవుని మనోవికాసానికి, జ్ఞానాభివృద్ధికి శాస్త్రాలెంతో, లలితకళావిషయాలూ అంతే. అయినా, శాస్త్రాలంటే హెచ్చుగాను, లలితకళలు లోచ్చుగాను పరిగణించడం పరిపాటి అయింది ఎందుకో!

ఈ భేదబుద్ధి ఈనాటిదే కాదు; ఏనాటినుంచో వస్తున్నది మనలో. శాస్త్రజ్ఞులు తాము గొప్పవారమని విర్రవీగడం, పరవారిని చిన్నచూపు చూడడం గురించి ఎన్నో గాథలు వింటున్నాము. అలాగే తక్కినవారూ తాము లోకజ్ఞులమంటూ శాస్త్రజ్ఞులను పరిహసించడమూ కద్దు. "శాస్త్రేషు హీనాః కవయో భవంతి," "పాండిత్య దూరాః కవయో భవంతి" అని శాస్త్రజ్ఞులంటే, 'వైయాకరణాః ఖసూచయః" అని శాబ్దికులను చెప్పేవారు ఇతరులు. "తర్క కర్కశబుద్ధులని" నైయాయికులను మరొకరు దూసేవారు. హేతువాదమంటే మాకేమి తెలుసునని తార్కికులంటే, మీకు శబ్దవిభక్తిజ్ఞానమే లేదని "అపాత్రకాణాం తార్కికాణాం అర్ధరీ వతు శబ్దరీ" అంటూ వారి భాషాజ్ఞానాన్ని ఈసడించేవారు. ఇక ఆయుర్వేదులు తామే ప్రాణాచార్యులం ప్రపంచానికని విర్రవీగితే, జ్యోతిర్విదులు తామే ద్రష్టలమని, భవిష్యత్ స్రష్టలమని విజృంభిస్తే, వారిని "మీరు భావను పాడుచేసి సంహరిస్తున్నారయ్యా" అని విరసించేవారు భాషాకోవిదులు. ఈ పరస్పర దూషణ తిరస్కారాలతో మన ప్రాచీనసాహిత్యంలో చాటువులు, ఖండికలు, ఎన్నో పుట్టుకొచ్చాయి.

సరే! ఇప్పటి పరిస్థితి సరీ అధ్వాన్నం. 'సైన్సు' చదువుకోన్న వారిని పలుకరించలేము; కన్నెత్తి చూడలేము. నేడు ప్రపంచమంతటా సైన్సుదే సామ్రాజ్యమన్నా తప్పులేదు. మధ్యయుగాలలో పాశ్చాత్యదేశాలలో సైన్సుకూ, మతానికీ సంఘర్షణ వచ్చింది. సైన్సుతో జనానికి విపరీతజ్ఞానం కలిగి తమ అధికారాలకు చ్యుతి ఎక్కడ సంభవిస్తుందో అని మతాధీశ్వరులు జాగ్రతపడి సైన్సును ఒక మొట్టికాయ వేశారు.

కాని, పరిశ్రమలు అభివృద్ధి చెందడంతో సాంకేతిక విజ్ఞానానికీ, సైన్సుకూ ప్రాబల్యం హెచ్చి, సైన్సు చదువుకున్న వారికి సంఘంలో గౌరవం ఇనుమడించింది. నిజమే. లోకమంతా వ్యాపారసరళి. దేనివల్ల, ఎవరివల్ల ద్వితీయపురుషార్థానికి దోహదమో, దానికి, వారికి పెద్దపీట.

ఇక సాంకేతికాభ్యుదయం లేని భారతం వంటి బడుగుదేశాలలో సైన్సుది నియంతృత్వమే. అది చెప్పిందే వేదవాక్యం, అది గీచిందే గీత; తక్కినది రాత, రోత. ఈ చిత్తవృత్తికి కారణం వేరే చెప్పనక్కరలేదు; వెనక చెప్పిన ద్వితీయపురుషార్థ ప్రభావమే. దేశం నాల్గు మూలలా ఆనకట్టలు, జలాశయాలు, జలవిద్యుత్కేంద్రాలు—ఒక్కటేమిటి ఇవన్నీ సైన్సు అనుగ్రహిస్తుండగా, మరి తల ఒగ్గకపోవడం ఎలాగ? దానితో జాతి సంపద మన కళ్లెదుటే ఇనుమడిస్తుండగా జోహార్లు చేయకపోవడం ఎలాగ?

వాణిజ్యరంగంలో సైన్సుకు ఉన్న పలుకుబడి ప్రతిష్ఠ నేడు కళాశాలలో సైన్సు శాఖల 'సీట్ల'కు రద్దీ. సైన్సు సీట్లకు ఏడుకొండలవాని దర్శనానికి లాగ తెగబారెడు 'క్యూ'లు. తక్కిన శాఖల సీట్లకు, అందులోను చరిత్ర భూగోళం శాఖలవైపు గాలైనా వీచదు. "బతకలేక బడి పంతు" లన్నట్లు ఏదీ గతిలేక పోతే హిస్టరీ సీటు! ఒకప్పుడు ఇంగ్లీషు 'లిటరేచర్ సీటుకు' సైన్సుకున్న వైభవమే ఉండేది. అప్పుడది సంపూర్ణంగా అధికారభాష. దానిలో నిష్ణాతుడే కళాశాలల ప్రిన్సిపాలు; సైన్సు చదువుకున్నవారు ఇంగ్లీషు బోధించడానికి వీలులేదు; అతనికి భాష ఏమి వచ్చు?-ఇదీ ధోరణి. కాని, నేడూ, నాడూ కూడా విజ్ఞానశాస్త్రజ్ఞులలో కేవలం భాషావేత్తలేనని భ్రాంతి గొల్పే వక్తలూ, మహారచయితలూ ఉన్నారు. వారి శైలి ఏ మహాకవి శైలికైనా దీటుకాగలదు. అలాగే కేవలం రచయితలుగా పేరు పొందినవారిలో విజ్ఞానశాస్త్రమే వీరి ప్రధాన విషయమా!—అని పఠితలను విరుగుపడజేసే వారూ ఉన్నారు తమ రచనలతో.

ఆర్థిక ప్రయోజనదృష్టితో ఒకొక్కప్పుడు ఒక్కొక్కదానికి ప్రాధాన్యం కలుగడం సహజమే. అంతమాత్రాన ఉచ్చనీచా లేవీ లేవు. బుద్ధి వికాసానికీ, జ్ఞాన విస్తృతికి సైన్సు ఎంత అవసరమో, కళా భాషా చరిత్రాదులూ అంతే అవసరం. —రామచంద్ర.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.